

పోటీ ! చిత్రకారుడు: రామకృష్ణగంగరాజు. వాల్తేరు.

# ఆంధ్రప్రదేశ్

ప్లవ ఉగాది సంచిక

సంపుటి 5 | మార్చి 1961 | సంచిక 5
ఫాల్గుణ-చైత్ర—1882, 83-శక

# విషయసూచిక

ముఖచిత్రం : పండుగపూట దేవాలయానికి.

చిత్రకారుడు : యం. శంకరరావు, అనకాపల్లి

వెనుక అట్ట : విశాఖపట్నం బీచ్ దృశ్యం.

## చందా వివరాలు

| | | |
|---|---|---|
| సంవత్సరానికి | — | 2 రూపాయల 16 నయాపైసలు |
| విడి ప్రతి వెల | — | 18 నయాపైసలు |

Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad-1

# సమస్యా పూరణము

నాయని సుబ్బారావు

ఒక సమస్యపుట్టి యుత్పన్నమౌలోన
నొకటియొకటి మరియు నొకటిగా స
మస్య లేచి జగతి మర్దించు కోదండ
ముక్తపుంఖితాస్త్రముల విధాన.

తీరని క్లిష్టసమస్యల
పారము ముట్టంగలేని బహుబాధా దు
ర్వారాయాసోక్ష్యాంత
స్సారులు మానవులు నష్టజన్మపతాకల్.

ఘనబాహాబల దర్పదీపిత మహోగ్ర క్రౌర్యవైశ్వానరుల్
జనతానాథులు మేకవన్నెపులులై శాంతిప్రియంభావుక
త్వ నిరూఢాద్భుతభంగి సత్సభలలో భాషింతురేగాని యెం
దును నేయొక్క సమస్యయున్ వదలిపోదున్నాటికిన్నేటికిన్.

ఇదె వసంతమువచ్చె నింక నీ చలిబాధ చిక్కెబోయని సంతసించులోన
నవనవోన్మేష మాధవమాస చైతన్యభంగిలో గ్రీష్మమ్ము తొంగిచూచి,
కఠినాతపమ్ము ధాకకు తట్టుకోగలమన్న ధైర్యము చిక్కునంతలోన
ప్రావృడ్ఘనాఘనార్భట వర్ష పాత సాయంకాలముల నెదలంగవించి,——

ఇదియు సమ్యక్సమన్వయ దృష్టియైన
కాలపురుషుని లీలావికాస సరణి!
అదియు విశ్వప్రతారకులౌ సకాల
కాలపురుషుల లీలావికార సరణి!

ఒక మానిసి ఒక సంఘము
ఒక దేశముయొక్క నిజము నూహింపరు తె
క్కకు మీరు గోళముల సం
కెకు దార్ఢ్యక నిదురపోవనే పోవరుపో.

వానికి స్వేచ్ఛనిచ్చితిమి వానికి మేము సహాయమంచు స
వ్వాని కరమ్ము లొక్కడిటుపట్టి యొకండటుపట్టిలాగి యా
దీనుని మేను లెక్కలకు జేలని ముక్కలు సేయజూతు రి
క్లేని పరిష్కృతమ్ముగునశే యిదియొక్క సమస్య భూమిలో.

అప్పలముంచి భూవలయమంతయు లోగొను నాసనేయడో
అప్పతియైనవాడు చెలియల్ గిరివెట్టిన కట్టదాట డీ
యప్పులవాండ్రు పెట్టుబడులంచును కూటములంచు కుప్పలున్
తెప్పలు వేసి మానవుల త్రిక్కుల త్రిప్పలలో మథింతురున్.

పంచుల పంచారింపుల
పంచితులరుగాక ధర్మపరిణతబుద్ధిన్
సంచిత సుస్థిరశాంతి స
మంచిత శోభనము పంచుడయ్యా ధరిత్రిన్.

అదె యాలోకనరమ్యనూతనవసంతానందచైతన్య సం
పద సంక్లిష్టసమస్యలెల్ల విరియన్ ప్రాలేయభాను ప్రభా
స్పదరోచిర్నిహితాచ్ఛ దివ్యపదమై భాసిల్లు తన్మంగళ
ప్రదనిత్యామృతధార సర్వజనతాప్రాగల్భ్యమేపారుతన్.



# తెలంగాణా అభివృద్ధి

"తెలంగాణా ప్రాంతం అభివృద్ధిపట్ల ఉద్దేశపూర్వకంగానే ప్రభుత్వం నిర్లక్ష్యం వహించిందని చేసిన ఆరోపణ పూర్తిగా నిరాధారమైనది. కాగా రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతంగా పరిగణించి తెలంగాణా అభివృద్ధి విషయంలో ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధగైకొన్నది. గడిచిన నాలుగు సంవత్సరాలలో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల ప్రజల దృక్పథంలో గమనార్హమైన మార్పు వచ్చింది. ఈ ఉభయ ప్రాంతాల ప్రజల మధ్య పెంపొందుతున్న సన్నిహితత్వం, భావైక్యత దినదినప్రవర్ధమానమై, సుస్థిరమై సాంఘికంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా రాష్ట్రపురోభివృద్ధికి తోడ్పడగల వనడంలో ఎంతమాత్రం సందేహంలేదు. ఎటువంటి వివాదానికీ తావుండరాని రంగంలో ఏర్పడిన విషయపరిజ్ఞానశూన్యమైన, హానికరమైన వివాదం, ఈ శ్వేతపత్రంలో ఇచ్చిన వివరాలవల్ల ఇంతటితో సమసిపోగలదని ఆశింపబడుతున్నది. ఈ పత్రంలో పేర్కొనబడకుండా ఇంకేదైనా విషయం మిగిలివుంటే దానిని సరిదిద్దుకోవడమో లేదా ఆ విషయంలో సంజాయిషీ ఇవ్వడమో జరుగుతుంది. తెలంగాణా ప్రాంతంయొక్క న్యాయమైన అవసరాలను తీర్చడానికి ప్రభుత్వం సర్వదా సిద్ధంగావుంది," అని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1960 ఫిబ్రవరి 14 వ తేదీన పత్రికలకు విడుదలచేసిన శ్వేతపత్రంలో పేర్కొన బడింది.

ఈ శ్వేతపత్రం పూర్తి పాఠం ఇది :

గత డిశెంబరు 23 వ తేదీన తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు జరిపిన పత్రికావిలేఖరుల గోష్ఠి వివరాలు ప్రభుత్వం దృష్టికి వచ్చినవి. ఈ గోష్ఠిలో, ప్రాంతీయ సంఘంపట్ల ముఖ్యమంత్రి, ప్రభుత్వంవారు నిర్లక్ష్యభావం చూపుతున్నారనీ, తెలంగాణా ప్రాంతం ఆర్థికాభివృద్ధి విషయంలోనూ అలాగే ఇతర రంగాల అభివృద్ధి విషయంలోను శ్రద్ధవహించడంలేదని ఆయన ఆరోపించారు. కనుక యదార్థ విషయాలు ప్రజల సమాచారార్థం దిగువ ఇవ్వబడినవి:

*అధికార సహాయం, ఉపనిబంధనలు :*

తెలంగాణా ప్రాంతానికి సంబంధించిన పరిపాలనా సంబంధమైన విషయాలపై దర్యాప్తు జరిపే సందర్భంలో ప్రాంతీయ సంఘంతాలూకు ఉపసంఘాలముందు ప్రభుత్వోద్యోగులను రప్పించే అధికారాన్ని సంఘానికి ప్రభుత్వం తిరస్కరించిందన్నది ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు తన సుదీర్ఘ ప్రకటనలో చేసిన ప్రధానమైన ఆరోపణలలో ఒకటి. కాబట్టి ఈ విషయంలో కొన్ని సంగతులను స్పష్టంచేయవల్సివుంది. ఏమంటే సాక్ష్యసేకరణకు ప్రభుత్వాధికార్లను కమిటీలముందు పిలిపించే విధానంలోని మంచిచెడ్డల సంగతి ఎలావున్నప్పటికీ సంఘం కోరినప్పుడు అది అడిగిన సమాచారాన్ని లభింపజేయడానికి గానీ లేదా దానిముందు హాజరు కావడానికిగాని అధికార్లెవ్వరూ ఎప్పుడూ నిరాకరించడం జరగలేదు. ప్రభుత్వ విధానానికి బాధ్యుడు మంత్రి కనుక ఉపసంఘాల ముందు స్వయంగావెళ్ళి సాక్ష్యం ఇవ్వడానికిగానీ లేదా అందుకు ఎవరైనా అధికారిని కోరడానికిగాని వీలునుబట్టి ఆయనే నిర్ణయించుకోవాలని ప్రభుత్వం నిశ్చయించింది. తమ విధానాలను వివరించడంగానీ లేదా సమర్థించడంగాని తమ అధికార్లద్వారాకంటే మంత్రుల ముఖతః జరగడమే మంచిదని భావించడం వల్లనే ఈ విధంగా నిర్ణయించబడింది. అంతేగాని ఉపసంఘాలకు ఏదైనా సమాచారం లభింపజేయకుండా వుండాలన్నది ఈ చర్య ఆంతర్యం కానేకాదు. ఉపసంఘాలు ఎంత సమాచారాన్ని కోరినప్పటికీ సాధ్యమైనంత తొందరలో ఆ వివరాలను వాటికి అందజేయడం జరిగింది. ప్రాంతీయ సంఘం సాక్షులు హాజరుకావాలని కోరడం, పత్రాలు చూపాలని ఆదేశించడం, రాష్ట్రపతి ఉత్తర్వులకు విరుద్ధం కనుక, సంఘానికి ఈ హక్కులను ప్రసాదించే ఉపనిబంధనలను

రద్దుపరచవలసిందిగా కేంద్రప్రభుత్వం ప్రాంతీయ సంఘానికి ఈ ప్రభుత్వం ద్వారా సలహా ఇచ్చింది. ఈ విషయాన్ని ప్రాంతీయ సంఘం అధ్యక్షుడుకూడా ఒప్పుకున్నారు. 1960 మే 26వ తేదీన ముఖ్యమంత్రీ, ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు ఒక ఒప్పందానికి వచ్చారు. దాని ప్రకారం, ప్రాంతీయ సంఘం పిలిచినప్పుడు ఆయాశాఖల అధికార్లు తమ శాఖకు సంబంధించిన మంత్రి అనుమతితో దానిముందు హాజరు కావచ్చునని నిర్ణయం జరిగినది. ఈ ఏర్పాటు అనభ్యంతరకరమైనదే కాకుండా మంత్రులకూ వారి ఉన్నతోద్యోగులకు చాలా ప్రయోజనకరమైనది కూడా. 1960 మే నెలలో పబ్లిక్ వర్క్సుశాఖ కార్యదర్శి శ్రీఆర్. ప్రసాద్, ఐ.సి.ఎస్., కొన్ని ప్రశ్నలకు సమాధాన మివ్వడంలో తికమక పడ్డారని చేసిన ఆరోపణ నిరాధారమైనదని సందర్భవశాత్తు ఇక్కడ తెలియ జేయవలసివున్నది. ఈ సంఘం ముందు హాజరుకావల్సిన అవసరం శ్రీ ప్రసాద్‌కు ఎప్పుడూ కలుగలేదు.

ప్రాంతీయ సంఘం కోరిన సమాచారమంతాకూడా దానికి సరఫరా చేయబడినది. సంఘం కోరిన ఏ అధికారికూడా దాని ముందు హాజరుకావడానికి నిరాకరించలేదు. అయితే అందుకు ఆ ఉద్యోగులు తమ శాఖకు సంబంధించిన మంత్రివద్ద అనుమతి పొందడంతో జరిగిన ఆలస్యాల మూలంగా వారు సంఘంముందు హాజరుకావడంలో కొద్దిపాటి ఆలస్యాలు జరిగితే జరిగివుండ వచ్చును. పైన పేర్కొన్న ఒప్పందం ప్రకారం, ఈ సంఘంతో సహకరించే విషయంలో ఏ విధంగానూ లోటుజరగ లేదనడానికి, ఇప్పటివరకూ ఈ సంఘం ప్రభుత్వానికి సమర్పించగలిగిన 39 భారీనివేదికలే సాక్ష్యం. ప్రభుత్వ సచివాలయోద్యోగులు, ఉన్నతాధికార్లు, శాసనసభా వ్యవహారాలపట్ల కంటే కూడా ప్రాంతీయ సంఘం పనిపట్లనే ఎక్కువ సమయం వినియోగించారనడం అతిశయోక్తి కాజాలదు.

ఈ సంఘం చేసిన సిఫార్సులపై ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలకు సంబంధించిన కొన్ని వివరాలనూ, అలాగే ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ వ్యవహారాల నియమావళిలోని 9వ నిబంధన క్రింద గవర్నరు ఉత్తర్వుల ఆధారంగా తిరస్కరించబడిన సిఫార్సులకు సంబంధించిన వివరాలను సాధారణ పరిపాలనశాఖ సంఘానికి అందజేయలేకపోయినదనికూడా ప్రాంతీయసంఘం అధ్యక్షుడు ఆరోపించారు. వాస్తవపరిస్థితి ఏమంటే గవర్నరు నిర్ణయాల విషయమై ఈ సంఘానికి ఎప్పుడూ వెంటనే తెలియ జేయడం జరుగుతున్నది. పోతే అంకెల వివరాలు ఇచ్చే విషయంలో కొంత ఇబ్బందివస్తుంది. ఎందుకంటే ఈ సిఫార్సులు అనేక అంశాలకు సంబంధించి పందలాదిగా వుంటాయి. వాటిలో ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయసంఘం ఉత్తర్వు ఏడవ సెక్షను పరిధి లోనికి రానటువంటివీ, సాధారణమైనటువంటివీ చేరివుంటాయి. అయినా ప్రాంతీయసంఘం చేసిన సిఫార్సులలో కొన్నిమాత్రమే శాసనసంబంధమైన విషయాలకూ, ప్రభుత్వవిధానాలకు సంబంధించినవి. అంతేగాకుండా అవి చెప్పుకోదగినంతగా ఆర్థిక వత్తిడులకు దారితీసేవికూడాకావు. సంఘం అధ్యక్షుడు తమ ప్రకటనలో పేర్కొన్న సిఫార్సులే ఇందుకు నిదర్శనం. ఏమైనప్పటికీ ప్రభుత్వం సాంకేతికమైన లాంఛనాలను ఎన్నడూ అంతగా పట్టించుకొనకుండా ప్రాంతీయసంఘం చేసిన అన్ని సిఫార్సులనుకూడా ఆ అంశాలు దాని అధికార పరిమితికి సంబంధించివున్నా, లేకపోయినా పరిశీలనకు తీసుకున్నది. నిజానికి ప్రాంతీయ ఐక్యత, భావసమైక్యతను వర్ధిల్లజేయాలనే ఉద్దేశంతోనే ప్రభుత్వం, ప్రాంతీయసంఘాన్ని తెలంగాణా ప్రజల ప్రతినిధిగా పరిగణించి, దాని ప్రతి సిఫార్సును — అది రాష్ట్రపతి ఉత్తర్వులోని అంశాలకు సంబంధించినదైనా కాకపోయినా, సాధారణమైనదైనా, నిర్దుష్టమైనదైనా — ఎంతో జాగ్రత్తతో పరిశీలిస్తూ వస్తున్నది. సాధారణంగా ఈ సిఫార్సులన్నీ ఆమోదింపబడుతూనేవున్నాయి. ప్రాంతీయసంఘం సిఫార్సులపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించడం నిమిత్తం తెలంగాణాప్రాంతానికి చెందిన ఒక ఉన్నతోద్యోగి అధ్వర్యంక్రింద సాధారణ పరిపాలనశాఖలో ఒక ప్రత్యేక విభాగంకూడా ఏర్పాటు చేయబడినది. ఈ విభాగం ప్రధానకార్యదర్శి, ముఖ్యమంత్రుల ప్రత్యక్ష పర్యవేక్షణలో పని చేస్తుంది. ఎప్పుడైనా ఏదైనా విషయంలో ప్రాంతీయసంఘం అభిప్రాయాలతో ప్రభుత్వానికి ఏకీభావం కుదరకపోయినా లేదా ఏదైనా సిఫార్సును ఆమోదించడంలో అభ్యంతరంగానీ, ఇబ్బంది కాని ఏర్పడినా వాటిని గవర్నరు పరిశీలనకుపంపి ఆయన ఆదేశానుసారం నడుచుకొనడం జరుగుతున్నది. ఏ విషయానికి సంబంధించిన అంకెలనైనా సంఘం కోరినప్పుడు అందజేయకపోవడం ఎప్పుడూ జరుగలేదు. పైగా ప్రధాన విషయాలకు సంబంధించిన అంకెల వివరాలను కమిటీవారే తమ రికార్డుల నుంచే సేకరించుకొనగలస్థితిలో వున్నారు. అంకెల వివరాలను సరఫరాచేయడంలో వున్న ఇబ్బందల్లా సంఘానికి సంబంధించిన అంశాలేవో, సంబంధించని అంశాలేవో తేల్చుకోవడంలోను.

వివిధ కార్యాలయాలనుంచి ఆ వివరాలను సేకరించడంలోను వున్నవి. అయినప్పటికీ అధ్యక్షుడుచేసిన ఆరోపణలు దుష్పరిణామాల దృష్ట్యా ఇందుకు సంబంధించిన సమాచారం ఇప్పుడు సేకరింపబడుతున్నవి. సాధ్యమైనంత త్వరలో దానిని సంఘానికి అందజేయటం జరుగుతుంది.

*ప్రణాళిక క్రింద ఖర్చు :*

ప్రణాళికా పథకాలక్రింద చేసిన ఖర్చు విషయంలోకూడా తెలంగాణాపట్ల అశ్రద్ధ, అలక్ష్యం అన్నది ఎన్నడూ చూపబడ లేదు. తెలంగాణా ప్రాంతంలో ఆరంభంలో ఈ కృషి కొంత అసంతృప్తికరంగా వున్నా తరువాత తరువాత జరిగిన అభివృద్ధి ఆంధ్రప్రాంతంకంటే తృప్తికరంగా వుంది. అంతేగాక భారత దేశంలోకెల్లా ఒక్క మద్రాసు మినహా మిగతా రాష్ట్రాలన్నింటిలో జరిగిన కృషికంటేకూడా ఇది సంతృప్తికరంగా వుంది.

(రాష్ట్రాల పునర్విభజనతో మద్రాసురాష్ట్రంలో చేరివున్న తీజెన్సీ, రాయలసీమ, మలబారు వంటి వెనుకబడిన ప్రాంతాలన్నీ దానినుంచి విడదీయబడినవన్న సంగతిని ఈ సందర్భంలో గమనించాలి.) ఈ విషయాన్ని దిగువ ఇచ్చిన వివరాలు నిరూపిస్తాయి.

వివిధ రాష్ట్రాలలో ద్వితీయ ప్రణాళికకు చేసిన కేటాయింపులు, ఖర్చుల వివరాలు. (రూ. కోట్లలో)

| రాష్ట్రం | ద్వితీయ ప్రణాళిక | | |
|---|---|---|---|
| | ప్రారంభంలో చేసిన కేటాయింపు | అంచనా వేసిన వ్యయం | అధిక శాతం |
| (1) | (2) | (3) | (4) |
| ఆంధ్రప్రదేశ్ | 175.5 | 180.6 | + 3 శాతం |
| ఆంధ్ర (120.00) | .... | 120.50 | ఏమీలేదు |
| తెలంగాణా (55.60) | .... | 60.1 | + 8.3 శాతం |
| అస్సాం | 64.4 | 57.9 | – 10 శాతం |
| బీహారు | 190.2 | 174.6 | – 8 శాతం |
| గుజరాతు | 150.1 | 146.5 | – 2 శాతం |
| కేరళ | 87.0 | 77.3 | – 11 శాతం |
| మధ్యప్రదేశ్ | 190.0 | 150.0 | – 8 శాతం |
| మద్రాసు | 152.3 | 181.0 | + 19 శాతం |
| మహారాష్ట్ర | 204.4 | 214.0 | + 5 శాతం |
| మైసూరు | 145.1 | 133.1 | – 8 శాతం |
| ఒరిస్సా | 100.0 | 88.2 | – 12 శాతం |
| పంజాబు | 162.7 | 152.5 | – 6 శాతం |
| రాజస్థాన్ | 105.3 | 100.6 | – 5 శాతం |
| ఉత్తర ప్రదేశ్ | 253.0 | 232.0 | – 8 శాతం |
| పశ్చిమ బెంగాల్ | 157.7 | 150.8 | – 3 శాతం |
| జమ్మూ, కాశ్మీర్ | 33.9 | 27.3 | – 18 శాతం |

ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో పూర్వ హైద్రాబాదు రాష్ట్రంలో 47.01 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టడానికి పథకాలు సిద్ధపరచబడగా ఈ మొత్తంలో రు. 34.49 కోట్లు మాత్రమే అంటే అనుకున్న మొత్తంలో నూటికి 73.4 వంతుల మొత్తం మాత్రమే ఖర్చు చేయబడింది. అదే కాలంలో ఆంధ్రప్రాంతంలో రు. 67.14 కోట్లు ఖర్చుపెట్టడానికి పథకాలు రూపొందించబడగా రు. 64.21 కోట్లు ఖర్చుచేయబడినవి. అంటే నూటికి 95.6 వంతుల మొత్తం ఖర్చు పెట్టబడిందన్నమాట. ద్వితీయ ప్రణాళిక ప్రారంభమైన అనంతరం పూర్వ హైద్రాబాదు ప్రభుత్వం ఏడు నెలలపాటు అధికారంలో వుంది. ఆ ఏడు నెలలలోనూ తెలంగాణా ప్రాంతంలో రు. 70 లక్షలు మాత్రమే ఖర్చుచేయబడినవి. ఈ మొత్తం అసలు ఇక్కడ ఖర్చుచేయడానికి నిశ్చయించుకున్న దానిలో నూటికి 7 వంతులు మాత్రమే. రాష్ట్ర పునర్నిర్మాణ వ్యవహారాలలో ప్రభుత్వం నిమగ్నమై వుండటమే ఇంతగా తక్కువ ఖర్చు చేయడానికి కారణం. కాని ఆ సంవత్సరంలోనే మిగిలిన అయిదు నెలలలో సుమారు రు. 4 కోట్లు ఖర్చు చేయబడినవి. అవే కాలాలలో ఆంధ్ర ప్రాంతంలో వరుసగా రు. 9.43 కోట్లు రు.11.17 కోట్లు ఖర్చు చేయబడినాయి. దీనినిబట్టి, 1956-57వ సంవత్సరం చివరి అయిదు నెలల్లో తెలంగాణా అభివృద్ధిపట్ల అధిక శ్రద్ధ కనబరచబడినట్లు స్పష్టపడుతుంది. ద్వితీయ ప్రణాళిక క్రింద 1961 మార్చి 31 వ తేదీనాటికి మొత్తం రాష్ట్రానికి వ్యయం, 175 కోట్ల రూపాయల నుంచి 180 కోట్ల రూపాయలకు కొద్దిగా మించి అవుతుంది. ఈ అదనపు అయిదు కోట్ల రూపాయలలో దాదాపు అంతా తెలంగాణా ప్రాంతంలోనే ఖర్చు చేయబడటం గమనార్హం. ఈ పరిస్థితి దృష్ట్యా ఆంధ్ర ప్రాంతంలో ద్వితీయ ప్రణాళిక క్రింద ఖర్చుకాగల మొత్తం నూటికి నూరువంతులు కాగా తెలంగాణా ప్రాంతలో నూటికి 108 వంతులు అవుతుంది. ఆంధ్ర

ప్రదేశ్ మొత్తంమీద ప్రణాళికా పథకాలు సంతృప్తికరంగా నిర్వహింపబడినవంటే అందుకు ప్రధాన కారణం తెలంగాణా ప్రాంతంలో విశేష కృషి జరిగివుండడమే. ప్రాంతీయ సంఘం కోరినట్లు, రాజధానీ నగరం అభివృద్ధికి ఖర్చుచేసిన సుమారు రు. 2 కోట్లనూ, రాజధానిలో వైద్య పథకాలకు వెచ్చించిన రు. 30 లక్షలను పూర్తిగా ఆంధ్ర ప్రాంత వ్యయం పద్దులో చేర్చినప్పటికీ వున్న పరిస్థితి ఇది. ఒకవేళ ఈ వ్యయాన్ని ఉభయ ప్రాంతాలకు పంచినట్లయితే తెలంగాణాలో జరిగిన ఖర్చు నూటికి 110 వంతులకు పెరిగి ఆంధ్ర ఖర్చు నూరుకంటే కొంచెం తగ్గివుండేది.

*తృతీయ ప్రణాళిక కేటాయింపులు, తెలంగాణా మిగులు నిధులు :*

తృతీయ ప్రణాళికలో తెలంగాణా ప్రాంతానికి, ద్వితీయ ప్రణాళికలో కేటాయించిన దానికంటే రెట్టింపు మొత్తం కేటాయించబడినది. ఈ కాలంలో తెలంగాణాలో రు. 116 కోట్లు ఖర్చు చేయడానికి పథకాలు రూపొందించబడినాయి. కాగా ఆంధ్ర ప్రాంతంలో ద్వితీయ ప్రణాళికావ్యయం రు. 120 కోట్లు అయితే తృతీయ ప్రణాళికలో రు. 189 కోట్లు ఖర్చు చేయడానికి తలపెట్టబడినది. అంటే నూటికి 158 వంతులే పెంచబడిందన్నమాట. తెలంగాణా ఆదాయం, వ్యయం విభజన సందర్భంలో మిగులు తేలిన రు. 9.1 కోట్ల విషయంలో తగు చర్యలు తీసుకోబడినవి. ఈ మొత్తాన్నిగురించి సంఘం అధ్యక్షుడు పలుసార్లు ప్రస్తావించడం జరిగింది. తృతీయ ప్రణాళిక ముగింపునాటికి తెలంగాణాలో రెవెన్యూ పెట్టుబడి ఆదాయాలవల్ల లభించే ఆదాయాలకు మించి పదిమొదలు పన్నెండు కోట్ల రూపాయలు ఖర్చుకాగలవు. పారిశ్రామికాభివృద్ధికీ, అధిక పెట్టుబడులు అవసరమయ్యే పథకాల నిర్వహణకు వీలుగా సెక్యూరిటీలు క్రమక్రమంగా తీసివేయడం జరుగుతుంది. తెలంగాణాలో రు. 9.1 కోట్లు మిగులు తేలడం, దాదాపు రు. 12 కోట్ల విలువగల సెక్యూరిటీలు వుండడాన్నిబట్టి ప్రణాళికా పథకాలకు సరిగా ఖర్చుపెట్టబడ లేదనుకోవాల్సి వస్తుందనీ కాబట్టి ఈ మొత్తాలను ప్రస్తుత పంచవర్ష ప్రణాళికలో ప్రయోజనకరంగా ఖర్చుపెట్టవచ్చునని ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు అభిప్రాయపడుతున్నట్టు కన్పిస్తుంది. కాని అసలుసంగతి ఇదికాదు. లోగడ చేసిన ప్రకటనలను పరిశీలిస్తే తెలంగాణా ప్రాంతంలో అభివృద్ధి కార్యక్రమాలక్రింద జరుగుతున్న వ్యయం ఏటేటా బాగా పెరిగిపోతున్నదనే విషయం వెల్లడవుతుంది. పరిపాలనా యంత్రాంగాన్ని అభివృద్ధికృషికి వినియోగించవలసిన అవసరం ఎల్లప్పుడూ వుంటూనే వుంటుంది. కాబట్టి ఇంతకంటే అధికంగా ఇంకా సాధించేదేమీ వుండదు. అంతేగాకుండా అభివృద్ధి కార్యక్రమాలక్రింద సరిగా వ్యయం జరుగనందువల్ల (అసలు ఇది జరుగనేలేదు) ఈ మిగుళ్ళు తేల లేదు. రెవెన్యూ వసూళ్ళు బాగా జరగడం ముఖ్యంగా ఎక్సైజు, అమ్మకం పన్నులు, భూమి శిస్తు బాగా వసూలు కావడంవల్లనే ఈ మిగుళ్ళు తేలాయి. అంతేగాకుండా ప్రజలనుంచి పొందిన రుణాలను ఉభయప్రాంతాల పెట్టుబడి బడ్జెటుల దామాషాలో విభజించడంవల్లకూడా ఈ మిగుళ్లు తేలడం జరిగింది. అయితే ఈ ఋణాల విభజనఅంత అవసరంగా తీసుకోదగిన చర్యకాదు. ఈ విషయంలో అవసరమైతే ఇప్పటికీ తిరిగి సర్దుబాట్లు చేయవచ్చు. 1958-59 వ సంవత్సరంలో ప్రణాళికా వ్యయం అంతక్రితం సంవత్సరంకంటే రు. 3.2 కోట్లు హెచ్చినా అనుకోకుండా రు. 6 కోట్ల మిగులు తేలింది. ఈ మిగులు తలవని తలంపుగా జరిగినదికాబట్టి దీనిఖర్చుకు ముందరే పథకాలు రూపొందించడం అన్నది జరిగేపని కాదు. ఈ వ్యయం ఏటేటా పెరగటమే గాకుండా అసలు ప్రణాళిక మొత్తం ప్రగతికంటే సంతృప్తికరంగా వుంది. ఈ విషయాన్ని దిగువపట్టికలో ఇచ్చిన అంకెల వివరాలనుబట్టి స్పష్టంగా తెలుసుకొనవచ్చును:—

| | ఆంధ్ర | | తెలంగాణా | |
|---|---|---|---|---|
| సంవత్సరం | వ్యయం (రు. కోట్లలో) | సూచీ | వ్యయం (రు. కోట్లలో) | సూచీ |
| 1956—57 | 20.60 (19.39) | 100 | 5.06 (10.38) | 100 |
| 1957—58 | 21.43 (23.42) | 104 | 9.75 (10.67) | 193 |
| 1958—59 | 21.95 (20.29) | 107 | 12.96 ( 9.73) | 256 |
| 1959—60 | 26.63 (26.04) | 129 | 15.24 (15.79) | 301 |
| 1960—61 (అంచనా) | 29.30 (29.80) | 145 | 17.12 (17.21) | 333 |
| 1961—62 (తృతీయ ప్రణాళిక) | రు. 29 కోట్లు | | రు. 19 కోట్లు | |

బ్రాకెట్లలో వున్న అంకెలు ద్వితీయప్రణాళిక కేటాయింపులను తెలుపుతాయి.

*ఆంధ్ర, తెలంగాణాలకు బడ్జెటులు :*

ఈ దశలో తెలంగాణా ప్రాంతానికి ఇవ్వబడిన రక్షణల విషయమై ప్రస్తావించాల్సివుంది. ఈ రక్షణలను వివరించే పత్రా

లను ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు పత్రికలవారికి పంచిపెట్టడం కూడా జరిగింది. నూతనరాష్ట్రంలో కేంద్ర, సాధారణ పరిపాల నలపై జరిగే వ్యయాన్ని ఆంధ్ర, తెలంగాణాప్రాంతాలు వాటి వాటి నిష్పత్తిలో భరించాలనీ, తెలంగాణాలో మిగులుతేలిన మొత్తాన్ని పూర్తిగా ఆ ప్రాంతం అభివృద్ధికై ఖర్చుచేయడానికి ప్రత్యేకించాలని ఈ ఉభయప్రాంతాల ప్రతినిధులు ఒక ఒడంబడిక కుదుర్చుకున్నారు. తెలంగాణాకు ఇచ్చిన ముఖ్యమైన రక్షణలలో ఇదొకటి. ఈ పద్ధతిని కచ్చితంగా అనుసరించడం జరిగింది. న్యాయం ప్రకారం ఉభయప్రాంతాలకు పంచవలసిన కొన్ని పెద్ద పద్దులను ప్రాంతీయ సంఘం కోరిన ప్రకారం ఆంధ్ర ప్రాంతానికి సంబంధించిన పద్దులలోనే వ్రాయడం జరిగింది. రాష్ట్ర పున ర్నిర్మాణం జరిగినందువల్లనే రాజధానీనగరాన్ని అభివృద్ధిపరచ వలసిన అవసరం ఏర్పడిందనీ కాబట్టి అందుకు చేసిన వ్యయాన్ని తెలంగాణాపద్దులో వ్రాయకూడదని ఈ సంఘం కోరింది. కేంద్ర, సాధారణ పరిపాలనా వ్యయాలను ఉభయ ప్రాంతాలమధ్య పంచే విషయాన్ని రాష్ట్ర పునర్నిర్మాణం జరిగిన రెండునెలల లోపుగానే అంటే 1957 జనవరి నెలలోనే, ఆర్థికశాఖ పరిశీలించి ఈ విష యంలో కొన్నిప్రతిపాదనలు చేసింది. వాటిని 1957 ఫిబ్రవరి 12 వ తేదీన మంత్రివర్గం పరిశీలించి ఆమోదించింది.

ఈ ప్రతిపాదనలనుగూర్చి ప్రాంతీయసంఘం తాలూకు ప్రణా ళికా ఉపసంఘం చర్చించడం, తరువాత *1959* సెప్టెంబరు 15 వ తేదీన జరిగిన సమావేశంలో ప్రాంతీయసంఘం వాటిని యథా తథంగానే ఆమోదించడం జరిగింది. దీనినిబట్టి ప్రాంతీయ సంఘం సూచించిన మార్గాల ప్రకారమే తెలంగాణా మిగులు నిధు లను లెక్కచూడటం, ఆ ప్రాంతంలోనే ఖర్చుచేయడానికి ప్రత్యే కించడం జరుగుతున్నదన్న సంగతి వెల్లడవుతున్నది. ఇదివరకే చెప్పినట్టు. ఈ మిగులు మొత్తాలను తెలంగాణా ప్రాంతంలో తృతీయ ప్రణాళికా కాలంలో ఖర్చుపెట్టడానికి తలపెట్టబడినది. రాష్ట్ర తృతీయ ప్రణాళికా వ్యయాన్ని రు. 305 కోట్లకు మించి హెచ్చించడం జరిగితే ఆ పెంపుదలలో తెలంగాణా ప్రాంతానికి సహజంగా కేటాయించ వలసిన దానికంటే మించి కేటా యించడం జరుగుతుంది. పోతే రు. *12* కోట్ల సెక్యూరిటీలు పూర్తిగా ఇంకా ప్రభుత్వంవద్దనే వున్నాయి. తెలంగాణా ప్రాంతం అభి వృద్ధికి ప్రత్యేకించి పోచంపాడు ప్రాజెక్టు, కొత్తగూడెం ఎరువుల ఫ్యాక్టరీలకొరకు ఈ మొత్తం ప్రత్యేకించబడినది. కొత్తగూడెం ఎరువుల ఫ్యాక్టరీ స్థాపనకు ప్రైవేటుసంస్థలు పూనుకునేటట్టు చేయ డానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఎందుకంటే దీనివల్ల ఇట్టి ప్రధానమైన పారిశ్రామిక సంస్థను ఇక్కడ స్థాపించుకొనగలగ డంతోపాటు ప్రభుత్వ నిధులను తెలంగాణాలో ఇతరఅభివృద్ధి కార్యాలకు వినియోగించడానికి వీలుచిక్కుతుంది. ఈ సెక్యూరి టీలమీద వస్తున్న వడ్డీ, తెలంగాణా ప్రాంతానికి సంబంధించిన ఖాతాకు జమకట్టబడుతున్నది. ఆమోదంపొందిన ప్రణాళికా పథకాలను అమలుపరచడానికి కావల్సిన నిధులు వుండడం వల్లా, వివిధశాఖలు వాటి అంగబలానికి మించిన పథకాలను చేపట్టడం వల్ల, దుబారాకు అవకాశం వున్నందువల్లనే ఈ మిగుళ్ళను కదపడం జరగలేదు. ఆ విధంగా చేయడం తెలంగాణా ప్రయోజ నాలకు విరుద్ధమనికూడా తలంచడమైనది మంజూరైన ఏ ప్రణాళికా పథకాన్నికూడా తగినన్ని నిధులులేని కారణంచేత ఆపివుంచడమంటూ జరగలేదు. ద్వితీయ, తృతీయ ప్రణాళికల వివరాలను ప్రణాళికా సంఘం, కేంద్రజల విద్యుచ్ఛక్తి సంస్థవారు క్షుణ్ణంగా పరిశీలించి ఆమోదించడం జరిగింది. దీనిమూలంగా సమగ్ర వివరాలను సిద్ధంచేయడానికి రాష్ట్ర ప్రభుత్వానికి చెందిన వివిధ కార్యాలయాలలో ఎక్కువ సమయం వినియోగించాల్సి వచ్చింది. పోతే తెలంగాణా విషయంలో సిబ్బంది కొరత ఇబ్బందులుకూడా వున్నాయి.

*తెలంగాణా సిబ్బందిపట్ల వివక్షణ :*

సిబ్బంది సీనియారిటీ వ్యవహారాలలో అన్యాయం జరుగు తున్నట్లూ, తెలంగాణా ప్రాంతీయులకొరకు ఉద్దేశించిన ఉద్యో గాలలో తెలంగాణేతరులైనవారిని నియమిస్తున్నట్టు ప్రాంతీయ సంఘానికి అనేకంగా ఫిర్యాదులు వస్తున్నట్లు సంఘం అధ్యక్షుడు ఆరోపిస్తున్నారు.

సీనియారిటీ విషయంలో ప్రభుత్వం తెలంగాణావారిపట్ల ఎంతో సబబుగా ప్రవర్తిస్తున్నది. పోతే వారికి న్యాయవిషయకమైన రక్షణలుకూడా చాలా వున్నాయి. ప్రతి శాఖలోనూ ఉద్యోగ వర్గాలను ఏకంచేయటం సీనియారిటీ స్థిరపరచడం ఆయా శాఖల కమిటీలు చేసే సూచనల ఆధారంగా జరుగుతుంటుంది ఈ కమి టీలలో ఆంధ్ర, తెలంగాణాకు చెందిన ఉన్నతాధికార్లు సరిసమా నంగా వుంటారు, వీరు చేసే సూచనలు సాధారణంగా ఏకగ్రీ వంగా చేయబడుతుంటాయి. ఈ కమిటీల నివేదికలపై ప్రభుత్వం గైకొన్న నిర్ణయాల ఫలితంగా తమకు అన్యాయం జరిగిందను

వనే ఉద్యోగులు, చట్టబద్ధమైన రెండు సంఘాలకు అప్పీలు చేసుకోవచ్చును. వీటిని 1956 వ సంవత్సరపు రాష్ట్రాల పునర్నిర్మాణ చట్టం 115 (5) (ఏ) సెక్షను క్రింద భారత ప్రభుత్వం నియమించింది. ఈ కమిటీలు వందలకొద్దీ అప్పీళ్ళను విచారిస్తున్నవి. ఇవి చెప్పిన తీర్పులకు శిరసావహించి వాటిని తక్షణమే అమలు జరపడం జరిగింది.

ఉద్యోగ నిబంధనలు, వేతనాల విషయంలో, 1957 మార్చి 27 వ తేదీన భారత ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వులను కచ్చితంగా అమలుపరచడం జరిగింది. నిజానికి ప్రభుత్వం మరింత ఉదారంగా ప్రవర్తించి తెలంగాణా సిబ్బందికి అనుకూలంగా అనేక ఉద్యోగ నిబంధనలను సడలించింది. తెలంగాణా సిబ్బందికి సంబంధించిన అన్ని సాధారణాంశాలనుకూడా, వీటి విషయంలో ఉత్తర్వులు జారీచేయడానికి పూర్వం సాధారణ పరిపాలనశాఖలోని రాష్ట్ర పునర్నిర్మాణ విభాగంలో పరిశీలించడం జరిగింది. ఈ విభాగంలో అంతా తెలంగాణాకు చెందిన సీనియర్ ఉద్యోగులే వున్నారు.

*ఫిర్యాదుల విచారణ సంఘం*

చట్టబద్ధమైన కమిటీలచేత పరిశీలింప బడడానికి లేదా ఉత్తర్వుల క్రింద పరిష్కరింప బడడానికి వీలులేని ఫిర్యాదులను గూర్చి విచారించి, పరిష్కరించడానికి 1958 మార్చి 18వ తేదీన ప్రభుత్వం తెలంగాణా ఉద్యోగుల ఫిర్యాదుల విచారణ సంఘం అనేపేరుతో ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘం పరిశీలనకు వచ్చే విషయాలు తరుచు ఆంధ్రప్రాంత ఉద్యోగస్థులకు సంబంధించినవైనప్పటికీ ఈ సంఘంలో తెలంగాణా ప్రాంతానికి చెందిన ఇద్దరు సీనియర్ ఉద్యోగులు, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి సభ్యులుగా వున్నారు.

ఈ సంఘానికి మొత్తం 3,978 ఫిర్యాదులు రాగా వీటన్నింటినీ పరిష్కరించింది. వీటిలో 657 ఫిర్యాదులు ఈ సంఘం అధికారాలకు సంబంధించనివి. కాబట్టి వాటిని, రాష్ట్రాల పునర్నిర్మాణ చట్టం 115 (5) (ఎ) సెక్షను క్రింద ఏర్పడిన కమిటీకి నివేదించడం జరిగింది. మిగతా అన్ని ఫిర్యాదుల విషయంలోనూ ఈ సంఘం ఏకగ్రీవంగా సిఫార్సులు చేసింది. వీటిలో 3264 సిఫార్సులను ఆమోదించడం, రెండింటిని నిరాకరించడం జరిగింది. పోతే 65 కేసుల విషయంలో ఇంకా ప్రభుత్వ ఉత్తర్వులు వెలువడవల్సి వుంది.

*కేంద్రప్రభుత్వ సలహాదారు:*

విలీనీకరణకు సంబంధించిన వివిధ నిర్ణయాలలో బుద్ధిపూర్వకంగానే గానీ, పొరపాటుననే గాని ప్రాంతీయ పక్షపాతం జరుగకుండా వుండే నిమిత్తం ఇటువంటి సమస్యలపై సలహాల నివ్వడానికి రాష్ట్రప్రభుత్వం కేంద్రానికి చెందిన ఒక ఉన్నతాధికారిని సలహాదారుగా వుంచుకున్నది. ఆంధ్రప్రదేశ్‌కు చెందని ఈ ఉన్నతాధికారి అనేక పర్యాయాలు హైద్రాబాదుకు వచ్చి ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలవారైన ప్రభుత్వోద్యోగులతోనూ, ప్రధానమైన ఉద్యోగస్థుల సంఘాలతోను చర్చలు జరిపారు. ఈ అధికారి సలహాలను బేషరతుగా అమోదించడం, ఆయన సిఫార్సులను తీర్పులుగా పరిగణించడం జరిగింది.

*ఉద్యోగ నియామకాలు :*

తెలంగాణావారికి ఇచ్చిన రక్షణల ననుసరించి తెలంగాణా ప్రాంతంలో కొన్ని ఉద్యోగాలలో నియామకానికి అభ్యర్థులు ఆ ప్రాంతంలో 15 సంవత్సరాలపాటు నివసించి వుండటం అవసరం. ఈ విషయమై ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు ప్రస్తావించారు. ఈ షరతును కచ్చితంగా పాటించడం జరుగుతున్నది. ఈ షరతు 1961 వ సంవత్సరంలో రద్దుకావల్సి వున్నా దీనిని మరికొంత కాలం వరకు పొడిగించాలన్న ఆలోచనకూడా వుంది. ముల్కీలైన అభ్యర్థులు సిద్ధంగా లభ్యంగాని సందర్భాలలో కొన్ని ఉద్యోగాలలో పూర్తిగా తాత్కాలిక ప్రాతిపదికపై ఇతరులను నియమించడం జరిగినది. 1960 వ సంవత్సరం మధ్యకాలంనుంచి ఈ ఉద్యోగాల జాబితాలను కాలక్రమం ప్రకారం పరిశీలించి వాటిని ఇద్దరు తెలంగాణా ప్రాంతపు మంత్రులకు సూచనలు, సలహాలకై పంపించడం జరుగుతున్నది. పరిపాలనా సంబంధమైన ఇబ్బందులు వుంటున్నప్పటికీ అనేక ఉద్యోగాలు ఖాళీగానే వుంచబడినాయి. పరిపాలనా సంబంధమైన ఇటువంటి ఇబ్బంది తెలంగాణా ప్రయోజనాలకు అనుగుణమైనదేనా అన్నది చర్చనీయాంశం. ప్రాంతీయసంఘం ఈ విషయంలో తగు సలహాలుకూడా ఇవ్వవచ్చును. దాదాపు 256 ఉద్యోగాలలో మాత్రమే పూర్తిగా తాత్కాలిక పద్ధతిమీద తెలంగాణేతరులైన వారిని నియమించడం జరిగింది. ఆ ఉద్యోగాలలో వీరికి బదులుగా తెలంగాణావారిని నియమించడం

శీఘ్రంగా జరుగుతున్నది. తెలంగాణా రక్షణలను ఎంతమాత్రం ఉల్లంఘించడం జరిగినా ప్రభుత్వం చిరసచర్యలు గైకొంటున్నది ఆంధ్ర ప్రాంతంలోకూడా బయటివారిని శాశ్వత పద్ధతిపైన నియమించడం చిరుచుగా జరుగుతున్నదే. పని ఒత్తిడిదృష్ట్యా, తెలంగాణా ప్రాంతంలో కొన్ని తాత్కాలిక ఉద్యోగాలలో బయటివారిని నియమించడం జరిగినా తెలంగాణా ప్రయోజనాలు మాత్రం ఎన్నడూ విస్మరింపబడలేదు.

ప్రణాళికలకు సంబంధించిన అంకెలనుబట్టే తెలంగాణా ప్రాంతం ఎంతమాత్రం నిర్లక్ష్యం చేయబడలేదన్న విషయం విస్పష్టమవుతుంది. కొన్ని ముఖ్యమైన అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించి, దిగువ పేర్కొనబడిన అంశాలు ఈ విషయాన్ని మరింత స్పష్టపరుస్తాయి.

*నీటిపారుదల ప్రాజెక్టులు :*

ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో పూర్తికాకుండా వుండి ద్వితీయ ప్రణాళికలోకూడా నిర్మించబడిన అయిదు మధ్యరకం నీటిపారుదల ప్రాజెక్టులలో మూడు—కోయర్‌సాగర్, భీమనపల్లి, సరళాసాగర్—ప్రాజెక్టులు పూర్తి చేయబడినవి. మూసీ, సరళా ప్రాజెక్టుల నిర్మాణం దాదాపు ముగియవస్తున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చిన 12 నూతన మధ్యరకం నీటిపారుదల పథకాలలో నాలుగు మంజూరైనవి. అయిదవదానికి త్వరలోనే మంజూరీ రానున్నది. పోతే ఆరవదానికి కేంద్రజల విద్యుచ్ఛక్తి సంఘం ఆమోదం లభించవలసి వున్నది. సాంకేతికమైన కారణాల వల్ల వీటిలో కొన్నింటిని విరమించుకొనవల్సి వచ్చింది మరో ఆరు నీటిపారుదల పథకాలు శీఘ్రగతిని అమలుపరచబడుతున్నాయి. ఇవి "మధ్యరకం ప్రాజెక్టులు" అన్న నిర్వచనంక్రిందికి రావు. ఇవిగాక వందలకొద్దీ చెరువుల అభివృద్ధి పథకాలు అమలుపరచబడుచున్నాయి, లేదా పరిశీలనదశలోనైనా ఉన్నాయి. ద్వితీయ ప్రణాళికా కాలంలో 1845 చెరువుల పునరుద్ధరణకు తలపెట్టబడినది. 210 చెరువులను మరమ్మతు చేయడానికి మంజూరీ లభించింది. ఈ పనులు శీఘ్రగతిని కొనసాగుతున్నాయికూడా. మరో 931 చెరువుల మరమ్మతుకు పథకాలు సిద్ధం చేయబడుచున్నాయి. మిగతావాటి విషయమై పరిశీలనలు జరుగుతున్నాయి. నీటిపారుదల సౌకర్యాలకు సంబంధించిన పథకాలన్నింటి విషయంలోను కొన్ని పథకాలలోని సాంకేతికమైన లోపాలవల్ల, మట్టి త్రవ్వకపు యంత్రాల కొరతవల్ల, సర్వే, ఎం. ఐ. సిబ్బంది కొరతవల్ల ఇబ్బందులు కలిగాయి. ఆంధ్రప్రాంతంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 14 మధ్యరకం నీటిపారుదల పథకాలను చేర్చడం జరగగా ఇప్పటివరకు నాలుగు పథకాలకు మాత్రమే మంజూరీ లభించింది. దీనినిబట్టి ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలమధ్య ఎటువంటి విచక్షణా చూపబడలేదన్న విషయం స్పష్టం కాగలదు. ఖర్చు వివరాలను తెలిపే పట్టిక దిగువ ఇవ్వబడినది:—

| | రెండవ ప్రణాళిక సవరింప బడిన కేటాయింపులు (రు. లక్షలలో) | రెండవ ప్రణాళిక మొదటినాలుగు సంవత్సరాలలో జరిగిన వ్యయం (రు. లక్షలలో) | 1960-61వ సంవత్సరానికి అంచనావేయ బడినవ్యయం (రు. లక్షలలో) |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| ఖాదీ పథకాలు | 457 87 | 239.41 | 132.60 |
| మొదటి ప్రణాళిక నుంచి అసంపూర్తిగా చేరిన మధ్యరకం పథకాలు | 208 43 | 169.94 | 32.94 |
| కొత్తగా చేర్చిన మధ్యరకం పథకాలు | 33 85 | 2.99 | 20.84 |
| చిన్నరకం నీటి పారుదల పథకాలు | 251.02 | 178 08 | 80.13 |
| రెండవ ప్రణాళికలో తెలంగాణాకు చేసిన మొత్తం కేటాయింపులు | 951.17 | 590 42 | 266.51 |
| రెండవ ప్రణాళికలో తెలంగాణాలో జరిగిన మొత్తం వ్యయం | 590 42<br>266 51<br>850.93 | | |

*రోడ్లు :*

ప్రాంతీయ సంఘం తాలూకు ప్రణాళికా వ్యవహారాల ఉపసంఘం రెండు విషయాలను నొక్కి చెప్పింది. ప్రణాళికా కాలంలోనే అభివృద్ధిని మరింత శీఘ్రతరం చేయాలనడం ఇది సూచించిన అంశాలలో మొదటిది. రెండవది ప్రాంతీయ ప్రణాళికా కేటాయింపును మొదట్లో నిర్ణయించిన దానికంటే తగ్గించకుండా వుండటం. పైన ఇచ్చిన అంకెలనుబట్టి, అభివృద్ధిని వేగవంతం చేయడానికి శాయశక్తులా కృషి జరిగినట్టు స్పష్టమవుతుంది. పోతే మొదట చేసిన కేటాయింపులను మార్చకుండా వుండటం అన్నది మాత్రం సాంకేతిక సిబ్బంది, ఇతర సిబ్బంది లభ్యంకావడంపై ఆధారపడి వుంటుంది. ఆంధ్రప్రదేశ్‌లో రోడ్ల నిర్మాణ పథకాలను కేటాయించిన సొమ్మును మొత్తం ప్రణాళికా వ్యయంలో అన్ని రంగాలకు సంబంధించిన పథకాలకు అవకాశం కల్పించే నిమిత్తం

రు. 219 లక్షల నుంచి రు. 185 లక్షలకు తగ్గించవలసి వచ్చినా తెలంగాణాలో మాత్రం రు. 219 లక్షల నుంచి రు. 185 లక్షలకు మాత్రమే తగ్గించబడింది. అంటే ఈ విధంగా తగ్గించబడిన మొత్తం ఆంధ్రలో రు. 171 లక్షలు కాగా తెలంగాణాలో రు. 34 లక్షలు మాత్రమే.

*గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా :*

మామూలు ప్రాంతాలలో సైతం పైలట్ డీసెల్ ఇంజన్లను నెలకొల్పి గ్రిడ్‌లైన్లువేసి గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి ప్రత్యేక కృషి జరిగింది. ఆంధ్ర ప్రదేశ్‌లోని 26,300 గ్రామాలు, పట్టణాలలోనూ ద్వితీయ ప్రణాళికా కాలం ముగింపునాటికి 2,800 గ్రామాలకు అంటే నూటికి 10 వంతుల గ్రామాలకు మాత్రమే విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కల్పించడం జరుగుతుంది. రాష్ట్ర పునర్నిర్మాణం జరిగిన సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతంలో 681 గ్రామాలకు, తెలంగాణా ప్రాంతంలో 19 గ్రామాలకు మాత్రమే విద్యుచ్ఛక్తి సరఫరా జరిగింది. ద్వితీయ ప్రణాళిక ముగింపునాటికి అంటే 1961 మార్చి 31 వ తేదీ వరకు ఆంధ్ర ప్రాంతంలో 2,325 గ్రామాలకూ, తెలంగాణా ప్రాంతంలో 483 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలను విస్తరించడం జరుగుతుంది. దీనినిబట్టి ఈ సౌకర్యాలు పొందే గ్రామాల సంఖ్య ఆంధ్రలో 2½ వంతులు మాత్రమే పెరగగా తెలంగాణాలో 19 వంతులు పెరుగుతున్నట్లు తెలుస్తుంది. తెలంగాణా ప్రాంతంలో విద్యుచ్ఛక్తి సౌకర్యాల విస్తరణ విషయంలో ఇంత చక్కని అభివృద్ధి జరగడానికి కారణం, పోలీసు చర్యకు పూర్వం కొన్ని దశాబ్దాల తరబడి ఇటువంటి సదుపాయాలను కలిగించడంలో చూపిన ఉపేక్షాభావమేకాని, 1956 తరువాత జరిగిన అశ్రద్ధ మాత్రంకాదు. దీనికి పైని ఇచ్చిన సంఖ్యా వివరాలే నిదర్శనం.

1956 నవంబరు 1వ తేదీ లగాయితు 1960 జనవరి 11వ తేదీ వరకు పబ్లిక్‌వర్క్సు శాఖ మంత్రిగానూ, 1956 నవంబరు 1వ తేదీ నుంచి 1959 మార్చి 6వ తేదీ వరకు ప్రణాళికా శాఖ మంత్రిగాను వున్నవారు తెలంగాణావారే నన్న సంగతిని ఈ సందర్భంలో పేర్కొనడం అప్రస్తుతం కాదు.

*వైద్య, ప్రజారోగ్య సౌకర్యాలు :*

ఈ రంగంలోకూడా రాష్ట్ర పునర్నిర్మాణానికి పూర్వం వున్న పరిస్థితికంటే ఈనాటి పరిస్థితి ఎంతో మెరుగ్గా వుంది. ఆసుపత్రి పరికరాలు, సిబ్బంది, రోగుల పడక సౌకర్యాల విషయంలో ఎంతగా అభివృద్ధి జరిగిందో తెలుసుకోవాలంటే తెలంగాణా గ్రామాలలోని ప్రభుత్వ ఆసుపత్రులకు వెళ్ళి ప్రత్యక్షంగా చూడవచ్చును. ఇప్పుడు సాధించిన అభివృద్ధికూడా సంతృప్తికరంగా లేని మాట నిజమేగాని దానికి కారణం 1956 నవంబరుకు పూర్వం ముఖ్యంగా పోలీసు చర్యకు పూర్వం జరిగిన నిర్లక్ష్యమే కారణం.

ఉస్మానియా జనరల్ ఆసుపత్రి, ఉస్మానియా, గాంధీ వైద్య కళాశాలలను పై గ్రేడుకు పెంచడానికీ, కె. ఇ. ఎం. ఆసుపత్రి, నిలోఫర్ ఆసుపత్రి, కాన్సర్ ఆసుపత్రి, సరోజినీదేవి ఆసుపత్రి, ప్రభుత్వ ప్రసూతి ఆసుపత్రి, క్షయవ్యాధి ఆసుపత్రి, జ్వర ఆసుపత్రి, మానసిక రోగుల ఆసుపత్రులను వైద్య విద్యాబోధన సంస్థలుగా అభివృద్ధి పరచడానికి పెద్దమొత్తాలు ఖర్చుపెట్టబడినాయి. పైన పేర్కొన్న ఆసుపత్రులలో రోగులకు 400 లకు పైగా పడకలు ఏర్పాటు చేయబడినవి. వీటికి కొత్తగా ఔట్‌పేషంట్ బ్లాకులను కూడా ఏర్పాటు చేయడం జరిగింది. ఈ కళాశాలలలో విద్యార్థుల సంఖ్య దాదాపు రెట్టింపు చేయబడింది. వరంగల్‌లో ప్రైవేటు ఆధ్వర్యంక్రింద కొత్తగా ఒక వైద్యకళాశాల తెరువబడినది. ప్రభుత్వం, ఈ కళాశాలలను అభివృద్ధిపరచబడంలోనూ, దానికి సంబంధించివున్న ప్రభుత్వ ఆసుపత్రిని పై గ్రేడుకు పెంచడంలోను పూర్తిసహకారం ఇస్తున్నది, హైదరాబాదులో కొత్తగా ఒక దంతవైద్య కళాశాలను, నర్సింగ్ కళాశాలను తెరవటం జరిగింది. ఇక్కడే క్షయవ్యాధి నిరోధక శిక్షణ కేంద్రం, క్షయవ్యాధిగ్రస్తుల పునరావాస కేంద్రంకూడా నెలకొల్పబడినవి.

*జిల్లా ప్రాంతాలలో వైద్యా సౌకర్యాలు :*

వివిధ జిల్లా ముఖ్యపట్టణాలలో దంతములు, చెవి, ముక్కు, గొంతు, నేత్రవ్యాధి చికిత్సా విభాగములు ఏర్పాటు చేయబడినాయి. జిల్లా ఆసుపత్రులను తగువిధంగా అభివృద్ధి పరచడం కూడా జరిగింది. రు. 14 లక్షల ఖర్చుతో వీటిలో రోగులకు 600 పైగా అదనంగా పడకలను ఏర్పాటు చేయడంతో పాటు ఇతర వైద్య సౌకర్యాలు కూడా కల్పించ బడినాయి. జిల్లా హెడ్‌క్వార్టర్స్ ఆసుపత్రులలో క్షయరోగులకు పడకసౌకర్యాలను కల్పించడమే గాకుండా రోగులను పరీక్షించడానికి వీలుగా ఎక్స్‌రే విభాగాలు ఏర్పాటు చేయబడినాయి. విద్యుచ్ఛక్తి సౌకర్యాలు విస్తరించేకొద్ది

ఎక్స్‌రే విభాగాలను ఇతోధికంగా స్థాపించడం జరుగుతుంది.

*ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు :*

వివిధ తాలూకా కేంద్రాలలో సుమారు 05 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 15 కుటుంబ నియంత్రణ కేంద్రాలు, 12 క్షయవ్యాధి చికిత్సా కేంద్రాలు, 4 కుష్టువ్యాధి చికిత్సా కేంద్రాలు, 7 సుఖరోగ చికిత్సా కేంద్రాలు స్థాపించబడినాయి.

ఇంతేగాకుండా రేడియోగ్రాఫర్లకు, రెఫ్రాక్ష్యనిస్టులకు, కండ్ల అద్దాలు కట్టేవారికి, సాంఘిక వైద్య కార్యకర్తలకు, కంపౌండర్లకు, నర్సులకు, సహాయక మంత్రసానులకు శిక్షణ యిచ్చే ఏర్పాట్లు కూడా చేయబడుతున్నాయి.

*ప్రయోగశాలలు, రక్తనిధులు :*

ఇనిస్టిట్యూట్ ఆఫ్ ప్రవెంటివ్ మెడిసిన్ పునర్నిర్మించబడినది. ప్రయోగశాలను, రక్తనిధి సర్వీసులను బాగా అభివృద్ధిపరబడం జరిగింది.

*ప్రజారోగ్యం :*

తెలంగాణాలో అంటువ్యాధులను నిరోధించడానికి వివిధ పైలట్ ప్రాజెక్టులు అమలుపరచబడుతున్నాయి. ముఖ్యంగా మశూచికం నిరోధక కార్యక్రమానికి సంబంధించిన పైలట్ ప్రాజెక్టులు, గ్రామీణ ప్రాంతాలలోను, పట్టణ ప్రాంతాలలోను పనిసాగిస్తున్నాయి. మేడ్చల్, వైర, కల్వకుర్తి, రామయ్యపేట, ఆర్మూర్, నకిరేకల్, కరీంనగరం ప్రాంతాలలో ఈ పథకాలక్రింద పని జరిగింది. హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలో జన బాహుళ్యానికి టీకాలువేసే కార్యక్రమం చేపట్టబడి చాలా మందికి టీకాలు వేయబడినాయి. దీని ఫలితంగా ఈ నాలుగు సంవత్సరాల లోను తెలంగాణాప్రాంతంలో మశూచికం అయినవారి సంఖ్య చాలా తగ్గిపోయింది. తెలంగాణా ప్రాంతంలో ఎచ్చటా ప్లేగు రాలేదు. కలరా సోకినవారి సంఖ్యకూడా చాలా స్వల్పమే. మలేరియా వ్యాధి నిర్మూలనకు కూడా ఇటువంటి చర్యలే తీసుకోబడినవి. హైదరాబాద్, సికింద్రాబాదు నగరాలలో ఇంటింటికీ తిరిగి డి. డి. టి. చల్లబడింది. జిల్లా ప్రాంతాలలోకూడా ఇది భారీ ఎత్తుననే చల్లబడింది. తెలంగాణా ప్రాంతంలోని మలేరియా పీడిత జిల్లాలన్నింటిలోకూడా ప్రస్తుతం జాతీయ మలేరియా నిర్మూలన కార్యక్రమం అమలు జరుగుతున్నది.

*క్షయ :*

1956 తరువాత తెలంగాణా ప్రాంతంలో బి. సి. జి. పునః పరీక్షా కార్యక్రమం 5 జట్టులద్వారా కొనసాగింపబడుతున్నది. కుష్టువ్యాధి నిర్మూలనకు తెలంగాణా ప్రాంతంలో నాలుగు కేంద్రాలు పనిచేస్తున్నాయి.

*గ్రామాలకు మందు పెట్టెల సరఫరా:*

ఇది తెలంగాణా ప్రాంతంలో అమలు పరచబడుతున్న ప్రత్యేక కార్యక్రమం. దీనిప్రకారం అవసర సమయాలలో వైద్య సహాయం తక్షణమే అందించడానికి వీలుగా మందులు నింపిన పెట్టెలు గ్రామాలలో వుంచబడతాయి. ఇటువంటి సౌకర్యాలను ఆంధ్ర ప్రాంతానికి కూడా విస్తరింపజేసే విషయమై ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

*వెనుకబడిన గ్రామీణ ప్రాంతాలలో ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రాలు :*

తెలంగాణాలో వెనుకబడిన ప్రాంతాలలోని గ్రామీణ ప్రజలకు ప్రసూతి, శిశు సంక్షేమ సౌకర్యాలు కల్పించే నిమిత్తం 1957-58వ సంవత్సరంలో రెండు ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రాలు తెరువబడినాయి. అదే సంవత్సరంలో ఇటువంటివి మరో ఆరు సంస్థలు నెలకొల్పబడినవి. అందుకు రు. 1.20 లక్షలు ప్రత్యేకింప బడినవి.

*పాఠశాల ఆరోగ్య కేంద్రాలు :*

పాఠశాలలకు వెళ్ళే విద్యార్థుల ఆరోగ్యాన్ని సంవత్సరానికి రెండుసార్లు పరీక్షించి వారికి చికిత్సా విషయమై తగు సూచనలివ్వడానికి తెలంగాణా ప్రాంతంలోని తొమ్మిది జిల్లాలలో-జిల్లాకు ఒకటి చొప్పున పాఠశాల ఆరోగ్య కేంద్రాలు తెరువబడినవి.

*పౌష్టికాహారం:*

1957-58 వ సంవత్సరంలో వరంగలులో ప్రాంతీయ పౌష్టికాహార యూనిటు స్థాపించబడింది.

ఈ విధంగా ముందు జాగ్రత్తచర్యలు తీసుకోవడము, ఆరోగ్య ప్రచార కార్యక్రమాలు నిర్వహించడమే కాకుండా హెల్త్ విజిటర్లు, దాయాలు మొదలైన కోర్సులలో శిక్షణ పొందేవారి సంఖ్య రెట్టింపు

చేయబడినది. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో జరిగిన పూర్తి వ్యయానికి సంబంధించిన వివరాలు దిగువ ఇవ్వబడినవి.

| | 2 వ పంచవర్ష ప్రణాళిక | 1956-60 సం. లో ఖర్చుచేసిన మొత్తం | 1960-61వ సం. కేటాయింపు |
|---|---|---|---|
| | *1. వైద్యం.* | | |
| తెలంగాణా | 232 43 | 154.01 | 77.46 |
| ఆంధ్ర | 308.68 | 229.84 | 103.33 |
| | *2. ప్రజారోగ్యం.* | | |
| తెలంగాణా | 64.54 | 29.37 | 26 92 |
| ఆంధ్ర | 121.09 | 77.95 | 35.93 |

ఆంధ్ర ప్రాంతానికి చేసిన కేటాయింపులో, హైద్రాబాదు నగరంలో ఖర్చు చేయబడి ఆంధ్రకు సంబంధించిన పద్దులో వ్రాయబడిన సుమారు రు. 30 లక్షల విలువచేసే పథకాలుకూడా చేరి వున్నాయి.

*విద్య :*

సాధారణ విద్య విషయంలో తెలంగాణా ప్రాంతానికి అత్యధిక ప్రాధాన్యత ఇవ్వబడింది. విద్యా సౌకర్యాల అభివృద్ధికి తెలంగాణాకు రు. 383.08 లక్షల మొత్తం కేటాయించ బడినది. సవరింపబడిన కేటాయింపు ప్రకారం రాష్ట్రం మొత్తానికి ఖర్చు చేయబడిన దానిలో ఇది నూటికి 43.7 వంతులు. ఈ వ్యయం రు. 409.69 లక్షలకు పెరగవచ్చునని ఆశించబడుచున్నది.

ముఖ్యమైన లక్ష్యాలన్నింటినీ సాధించడం, లేదా అధిగమించడం జరిగింది. ఆంధ్రకంటే, తెలంగాణా ప్రాంతంలో జరిగిన విద్యాభివృద్ధి కార్యక్రమం త్వరితగతిని సాగినట్లు దిగువ ఇచ్చిన అంకెలను బట్టి తెలుసుకొనవచ్చు.

| | ఆంధ్ర | | | తెలంగాణా | | |
|---|---|---|---|---|---|---|
| | 1955-56 | 2 వ ప్రణాళికలో అభివృద్ధి | శాతం | 1955-56 | 2 వ ప్రణాళికలో అభివృద్ధి | శాతం |
| 1 ప్రాథమిక పాఠశాలలు | 21,035 | 2,346 | 11.15 | 7,492 | 2,644 | 35.3 |
| 2 సెకండరీ పాఠశాలలు | 696 | 575 | 82.6 | 264 | 557 | 203.4 |
| 3 (ఎ) శిక్షణ పాఠశాలలు | 72 | 6 | 9.00 | 14 | 32 | 130.00 |
| (బి) శిక్షితుల సంఖ్య | 5,254 | 2,833 | 54 | 1,132 | 4,563 | 403.00 |
| 4 (ఎ) శిక్షణ కళాశాలలు | 7 | — | — | 1 | 1 | 100.00 |
| సంఖ్య | 615 | 35 | 5.7 | 150 | 250 | 166.7 |

తెలంగాణా ప్రాంతంలో నూతనంగా ప్రాథమిక, సెకండరీ పాఠశాలలను తెరవడంలోనూ, శిక్షణ సౌకర్యాలను విస్తృత పరచడంలోను సాధించబడిన అభివృద్ధి నిజానికి అద్వితీయమైనట్టిదని దీనినిబట్టి తెలుసుకోవచ్చు. తెలంగాణాలో పరిపాలనా వ్యవస్థను పునర్నిర్మించడానికికూడా చర్యలు గైకొనబడినాయి. నూతన రాష్ట్రావతరణ సమయంలో అన్ని కార్యాలయాలలోను సిబ్బంది కొరత వుండింది. ఇప్పుడు తగినంతగా సిబ్బందిని నియమించడం జరిగింది. బాలికల పాఠశాలల పర్యవేక్షణాధికారిణుల ఉద్యోగాలు రెండు కొత్తగా సృష్టించబడినాయి. అంతేగాకుండా వరంగల్‌లో అదనపు ప్రాంతీయ డిప్యూటీ డైరెక్టరు నియమించబడినాడు.

*విశ్వవిద్యాలయ విద్య :*

1956—57 వ సంవత్సరంలో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి రు. 2.90 లక్షల గ్రాంటు మాత్రమే చెల్లింపబడినది. అయితే 1957—58 వ సంవత్సరంలో దీనిని రు. 6.5 లక్షలకు పెంచడం, ఆ తరువాత 1958—59 వ సంవత్సరంలో రు. 10 లక్షలకు పెంచడం జరిగింది. ఆ మరునటి సంవత్సరంలో దీనికి రు. 12.75 లక్షల గ్రాంటు చెల్లింపబడింది. ఈ కాలంలో ప్రభుత్వం ఆరు ఎయిడెడ్ కళాశాలలను స్వాధీన పర్చుకున్నది. 1958—59 వ సంవత్సరంలో ఎయిడెడ్ కళాశాలలకు తాత్కాలిక గ్రాంటులక్రింద రు. 6 లక్షలు చెల్లింపబడినాయి.

విద్యాపథకాలకు జరిగిన వ్యయం వివరాలు దిగువ ఇవ్వబడినాయి :

| పథకం | 2వ ప్రణాళికలో కేటాయింపు మొత్తం | 1956-57 లో జరిగిన ఖర్చు | 1957-58 లో జరిగిన ఖర్చు | 1958-59 లో జరిగిన ఖర్చు | 1959-60 లో జరిగిన ఖర్చు | 1960-61 లో జరిగిన ఖర్చు |
|---|---|---|---|---|---|---|
| తెలంగాణా | | | | | | |
| 1. ప్రాథమిక విద్య | 184.66 | 2.60 | 8.70 | 37.21 | 69.86 | 71.02 |
| 2. సెకండరీ విద్య | 104.41 | 0.94 | 10.84 | 26.68 | 39.27 | 38.68 |
| 3. విశ్వవిద్యాలయ విద్య | 49.01 | 4.21 | 8.41 | 21.14 | 15.15 | 7.98 |
| 4. ఇతర విద్యాపథకాలు | 45.00 | — | 5.54 | 10.68 | 12.06 | 18 72 |
| మొత్తం | 383.08 | 7.75 | 33.49 | 95.71 | 136.34 | 136.40 |

*సీనియరు సిబ్బంది :*

తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు జరిపిన పత్రికా ప్రతినిధుల గోష్ఠికి సంబంధించి ప్రచురింపబడిన పత్రికా ప్రకటనలో

ప్రణాళికా. స్థానిక పరిపాలనా శాఖలలోని కీలకమైన ఉద్యోగాలలో ఆంధ్ర ప్రాంతీయులైనవారు నియమించబడినట్లు పేర్కొన బడింది. ప్రభుత్వ సీనియర్ అధికార్లలో ప్రాంతీయ విభేదాలను తీసుకొనివచ్చే ఎట్టి చర్యనైనా ప్రభుత్వం తీవ్రంగా నిరశిస్తుంది. ఇటువంటి సీనియర్ అధికార్లందరూ ప్రత్యేకించి అఖిల భారత సర్వీసులలో వున్నవారు ప్రభుత్వానికి విధేయంగా వుండి ప్రభుత్వ విధానాలను అమలు జరపడంలో చిత్తశుద్ధితో సేవ చేస్తున్నారు. మంత్రివర్గపు సమిష్టి బాధ్యతలకు సంబంధించిన విషయాలలో ఈ అధికార్లు ప్రాంతీయాభిమానాలతో వ్యవహరించారని ఆరోపించడం వారిపట్ల అన్యాయం చేయడమే కాగలదు. వాస్తవ పరిస్థితులు దిగువ పేర్కొనబడినవి. ప్రణాళికాశాఖలో కార్యదర్శి ఆంధ్ర ప్రాంతపు అధికారి అయితే సంయుక్త కార్యదర్శి తెలంగాణా వారు. ఉప కార్యదర్శులలో ఒక్కరు ఆంధ్రకు చెందినవారైతే ఇద్దరు తెలంగాణా వారు. అలాగే డిప్యూటీ అభివృద్ధి కమీషనర్లలో ఒక్కరు ఆంధ్రకు చెందినవారు, ఇద్దరు తెలంగాణావా రున్నారు. సచివాలయాన్ని మొత్తంగా తీసుకుంటే కార్యదర్శి హోదాలోగల 14 మంది అధికార్లలోనూ ఏడుగురు పూర్వ ఆంధ్ర ప్రభుత్వ కేడరుకు చెందినవారు, ఏడుగురు పూర్వ హైద్రాబాదు ప్రభుత్వ కేడరుకు చెందినవారు వున్నారు. నలుగురు సంయుక్త కార్యదర్శులలోను ఒకరు ఆంధ్ర ప్రాంతానికీ, ముగ్గురు తెలంగాణా ప్రాంతానికి చెందినవారు ఆంధ్రకు చెందినతనిని, అతడు ఉద్యోగ విరమణ చేసిన తరువాత తిరిగి ఉద్యోగంలో నియమించడం జరిగింది. న్యాయశాఖలో డ్రాఫ్ట్‌మన్ హోదాలో గల ఇద్దరు అధికార్లలోనూ ఒకరు ఉద్యోగ విరమణానంతరం తిరిగి నియమించబడిన తెలంగాణా అధికారి. మరొకరు పూర్వ ఆంధ్ర ప్రభుత్వ కేడరుకు చెందినవారు. ఉప కార్యదర్శులలో ఆంధ్ర ప్రాంతం వారు 13, తెలంగాణావారు 18 మంది. అంటే 48 సీనియర్ అధికార్లలోనూ ఆంధ్ర ప్రాంతానికి చెందినవారు 20 మంది, తెలంగాణా ప్రాంతం వారు 28 మంది అన్నమాట. తెలంగాణాకు చేసిన ప్రణాళికా కేటాయింపులు పూర్తిగా ఖర్చు కాకపోవడానికి తెలంగాణా అధికార్ల అసమర్థతే కారణమని ప్రభుత్వం తప్పించుకొన జూస్తున్నదని ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు చేసిన ఆరోపణలలో నిజంలేదు. తెలంగాణా జిల్లాలలో రాష్ట్రంలోని ఇతర వెనుకబడిన ప్రాంతాల మాదిరే కొన్నిచోట్ల సిబ్బంది అత్యధికంగా వుండటం, కొన్నిచోట్ల సిబ్బంది కొరత వుండటం అనే విషయ ప్రస్తావన జరిగిన మాట వాస్తవమేకాని ఇది తెలంగాణా అధికార్లు అసమర్థులు అని చేసిన ఆరోపణ కాదు. అంకెల వివరాలు తెలుపుతున్న సమాచారాన్నిబట్టి అసలు తెలంగాణాకు చేసిన ప్రణాళికా కేటాయింపులు సరిగా ఖర్చు చేయబడ లేదన్న విషయమే ఉత్పన్నంకాదు. పోతే ఈ విషయమై ప్రభుత్వం అధికార్ల నెవ్వరినీ బాధ్యులను చేయడం జరగనేలేదు.

రెండు ముఖ్యాంశాలు :

ప్రాంతీయసంఘం అధ్యక్షుడు రెండు ముఖ్యాంశాలను గూర్చి ప్రత్యేకంగా పేర్కొన్నారు. మొదటిది వ్యవసాయ భూముల అమ్మకంపై నిర్బంధం విధిస్తూ చట్టం చేయాలనడం. అటువంటి చట్టం చేయడానికి బిల్లు సిద్ధంగావుంది. శాసనసభ వచ్చే సమావేశంలో ఈ బిల్లు ప్రవేశపెట్టబడుతుంది. ఆయన ప్రస్తావించిన రెండవ అంశం, వరంగలులోని కేంద్రప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలలో తెలంగాణా ప్రాంతం విద్యార్థుల కొరకు స్థానాలు ప్రత్యేకించాలని ప్రాంతీయ సంఘం చేసిన తీర్మానాన్ని ప్రభుత్వం తిరస్కరించడానికి సంబంధించినది. ఈ అఖిలభారత సంస్థ పరిపాలనా వ్యవహారాలలో రాష్ట్రప్రభుత్వాని కెంతమాత్రం జోక్యం లేదనేవిషయాన్నీ, కేంద్రంచే నియమించబడిన బోర్డువారే ఈ సంస్థ వ్యవహారాలను ఆజమాయిషీచేస్తూ కేంద్రప్రభుత్వానికి ప్రత్యక్షంగా బాధలు వహిస్తున్నారన్న విషయాన్నీ, తెలంగాణాకుగానీ మరే ఇతరప్రాంతానికిగాని ప్రత్యేక సౌకర్యాలు అనుమతించడానికి వీలులేని అఖిలభారత విధానాన్ని వీరు అనుసరిస్తున్నారన్న విషయాన్ని ఆ సందర్భంలో వివరించవలసి వుంది.

ముఖ్యమంత్రి, తెలంగాణా మంత్రులతోసహా ఇతర మంత్రులు తెలంగాణాప్రాంతీయ సంఘం పట్ల నిర్లక్ష్యం చూపుతున్నారని సంఘం అధ్యక్షుడు ఆరోపించారు. కొన్నికొన్ని సందర్భాలలో కొందరు మంత్రులు బహుముఖమైన కార్యక్రమాలలో నిమగ్నులై వుండటంమూలాన సమయం చిక్కక ప్రాంతీయ సంఘం సమావేశాలకు హాజరుకాకపోవడం జరగవచ్చును. అయినప్పటికీ ఇటువంటి సందర్భాలలో వారి పక్షాన మరొక మంత్రి సమావేశాలకు హాజరుకావడం జరుగుతూనేవుంది. ప్రాంతీయ సంఘానికి మంత్రులు ఎల్లప్పుడూ సహాయకార్లుగా వుంటున్నారనీ, ప్రాంతీయ సంఘంపట్లా, సంఘం నిర్ణయాలపట్ల వారు శ్రద్ధాభక్తులు కలిగివుంటున్నారని ప్రభుత్వం ప్రాంతీయ సంఘానికి హామీ ఇస్తున్నది. ఈ విషయంలో ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు అన్యథా భావించడం దురదృష్టం.



# ప్లవ - ఉగాది

దివాకర్ల వేంకటావధాని

కనక కంకణ కలక్వాణమ్ము లనిపించు
ననవద్య పిక మనోహరగానములతోడ
సౌరభస్ఫురిత నిశ్వాసములఁ దలఁపించు
శ్రీరమ్య సుమనః పరిమళావళితోడఁ
జరణారవింద లాక్షారక్తిమలు నించు
ధరణీజ పల్లవోత్కర దీధితులతోడఁ
గామపునరుజ్జీవ కర్త్రి జవ్వనివోలె
శ్రీమనోజ్ఞ ముగాది చేరవచ్చెడినదే.

దళిత లతాంతహార సముదాయ మురమ్మున వ్రేల, వేపపూ
వులు చిఱుముత్తెపుసరులపోలిక సంగములం జెలంగఁగాఁ
దలిరుల సెజ్జపైఁ బ్రకృతి తామరసాక్షి నిరీక్ష చేసెడిన్,
లలితవసంత నాయకుని రాకడ వాసక సజ్జికై వడిన్.

గళమెత్తలేని కోయిల గొమ్మ తియ్యగాఁ బంచమస్వరమాలపించఁదొడఁగె
నాకులురాల్చి సన్న్యాసులట్లున్న చెట్లభినవపల్లవత్వాప్తిఁ దనరెఁ
బవనసంతతులు కంపనశీలము త్యజించి యఖిలాంగముల సౌఖ్యమావహించె
నా కాశలక్ష్మి హైమావకుంఠనమూడ్చి పరమప్రసన్న భావము వహించె
నచిర కాలమ్ముననె హరిదంతరమ్ములెంతో పరివర్తనముచెంది వింతగొలుపుఁ
గానిపింపదు కాని జగత్ప్రవృత్తి కాలచలనమ్ముచే ననుక్షణము మాఱు.

చూతకిసాలయమ్ము చవిచూచినయంతనె మూకమౌ పిక
వ్రాతము నల్గడన్ మధురరాగ పరంపరలొల్కఁబోసెడిన్
భూతలమందు మూగతనముం బోరిపుచ్చుటకై భిషగ్వరుల్
చూతకుజమ్ముఁగూర్చి పరిశోధనచేసిన మేలుకల్గదే.

జగతీనాటకరంగమందు సమయాంచత్సూత్రధారుండు మె
చ్చగురీతి న్నిబిడంపు మంచుతెర తీయన్, మీఁది దృశ్యంబులో
నగుపించున్ మధుమాస సంగతి సమాహ్లాద ప్రపూర్ణాత్మయై
నగవల్లీ సుమభూషితాంగముల వన్యశ్రీ వినోదించుచున్.

చలి భరియింపలేక జనసంతతి శైశిరవేళ నుష్ణతా
కలిత సతీకుచాశ్రయ సుఖంబున కుష్ణిళులూరవచ్చు, సం
చలిత హిమప్రపాతము వసంతమునందదె కోరుచుంద్రు శీ
తలమగు నుష్ణముష్ణము కతంబున నన్నుడిసెంత నమ్మికన్.

చివురుల్ పూవులులేని కాలముననే చిత్తోద్భవుండమ్ములు
ద్దవిడిం జిమ్మెడిజీవి సంతతులపైఁ దండోపదండంబుగాఁ
జివురాకుల్ పువుఁబోకులొప్పెడి మధుశ్రీరాకచే వర్ధితో
త్సవుఁడై యెంతగ వారివేచుటకు నుత్సాహించునో యక్కటా.

ఆమోదగర్భితంబీ మందమారుతం బఖిలాంగకముల సౌఖ్యమునఁదేల్చు
లలితమంజుల పికాలాప సంగీతమ్ము వీనుదోయికి వింతవిందుగూర్చు
వివిధసుందరపుష్ప వితరసౌరభములు ఘ్రాణేంద్రియంబు తర్పణమొసంగుఁ
దృణమహీరుహవల్లరీ హరిద్వర్ణంబు నయనయుగ్మమున కానందమిచ్చు

ఫలరసావళికూర్చు జిహ్వకును దృప్తి నీవుఖంబగు నామని నిఖిలజనుల
కిట్లు సర్వేంద్రియ ప్రీతిహేతువయ్యె ముఖవుకావలె నంతరమునకు గుర్తు.

చెదరిన యాంధ్రజాతి నొకచెంతకుఁ జేర్చిన పూర్ణరాష్ట్ర సం
పదయలవడ్డ పిమ్మట నవంబుగ వచ్చితివైభవంబుమై,
నిదెయెదతోడ స్వాగతము నిత్తుమురాఁగదవమ్మ నీలసత్
పదములు తాఁకుచోఁబసిఁడి తామరసమ్ములు మోసులెత్తఁగన్.

పలురంగులెనయు పువ్వులతోడ గుణపుష్ప సంతానములు వెదజల్లవమ్మ
నవకిసాలయరాగ నివహమ్ముతోఁ ప్రేమసంపదధాత్రినింపింపవమ్మ
మకరంద రసముతో సకలమానవదయాచిహ్నముల్ పెంపొందఁజేయవమ్మ
సురభిళామోద విస్తరముతో సద్యశోవాసనల్ దెసలనింపంగదమ్మ

మత్తమధుకర శుకపికమధురరావసమితితో నాంధ్రకవి సమాజములరమ్య
గీతముల సర్వదిశల మ్రోగింపవమ్మ ప్లవసమా! సర్వమంగళాభరణసుషమ.

అదె సిద్ధాంతి శిరోవిభూషణుఁడు పంచాంగంబు చేఁబూని య
భ్యుదయారిష్టములున్, శుభాశుభఫలంబుల్ చెప్పు సభ్యాళికిన్
పదమావంకకు నూత్నవత్సరపుఁ గందాయార్థముల్ చూచి వ
చ్చుద మాచారము మానరాదుకద యేచొప్పెట్లు వర్తిల్లినన్.

శబ్దాశ్రయ హాస్యము - (3)

# క్లిష్ట శ్లిష్ట విశ్లథ పదప్రయోగాలు

మునిమాణిక్యం నరసింహారావు

యమకంతోగాని అనుప్రాసతోగాని వాక్య రచన చేసి శబ్ద వైచిత్రి సాధించవచ్చు.

ఛేకానుప్రాసము, లాటానుప్రాసము మొదలైన శబ్దాలంకారాలు హాస్యసాధనకై వినియోగింపబడినపుడు ఒకరకమైన శబ్దాశ్రయ హాస్యము సిద్ధిస్తుంది.

"మిష్టరు కిష్టాయ కష్టపడి చదివి ఎష్టాగో అష్టా మెట్రికేషన్ ఫస్టున ప్యాసై అష్టకష్టాలూపడి, ఎంతో నష్టపడి మొన్న ఆగస్టులో జెస్టు పక్షం రోజులుండే మేష్టరీ పనిలో చేరి శిరోవేష్టం ధరించి డస్టరు చేత పుచ్చుకొని దిష్టిబొమ్మలా తయారైనాడు."

ఇట్లాంటి రచనలో శబ్దముల గడబిడ తప్ప మరేమీలేదు. ఇది చదువుతూ ఉంటే డబ్బాలో రాళ్ళు పోసి గలగల్లాడించినట్లుగా ఉంటుంది.

ఇల్లాగ చిత్ర శబ్ద ప్రయోగంచేసి హాస్యోత్పత్తి చేయవచ్చునని మన పూర్వులకూ తెలుసు. కవులు చెప్పిన చాటువులలో ఇల్లాంటి గడబిడ చాలాచోట్ల కనిపిస్తుంది.

ఇల్లాగ ఒకేమోస్తరుగా ధ్వనించే పదాలను కూర్చి చమత్కార కల్పన చేయడము ఏమంత ఎక్కువ. ప్రతిభతో కూడుకొన్న విషయము కాదు గాని ఏదో చమత్కారం లేకపోలేదు.

ఈ పద్యం చూడండి

"నీళ్ళకు నిద్రితోళ్ళకును నేతి కరళ్ళకు దొడ్డ యుత్తరేన్
ద్రేళ్ళకు దర్భ ముళ్ళకును వేదపు నోళ్ళకు సన్నకుట్టు వి
స్తళ్ళకు రావి పేళ్ళకనిశంబును మళ్ళకు ప
చ్చళ్ళకు రాగి-బిళ్ళలకు సంతతమందుదు రాంధ్ర వైదికుల్.

యమకాది అలంకారాలతో కూడిన ఈ శబ్ద వైచిత్రిలో ఒక వైలక్షణ్యం ఉన్నది. దానిని గుర్తించి ఆనందించడానికి ఒకరకమైన చిత్తవృత్తి అవసరము. ఇందులో ఏముంది అనుకొంటే ఏమీ ఉండదు!

ఇందులో ఏముందిలే అని దేనినైనా కొట్టేయవచ్చు. ఆమాట కొస్తే, "అటజని కాంచె భూమిసురుడంబరచుంబిద..........
........శీతశైలమున్" ఇందులో ఏముంది కవిత్వము — శీతశైలము చూశాడు. అంతేగా!

కాబట్టి ఒక రచనలో ఉండే చమత్కారాన్ని చూడడానికికూడా ఒకవిధమైన చిత్తవృత్తి కావాలె. హాస్యాన్ని అర్థం చేసుకోవలెననే కోరిక ఒకటి ఉండాలె ముఖ్యంగా. చంద్రదర్శన మాత్రాన రత్నగర్భ ఉప్పొంగే విధంగా, వికృత దర్శన మాత్రాన హృదయంలో రసవాహిని పొంగులెత్తే స్వభావము కలవాడై ఉండాలె పఠియిత.

పైన ఉదహరించిన పద్యాలలో యమకాది శబ్దాలంకారాలు హాస్య సాధనకై వినియోగింపబడ్డవి. ఇందు హాస్యము ఛాయా మాత్రంగా ప్రతిపాదితమగుతూ ఉన్నది. శబ్దాశ్రయ హాస్యములో ఇదియొక అంతర్విశేషము.

ఈ క్రింది పద్యాన్నికూడా అదే దృష్టితో చూస్తే ఆస్వాద్య యోగ్యమూ హృద్యమూ అయిన శబ్దాశ్రయ హాస్యము కనుపించకపోదు.

"చిన్న చిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు
నాగు లేటి నీళ్లు నాపరాళ్లు
సజ్జ జొన్న కూళ్లు సర్పంబులును తేళ్లు
పల్లెనాటి సీమ పల్లెటూళ్లు"

ఈ పై పద్యంలో యమకం తీసేస్తే రచన పేలవమై పోతుంది. దాని వలననే చమత్కారం సిద్ధించింది. ఇందులో శబ్దవైశిష్ట్యమే

గాని విషయ వైశిష్ట్యము ఏమీ లేదు. ఒకవిధంగా ఈరకము శబ్దాశ్రయ హాస్య లక్షణమే అది!

ఇల్లాగ శబ్దావృత్తి వలన పోషింపబడిన హాస్యము చిన్నపిల్లల పాటలలోకూడా మనకు కనిపిస్తుంది. వదినమీద పాట చూడండి

"అక్కల కర్ర ముక్కలపీట కూర్చో వదినా కూర్చో
వేపచెక్క వెల్లుల్లిగడ్డ పోకతమ్మి వేసుకో
కాకిబొద్దు గచ్చకాయ మెక్కవిందు తీర్చుకో
అల్లితుట్ట మర్రిరొట్ట పైటవేసి కట్టుకో
ఉల్లిపూలు నువ్వుచేరు కొప్పునిండా పెట్టుకో
అత్తమాట. క్రొత్తకుండ సవతిపోరు దిద్దుకో
ఆలగోలు వాలగోలు చెప్వె వదినా చూస్పుకో."

పైన జెప్పిన కారణాలచేతనే ఈ క్రింద ఉదహరించిన పద్య పాదంకూడా ఏదో చమత్కారంగా మనకు గోచరిస్తుంది.

పొన్నాడ కామరాజని యున్నాడొక చిన్నవాడు.

ఇంతవరకు ఉదహరించిన శబ్దావృత్తి అర్థవంతంగా ఉంది. అర్థం లేకుండాకూడా శబ్దావృత్తి కల్పించవచ్చు. అంటే నిరర్థక పదప్రయోగంవలన అంత్యానుప్రాసను కల్పించి హాస్యవంతం చేయవచ్చును. ఉదాహరణకు ఈ క్రింది వాక్యాలు చూడండి.

నిరక్షరకుక్షీ — గండభేరుండ పక్షీ
శీతాంశు కులావతంస సీతమ్మమొగుడా
ఆకర్ణాంత విశాలనయనా, వల్లభ రసాయనా!

ఈ వాక్యాల్లో మొదటిమాటయొక్క అర్థాన్ని రెండవమాట పరి పుష్టం చేయడంలేదు. రెండవమాట కేవలమూ రైమ్‌కోసం వేయబడినది.

*శ్లిష్టపద ప్రయోగము :*

పదములను శ్లేషించి విశేషార్థమును సాధించడం మన కావ్యాలలో ఎక్కువగా కనిపిస్తుంది. కాని శ్లిష్ట పదప్రయోగమువలన హాస్యాన్ని సాధించడం చాలా అరుదు. ఆంగ్లంలో ఈ హాస్య ప్రక్రియను 'పన్' అంటారు.

ఒకడు చాలా అప్పులుచేసి చనిపోయినాడు. అప్పులవాళ్లు వచ్చి మృతుని ఆస్తిఅంతా వశపరచుకొంటూ ఆతని భార్యా పుత్రులయందు దయదల్చి కొంతఆస్తి వదిలేస్తారు.... అతడు బ్రతికిఉన్నట్లయితే ఆస్తిఅంతా తీసుకొనిపోయేవారు. అతడు చనిపోవడంచేత, వాళ్ళు అతని కుటుంబానికి జీవనాధారంగా కొంత ఆస్తి వదిలేశారు. అతడే బ్రతికి ఉన్నట్లయితే వాళ్ళకు అడుక్కు తినేగతి పట్టేది.

ఆ సమయంలో ఒకమిత్రుడు అన్నాడు. వాడు చచ్చిపోయి నాడు కాబట్టి బ్రతికిపోయినారు గాని బ్రతికిఉన్నట్లు అయితే అన్యాయంగా చచ్చేవాళ్ళు అని;

ఇక్కడ 'చావడం' 'బ్రతకడం' అనేమాటలు ఒకచోట ఒక అర్థంలోనూ ఇంకోచోట మరొక అర్థంలోనూ వాడబడినవి. ఆ శ్లేష హాస్యజనకము అయింది.

ధమిడిపాటివారు ఒకసారి అన్నారు. మన కవులు బ్రతికి ఉన్నవాళ్ళు చచ్చినట్లుండి చచ్చిన తరువాత బ్రతకడం మొదలు పెడతారు అని! ఇక్కడకూడా బ్రతకడం చావడం అనేమాటలు వేరువేరు అర్థాలలో వాడడంవల్ల శ్లేష నిర్వహింపబడినది.

శ్లేషించి హాస్యసాధన చేయడం పూర్వకావ్యాలలో కనపడదు. ఇల్లాంటి వ్యాపారం సంభాషణలలో ఎక్కువగా రాణిస్తుంది. పూర్వకవులయొక్క సంభాషణలో ఎంత హాస్యం దొర్లిందో తెలుసుకొంటానికి మనకు ఆధారాలులేవు. ఆ సంపద అంతా గాలికి కొట్టుకుపోయింది. కాలం మ్రింగేసింది. అయితే వారు చెప్పిన చాటువులలో కొద్దిగా మిగిలింది. శ్రీనాథుడు పల్నాడులో ప్రయాణంచేస్తూ నీరు దొరకక్క ఇబ్బందిపడి ఈ విధంగా శివుణ్ణి ప్రార్థన చేశాడట ఏమని?

"సిరిగలవానికి జెల్లును
తరుణుల పదియారువేలఁ దగ బెండ్లాడన్
తిరిపెమున కిద్దరాండ్రా
పరమేశా! గంగవిడుము పార్వతి చాలున్.

ఈ పద్యంలో గంగ శబ్దము శ్లేషింపబడి, చమత్కారానికి తావు ఇచ్చింది.

ఇంగ్లీషుభాషలో శ్లేషవలన సాధింపబడిన హాస్యపు పలుకులు మనోహరమైనవి కనుపిస్తవి. సిడ్నీస్మిత్ ఒకసారి వీధివెంబ వెడుతూ ఉన్నాడు. వీధికి ఒకవైపున ఉన్న ఇంటి అవరణలో నిలబడిన ఒక స్త్రీ అవతలవైపున ఉన్న ఇంటి ఆవరణలో నిలవ బడిన మరియొక స్త్రీతో పోట్లాడుతున్నది. వీరిద్దరిమధ్య రోడ్డు ఉన్నది.

ఆ సందర్భంలో స్మిత్ అన్నాడూ It is impossible for

those women to agree since they are arguing from different premises.

ఇక్కడ ప్రిమిసెస్ అనేమాట శ్లేషింపబడినది. ప్రిమిసెస్ అంటే ఆవరణ అని ఒకఅర్థం—తర్కశాస్త్రంలో ప్రిమిసెస్ అంటే ప్రాతిపదిక.

పన్ అనే ఈ హాస్యప్రక్రియకు ఆంగ్లంలోనే ఇంకో ఉదాహరణ ఇస్తాను. There are riddles about the man who lies when he is alive and when he is dead lies still.

ఇల్లాంటిదే తెలుగులోకూడా ఒకమాట ఉన్నది. ఒకాయన సంగతి. బ్రతికున్నపుడు అతడు సర్వవిషయములను చక్కగా నిర్వహించాడు. చనిపోయినాడు. ఆయనను స్మశానానికి తీసుకొని వెళ్లడానికి వాహకులు ఎవ్వరూ దొరకలేదు. అప్పుడు ఒక మిత్రుడు, "ఆతడు బ్రతికిఉన్నపుడూ నిర్వాహకుడే ! చనిపోయినా నిర్వాహకుడే" అన్నాడుట—

ఇల్లాంటి శబ్దచమత్కృతి ఉత్తమహాస్యం కాదుకాని ఆ జాతికి చెందిన ఒక చౌకబారు హాస్యపు పలుకుబడిక్రిందకే వస్తుంది, అంటానికి సందేహంలేదు.

శిష్టా రామకృష్ణశాస్త్రిగారు, శిష్టా సీతారామశాస్త్రిగారు ఇట్లా అన్నారని తమ వ్యాసంలో వ్రాశారు. వారు గుంటూరులో మిషనరీ కాలేజీలో ఉండేవారుట—ప్రిన్సిపాల్‌గారు వారిని పిలిచి అయ్యా మీకు ఎన్నేండ్లు అని ప్రశ్నిస్తే శాస్త్రిగారు "తొమ్మిదేళ్లు" అన్నారుట—తొమ్మిది ఏళ్ళు 63 అని వారు అనుకొన్న అర్థం — అదే శ్లేష !

భమిడిపాటి వారికి జబ్బుచేసింది. విశాఖపట్నం ఆసుపత్రిలో ఇన్‌పేషెంటుగా ఉన్నారు. జబ్బు చాలావరకు నయమైంది అని తోచింది. ఆసుపత్రి అధికారులు పేషెంటును డిస్‌ఛార్జి చేద్దామని ఆలోచిస్తున్నారు — ఆ సమయంలో వారి శిష్యులైన పట్టాభిరామారావుగారు గురువుగారిని చూడ్డానికి వెళ్ళి ఆయనకు సంతోషం కలుగజేసే వార్తగదా అని మాష్టారూ మిమ్ములను డిస్‌ఛార్జి చేస్తారుట. సంతోషకరమైన వార్త ! అన్నారు. ఆ మాట మీద కామేశ్వరరావుగారు. సంతోషమే కాని—డిస్‌ఛార్జి చేసేముందు బాగా ఛార్జిచేస్తారని భయంగా ఉంది అన్నారట. ఛార్జి అనే మాట శ్లేషింపబడినది.

రామకృష్ణ కవి ముక్కు తిమ్మనా బావా మరదుల వరసలో మాట్లాడుకొనేవాళ్లు. తిమ్మన మహాకవి తూగుటుయ్యాలలో ఊగుతున్నాడు. అపుడు రామకృష్ణుడు — తిమ్మనతో అన్నాడట. "బావా ఊతునా ?" అని. తిమ్మన, తలఊపి తన సమ్మతిని తెలియజేయంగానే రామకృష్ణుడు — మహాకవిపై ఉమ్మేసినాడు — ఊతునా అన్నమాటకు విశేషార్థం తీశాడు — కాని ఇది చాలా కుత్రతసంగా ఉంది. మహాకవుల మధ్య జరుగవలసిన ప్రసంగం కాదు. జుగుప్సాకరంగా కూడా ఉన్నది. కాని అనుశ్రుతంగా వస్తున్నకథ ఇది.

శివశంకరశాస్త్రిగారు మా యింటికి అప్పుడప్పుడు వస్తూ ఉండేవారు. మేము బందరులో ఉండగా ఒకసారి వారు ఉన్నప్పుడు మా అబ్బాయి దొడ్లో అరటిచెట్టు దగ్గర ఆడుకొంటున్నాడు — శాస్త్రిగారు — ఏంజేస్తున్నావురా ? అని అడిగితే వాడు — ఆడుకొంటున్నాను అన్నాడు. అప్పుడు శాస్త్రిగారు — "అరే అబ్బాయి రంభతో క్రీడిస్తున్నావా నాయినా" అన్నారు. మనోహరమైన శబ్ద వ్యాపారము — రంభ — క్రీడించు — అనే రెండు పదాలు శ్లేషింపబడినవి.

రావూరువారు చెప్పిన కథ. ఎవరినో అడిగారట రావూరువారు చంద్రమతి, సుమతి ఉన్నారా అని.

ఆడవాళ్ళా అని అడిగాడు అమాయికంగా అవతల పెద్దమనిషి — రావూరువారు, ఆడవాళ్లుకాక మగవాళ్లకు మతి, ఎక్కడుందయ్యా అన్నారు. ఈ విషయం వారు ఏదో సినిమా స్క్రిప్టులోకూడా ఎక్కించారు — మతి — అనే పదం శ్లేషింపబడినది. శ్లిష్టపద ప్రయోగం వలన హాస్యము సాధింపబడినది.

ఇల్లాగ శ్లేషవలన సున్నితము, మనోహరము అయిన హాస్యాన్ని సృష్టించవచ్చును. కాని ఈ శాబ్దిక హాస్యము అత్యుత్తమమైన హాస్యము క్రిందికి రాదు అనేవాళ్లూ ఉన్నారు — ఈ హాస్యక్రియను గురించి ఒక ఇంగ్లీషు గ్రంథకర్త వ్రాసిన రెండు వాక్యాలు ఇక్కడ ఉదహరిస్తున్నాను.

It cannot be denied that an adroit play upon words rarely fails to make the reader smile. But punning pure and simple cannot reach a high standard of humour, and should be indulged in with great discretion and very sparingly.

ఇంకొక ఉదాహరణ ఇస్తున్నాను. కాటూరువారు ఒకసారి రాత్రి పడుకోబొయ్యేముందు పొగాకు ముందేసుకొని చుట్టలు చుడుతూఉంటె నేను అన్నాను. "ఇప్పు డెందుకండీ చుట్టలు చుట్టడం — ఎట్లాగూ పడుకొని నిద్రపోబోతూ ఉంటిరి ?"

ఆయన అన్నాడూ — చుట్ట చుట్టుకొని పడుకోవడం మంచి అలవాటు. ఆదిశేషుకూడా చుట్ట చుట్టుకొని పడుకొన్నట్లు

పోతన మహాకవి పర్ణించాడు అన్నారు — చుట్ట చుట్టుకొని — అనేమాట శ్లేషింపబడినది.

ఒకావిడ భర్త చనిపోయినాడు — ఆమె ఏడ్పుసుగురించి ఒక మిత్రుడు అన్నమాట. When her husband died, she wept for a second. ఈ వాక్యము రెండు అర్థాలను ఇస్తుంది. భర్త పోయినపుడు ఆమె ఒక సెకండు కాలము ఏడ్చిందని ఒక అర్థమూ. ఆమె రెండో భర్తకోసం ఏడ్చింది అని ఇంకో అర్థమున్నూ.

శ్లిష్టపదప్రయోగములు హాస్యసాధనకు ఎట్లా సాధ్యమో చూపినాను.

సాధారణంగా అంటూ ఉంటారు — వైయ్యాకరణుడు ధాతు పుష్టి కోసం, తార్కికుడు లింగపుష్టి కోసం చూస్తారని, ఇచ్చట ధాతు లింగ పదములపై అర్థశ్లేష ఉన్నది.

శిష్టావారు వ్రాసిన మరొక కథకూడా వారి మాటలలోనే ఇక్కడ ఉదహరిస్తాను. "ఒకమారొక విద్వత్సభలో ఒక ప్రతిభావంతుడు అధ్యక్షుడుగా నుండగా కొందరు వక్తలు ఉపన్యసించిరి. తరువాత ఒక హరిజన కవి కార్యక్రమమును అనుసరించి వేదికపై రావలసి యుండెను. అంత నా యధ్యక్షుడు ఆతని ఆహ్వానించి, ఇక పంచమ స్వరము వినబడును అన్నాడట. ఆ హరిజన కవి, కాక స్వరమును వినుటకు ముందు పంచమ స్వరమును విందురుగాక అన్నాడట.

ఈ శ్లిష్ట వ్యాపారానికి ఉదాహరణగా మరొక కథ నేను విన్నది ఇక్కడ ఉదహరిస్తాను. విజయనగర మహారాజులం గారు నడిమింటి మంగళేశ్వర శాస్త్రిగారితో మాట్లాడుతూ, అదేమి టండీ మీ ఇంటిపేరు నడిమింటి వారూ అనడం చాలా విచిత్రంగా ఉంది. ముంగటిల్లు కాదు, వెనుక ఇల్లు కాదు. సరిగ్గా నడిమింట ఏమి టండీ అని హేళనగా నవ్వినారట. నడిమింటి మంగళేశ్వర శాస్త్రిగారు, మందహాసం చేసి "ఏదో లేండి. నడిమిల్లు అంత విలువ అయినది కాదు అనుకోండి. అయినా పూసపాటి చెయ్యదా మహారాజా" అన్నారట! (మహారాజా వారి ఇంటి పేరు పూసపాటి వారు) పూస పాటి అనే మాట శ్లిష్టమైనది. రాజావారు కూడా ఈ చమత్కారానికి సంతోషించినారట!

వెంకటశాస్త్రిగారు ఒక పండితుని గురించి మాట్లాడుతున్నాడు — ఆయనకు పళ్లు ఊడి పోయిన కారణాన, ఆయన 'పతిత ద్విజుడు' అని అన్నారట. పతిత ద్విజుడూ అంటే పండ్లూడిపోయిన వాడు అనే అర్థమే కాక చెడిపోయిన బ్రాహ్మణుడు అనే అర్థం కూడా వస్తుంది. ఆ పండితునికి ఈ లక్షణం కూడా ఉండడంవల్ల ఆ మాట సరిగ్గా అతికిపోయి, ఆయనకు తగి లొచ్చింది — అందుకే వెంకటశాస్త్రిగారి మాట విని అక్కడున్నవాళ్లంరా ముసిముసి నవ్వులు నవ్వారు.

కవిత్వంలో ధ్వని ఉండాలి. ధ్వనిపౌష్కల్యం ఉత్తమ కవిత్వానికి ఉండవలసిన లక్షణం—ఈ విషయమై నాకూ జమదగ్ని శర్మకు సంభాషణ జరుగుతున్నది — జమదగ్నిశర్మ చివరకు అన్నాడు. మా అబ్బాయిలో కూడా మహాకవికి ఉండవలసిన లక్షణం ఎక్కువగా ఉందీ అని! ఏమిటి ఆ లక్షణం అని అడిగితే వాడు స్వప్నావస్థలో ధ్వని పౌష్కల్యం ప్రదర్శిస్తూ ఉంటాడు అన్నాడు— ధ్వని శ్లేషింప బడినది.

హనుమంతరావు గారు నియోగులు. వారికి నియోగు లంటే అభిమానం ఎక్కువ. ఈ విషయం వచ్చినప్పుడు అది సహజమే నయ్యా. హనుమంతరావు గారికి శాఖాభిమానం ఉండడంలో వైపరీత్యము ఏమీలేదు అన్నారు శివశంకర శాస్త్రిగారు. అంతా నవ్వారు. ఎందుకా అనుకొన్నాను. తరువాత తెలిసింది. శాఖ అంటే వర్గం — వైదికులు నియోగులు బ్రాహ్మణులలో శాఖలు — శాఖ అంటే, చెట్టుకొమ్మ అని కూడా అర్థం ఉన్నది. ఇచ్చట శాఖ శ్లేషింపబడి హాస్యానికి తావు ఇచ్చింది.

ఇల్లాగే ఇప్పుడు మా తమ్ముడు ఆఫీసులో కైంకర్యము చేస్తున్నాడు అంటే నవ్వొస్తుంది. కైంకర్యము అంటే వ్యుత్పత్త్యర్థంలో సేవ అనీ, రూఢంగా దొంగతన మని, అర్థాలు ఉన్నవి. అందుకని నవ్వొస్తుంది.

*విశ్లథపదప్రయోగం*

పదరూపంలో వికృతి సాధించడానికి ఉన్న మార్గాలలో పదాన్ని విడదీయడం ఒకటి—ఇతర పదసాన్నిధ్యాన్నుంచి, సాంగత్యాన్నుంచి ఒకమాటను బైటకు లాగితే, ఆ మాట విపరీతార్థాన్ని ఇచ్చేది అయినా అవుతుంది లేకపోతే నిరర్థక పదమన్నా అవుతుంది.

ఉదాహరణకు చూడండి. కృపారసంబు పైజల్లెడు మోమువాడు అనే వాక్యంలో "జల్లెడు" మోమువాడు అనేమాట విడదీస్తే, ఇతరపదముల సాంగత్యంలో వచ్చే అర్థంకాక మరో అర్థం లాగడానికి వీలుంది. జల్లెడు మోమువాడు అంటే జల్లెడ

ఏంటి ముఖము గలవాడు అని అర్థం వచ్చి హాస్యాస్పదము అవుతుంది.

నేను భీమవరంలో ఉపాధ్యాయుడుగా ఉన్నప్పుడు ఇల్లాంటి సంఘటనే ఒకటి జరిగింది.

నేను అసలు చరిత్ర చెప్పే ఉపాధ్యాయుణ్ణి. తెలుగుపాఠాలు చెప్పమని నన్ను ప్రధానోపాధ్యాయులవారు కోరారు. తెలుగు పండితుల క్లాసులలో కుర్రవాళ్లు అల్లరిచేస్తున్నారట ! ఇంగ్లీషు వచ్చిన మాస్టరు అయితే బాలురను మంచి క్రమశిక్షణలో ఉంచ గలడనీ, అటువంటివాడు తెలుగుపాఠాలు చెపితే క్లాసులో అల్లరి ఉండదనీ ఆయన అభిప్రాయపడ్డాడు. అందులో కొంత నిజం లేకపోలేదు. కుర్రవాళ్లు అల్లరిచేస్తుంటే 'Dont talk–Sit down' అని గట్టిగా కోపపడితే ఉండే సత్ఫలితము, "మాట్లాడకు – కూర్చో" అని ఎంత గట్టిగా అరచినా రాదు.

ఇంతకూ ఏమైంది అంటే, ఇంగ్లీషు తెలుగూ సమానంగా వచ్చినవాళ్లు ఆయనకు నేనుతప్ప ఇంకెవ్వరూ కనపడలేదు. "నువ్వు తెలుగు పాఠాలు చెప్పాలె తప్పదు", అన్నారు ఆయన.

నాకు తెలుగులో పాండిత్యంలేదు. ఏదో కాస్తో కూస్తో పరిచయము లేకపోలేదు. ఆయన నీవే తెలుగు చెప్పాలె అని అన్నప్పుడు నేను కాదనలేకపోయినాను. చెప్పలేకపోతానా అను కొన్నాను. ఏదో తెలుగు సాహిత్యంలో కొద్దిగా పరిచయం ఉండె. తా॥ వెంకయ్య వ్యాకరణంకూడా చదివి ఉంటిని. వాళ్ళకు చెప్ప డానికి ఈ మాత్రం చాలదా అనుకొన్నాను. అదీగాక తెలుగు పాఠ్యగ్రంధాలకు అయిదుగురు పండితుల నోట్సు ఉండనేఉండె! ఎట్లాగో లాగేద్దామనుకొన్నాను. అదీగాక తెలుగు పాఠాలు చెప్పా లని సరదాకూడా కలిగింది "సరే" అన్నాను.

నన్ను తెలుగుపాఠాలు చెప్పడానికి నియోగించేసరికి అసలు తెలుగు పండితులకు పుట్టెడంత కోపం వచ్చింది. "ఈయనకు ఏమివచ్చునని తెలుగు పాఠాలు చెపడానికి ఒప్పుకొన్నాడు. ఈయనకు ఇంతధైర్యం ఎట్లాగొచ్చింది. సరే, ఏమి చెప్పగలడో అదీ చూస్తాముగా !" అని వళ్ళు కొరికొరట పండితులు.

వాళ్ళు విద్యార్థులను నా పైకి ఉసిగొలిపారు. ఈ మాటకు అర్థం అడుగు, ఈ సమాసానికి విగ్రహం చెప్పమను అని ! వాళ్ళువచ్చి అడుగుతూ ఉండేవారు. ఈ మాటకు ప్రకృతి ఏమిటి దీనికి వికృతి ఏమిటి అని కూడా అడుగుతూ ఉండేవారు. తెలిస్తే చెప్పేవాణ్ణి, తెలియకపోతే ఆ మాటకు వికృతి ఏమిటిరా దానికి వికృతిలేదు. అని బుకాయించీ, దబాయించీ ఉపాయంగా కొట్టు కొస్తూ ఉండేవాణ్ణి.

ఇల్లాగ ఎంతోకాలం గడవకముందే నాకు తెలుగు బాగా రాదనీ, వ్యాకరణ జ్ఞానం బొత్తిగా శూన్యమనీ ఒక పుకారు బయలుదేరింది. దాంతో నేను కుర్రవాళ్ళకు లోకువ అయిపోయినాను. ప్రతి బొడ్డూడని చిన్నవెధవ వచ్చి, ఏదో ప్రశ్న అడిగి, నేను చెప్పిన సమాధానంతో తృప్తిపడక, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వెళ్ళిపోతూ ఉండేవాడు.

ఒక రోజున ఒక కుర్రవాడు వచ్చి నా పాండిత్యాన్ని పరీక్షిస్తున్న వాడిలాగ తెలివైన చూపులు చూస్తూ, మాస్టారూ "లంగూడీ" అంటే ఏమిటండీ అని అడిగాడు.

"లంగూడీ," ఏమిట్రా ప్రభూ ! ఈ మాట ఎప్పుడూ వినలేదే! అనుకొని "ఆమాట ఎక్కడొచ్చింది ?" అని అడిగాను.

తా॥ వెంకయ్య వ్యాకరణంలో నండీ అన్నాడు.

చచ్చానురా, దాబూ ! ఈ మాటకు అర్థం చెప్పలేకపోతే నాకు తా॥ వెంకయ్య వ్యాకరణంకూడా రాదని ప్రచారం లేవతీస్తారు. ఏంజేసేది ? అనుకున్నాను.

అప్పటికి ఏదో గంట కొట్టారు. నేను వెళ్లిపోయినాను. ఆ విష యం ఆ కుర్రాడు జ్ఞాపకం ఉంచుకొని, మరునాడు మళ్ళీ అడగొచ్చాడా అనుకొన్నాను.

వాడికి జ్ఞాపకం ఉండనూ ఉంది. వాడు వచ్చి అడగనూ అడిగాడు, లంగూడీ. అంటే ఏమిటండీ అని !

ఈ లంగూడీ ఎక్కడినుంచి వచ్చిందో నా ప్రాణం తీస్తున్నది అనుకొని, ఆ మాట నీకు ఏ పుస్తకంలో వచ్చింది ? ఆ పుస్తకం ఒకసారి తీసుకురా అన్నాను. అసలు ఆ పుస్తకం చూస్తే ఆమాట ఏమిటో ఏ సందర్భంలో ఆమాట ఉపయోగింపబడ్డదో తెలుసుకో వచ్చునుగదా అని ధైర్యం తెచ్చుకొన్నాను.

అసలు ఆమాట అక్కడ ఉండదనే నా ధైర్యం. అయితే వాడు ఒక పుస్తకం తెచ్చి చూపించాడు. అందులో ఆమాట ఉండనూ ఉంది ! ఏమిటీ ఆ వాక్యం ? అ, అ, ఇ, ఈ లం గూడి !

ఓరి సన్యాసి నన్ను ఎంత భయపెట్టావురా ! అని విసుక్కొని ఆ కుర్రవాణ్ణి పంపేశాను. మాటలు విడదీయడంవల్ల ఇల్లాంటి

హాస్యము వస్తుందీ అని చెప్పడానికి ఇదంతా చెప్పాను.

ఇటువంటిదే ఇంకొకటి. కుర్రవాడు ఒకడొచ్చి, రావణుడి, ఇంటిపే రేమిటండీ అని అడిగాడు — ఆ కాలంలో ఇంటిపేర్లు లేవు అంటే వాడు నమ్మక ముసిముసి నవ్వులు నవ్వుతూ రావణుని ఇంటి పేరు "గాదె"వా రండి అన్నాడు — ఎల్లాగ తెలిసిందిరా, ఈ సంగతి నీకూ అని అడిగితే, వాడు వాళ్ళ పాఠ్యగ్రంథంలో నుంచి, ఒక పద్యపాదం చదివినాడు "గర్వించి చెడిపోయె - గాదె, రావణుడు" అని ఉంది.

విడదీయకూడనిచోట విడదీయడంవల్ల, చదువుతూ ఉన్నవాక్యం అర్థంచేసుకోకపోవడంవల్ల ఇల్లాంటి హాస్యం వస్తూఉంటుంది.

అల్లుడా రమ్మని యాదరంబున బిల్వ - బంపు మామను బట్టి జంపగలమె అనే వాక్యంలో, ఈ బంపుమామ తెలుగు నేలమీద చాలాకాలంనుంచి ఉంటున్న సంగతి అందరికీ తెలుసు.

ఒక వాక్యంలోఉన్న ఏ శబ్దానికైనా ఇతర శబ్దాల సహచర్యం వలన అర్థము నిర్ణయింపబడుతూ ఉంటుంది. అన్యశబ్దాలనుండి దానిని విడతీస్తే, విపరీతార్థము సిద్ధిస్తూ ఉంటుంది. అల్లాంటి విశ్లథ శబ్దము వికృత భావ ప్రతిపాదితమై హాస్యస్థాయికము అవుతున్నది. శబ్దాశ్రయ హాస్యములో ఇదికూడా ఒక అంతర్విశేషము.

---

## మీకు తెలుసా?

1. ప్రపంచంలోకెల్ల పెద్దనది మిస్సోరి - మిసిసిపి. (ఉత్తర అమెరికా) పొడవు 4502 మైళ్ళు.
2. ప్రపంచంలోకెల్ల ఎత్తయిన భవనము సోవియట్ భవనము (మాస్కో) ఎత్తు 1365 అడుగులు.
3. ప్రపంచంలోకెల్ల పురాతనమైన ఎత్తయిన కట్టడము. ఖియాప్సు పిరమిడ్ ఎత్తు 450 అడుగులు.
4. ప్రపంచంలోకెల్ల ఎత్తయిన అగ్నిపర్వతము - కొటపాక్సి. (దక్షిణ అమెరికా) ఎత్తు 19580 అడుగులు.
5. ప్రపంచంలోకెల్ల లోతయిన కాలువలు - కీల్ (జర్మనీ), పెనామా (అమెరికా) లోతు 45 అడుగులు.
6. ప్రపంచంలోకెల్ల పెద్ద జలపాతము-సదర్ లాండ్ (న్యూజీలెండు) 1904 అడుగుల ఎత్తునుండి పడుతుంది.
7. ప్రపంచంలోకెల్ల పెద్ద రైల్వేస్టేషన్ : సోనేపూర్ (ఇండియా); పొడవు 2415 అడుగులు.

—వీరిశెట్టి సుబ్బారావు.



# సత్య సందర్శనము

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

"అన్నవరప్రభూ! హృదయ మున్నది గల్గిన తెల్గువాడు నీ
వున్న గిరీంద్రసానుభవదోజ్జ్వలరేఖల గాంచినంతనే
స్విన్నవిలోచనంబులను చేతులు మోడిచి ఒక్కసారి లో
నున్న వెలుంగు లొత్తుకొను నూహల శీర్షమువంచి మ్రొక్కడే!"

*  *  *

అని యేదో యొకవేణునాదమటు మ్రోయన్ మ్రోయ నిత్యమ్ముదే
వనిగా నిల్వగలేక పర్విడితి పంపాతీరపుణ్యావనీ
మణిశైలోపరిభద్రపీఠనివసన్మన్మానసారాధ్య మో
హన తేజమ్మును కన్నులార గను నూహల్ దోహలంబై చనన్

*  *  *

పంపాతరంగిణీ పంకజ గంధవాహ కుమారు లసివారు లరుగుచోట
తొలియెండతళుక్కులో తలలూచు మున్నూరు పూలనీడలదారి పొల్చుచోట
ఆబాలవృద్ధ భక్త్యావేశ ఫలపుష్ప వినమత్కరాంజలుల్ వెలయుచోట
మది నన్నవరముల నిదె యిందమని చేయిచాచి యిచ్చునటంచు వేచుచోట
అద్వితీయమ్మునైన త్రైపాద్విభూతి యంత్రశిఖరాగ్ర దివ్యసింహాసనమున
నా యెడదతమ్మి పీఠ కనారతమ్ము కదలి మ్రోసెడి గండుతుమ్మెదను గంటి!

*  *  *

ఏమీ ఏమిఋణానుబంధము ప్రభూ! ఇంతప్డె మాయమ్మ, గా
రాముల్ దా, పచరించి యుగ్గిడుచు పాల్ ద్రావించునానాడె, నీ
నామమ్మున్ గరిగించి తీయగ ననున్ ద్రావించెనేమో కదే!
ఆ మాధుర్యము జన్మలో విడువదయ్యా! రక్తసంబంధమై.

*  *  *

బలిచక్రవర్తియౌదల దైవపాదుకా సుకృతమ్ము వెట్టువస్తువులు గనగ—
కలశాబ్ధిరాజు చక్కనిచుక్కనీయ చేతులు చాచి కడుగు వస్తువులు గనగ—
ప్రామినుక్క వేల్పులమ్రాకుల కొనకొమ్మ మెరయు కిసాలమంజరులు గనగ—
దివిపుట్టు నమృతమ్ము శివు జటాపుష్పమ్ము గంగమ్మపుట్టింటిగడపలు గన—

ఏమి ఏనాటికేనాటి కిపుడు పండె నాదు సుకృతమ్ము, స్వామిశ్రీపాదయుగళి
దర్శనమహోత్సవమ్మున తనివితీర కన్నులకు వెన్నెలద్దు సుఖమ్ము తోచె!

*　　　　*　　　　*

అన్నాదమ్ములరేమొ నీవు మరి దక్షారామభీమన్న—నీ
సాన్నిధ్యమ్మున నిల్వ నచ్చముగ దక్షారామసౌధమ్ములో
నున్నట్లే యనిపించు, నచ్చటను మా యూహాస్ భవన్మూర్తి సం
పన్నంబౌ, బళి! తెల్గువారి పరమాద్వైతంబు సత్యంబటే!

*　　　　*　　　　*

ఎన్నడు, పుణ్యచిత్తుడు మహీసురముఖ్యుడు రెడ్డిరాజ్యసం
పన్నలినీరవిప్రభుడు మాధవమాధవశీలి బెండపూ
డన్నయమంత్రి, యన్ననర మంచని యీ పురినిల్పె, నాడె భీ
మన్నకు తమ్ము డిందు వెలయంగలడంచు భవిష్య మెంచెనో!

*　　　　*　　　　*

తులసిదళాలు బిల్వములతో, కలగల్సిన విప్రపూజలా?
పలపల నాగలింగసహవాసమ? పైన త్రిపుండ్రధారణా
కలితవిలాసమా? నిలువగా శివయంత్రకృతాధివాసమా?
బళి, బళి! వైష్ణవుల్ దరియవత్తురె? ఏమి చమత్కృతుల్ ప్రభూ!

*　　　　*　　　　*

హరియంచున్ హరుడంచు కొంద రిట నేకాంతుల్ విజృంభించి నె
త్తురువాకల్ పచరించి స్వీయమత ముద్ఘోషింపగా వేదవాక్
పరమార్థజ్ఞు డుదారు, డాంధ్రుడు, నవాద్వైతమ్ము రూపించె తత్
పరమోదాహృతి నీవు గాకెవరు దేవా! నిత్యసత్యాకృతీ!

*　　　　*　　　　*

అటు సింహాచలచందనార్తనరసింహస్వామివై, పైని వేం
కటశైలంబున కొల్వుతీర్చిన రమాకాంతస్ఫురన్మూర్తివై,
ఇట, రత్నాచలశేఖరాగ్రమణివై, ఈశానశ్రీశాత్మక
స్ఫుటతేజ మ్మొకడంచు దెల్పు శుభచిన్మూర్తీ! కృపన్నిల్పవే!



కథానిక :

# పెళ్ళికి పెద్దలు

కొడవటిగంటి కుటుంబరావు

అమ్మాయికి సంబంధాలు చూడటంలో కొంత తాత్సారం జరిగినమాట నిజమే. కాని అందుకు ఏ ఒకరినీ తప్పుపట్టటానికి వీల్లేదు — పడితే అందర్నీ పట్టాలి. అందర్నీ తప్పుపట్టవలసి వచ్చినప్పు డెవర్నీ ఏమీ అనకుండా ఉండటంమంచిది.

జీవితం కాళ్ళజెర్రిలాటిది. అది వెయ్యికాళ్ళతో నడుస్తుంది. అయితే తేడాఏమంటే, కాళ్ళజెర్రికి చరచరా నడిచి పోవటం తెలుసు, జీవితానికి తెలీదు. అందుచేత ఒక కాలు వెయ్యవలిసినప్పుడు ఇంకోకాలు వేస్తుంది. ఒకకాలు ఒకపక్కకి పడితే మరోకాలు మరోపక్కకి పడుతుంది. ఒకొక్కసారి ఒకకాలు మరోకాలుకు కొట్టుకుని జీవితం బోల్తాపడటం కూడా కద్దు, అందరికీ అనుభవంలో ఉండేసంగతే గనక ఈవిషయం సాగదీయ నవసరంలేదు. ఒక్క ముక్కలో చెప్పాలంటే జీవితం కంటే, తప్పటడుగులు వేసి మధ్య మధ్య చతికిలబడే పాపాయి నయం — ఆ పాపాయి తన తప్పులు సరిదిద్దుకుని, ఇవాళ కాకపోతే రేపైనా నడవటమూ, గెంతటమూ, పరిగెత్తటమూ నేరుస్తాడు, జీవితం రామాయణ కాలంనుంచీ ఇదేవిధంగా అఘోరిస్తున్నది.

అమ్మాయి పెళ్ళిని గురించి సహజంగా అందరికన్న అధికంగా ఆరాటపడిన వాళ్లు అమ్మా నాన్నా. అయితే వాళ్ల ఆరాటాలకు శ్రుతికలవలేదు. అసలే దంపతులు; అందులోనూ ముప్పైఏళ్లుగా దాంపత్యం వెలగబెట్టిన వాళ్ళు. ముప్పైఏళ్ళ దాంపత్యంలో ఏదో ఒకటి జరగాలి; ఒకరి మనస్తత్వం ఇంకొకరికి అనుకూలంగా మారనైనా మారాలి; లేదా, ఒకరికొకరు విరుద్ధంగానైనా తయారు కావాలి. మూడో మార్గం లేదు.

అమ్మా నాన్నా రెండో పద్ధతి అవలంబించారు. ఎవరో ఒకరు అవలంబించకపోతే ఆపద్ధతి ఉండనే ఉండదుగా!

కాపరం పెట్టిన కొత్తలో వాళ్లమధ్య ఇంతవ్యత్యాసం లేదు. ఒకరు ఈశాన్యంగా ఉంటే మరొకరు ఆగ్నేయంగా ఉన్నారేమో. కాని కాలం గడిచేకొద్దీ వాళ్ళు బొత్తిగా ఉత్తర దక్షిణాలై పోయారు. ఇట్లా కావటానికి అవసరమైన ప్రక్రియలు వాళ్ళకు వాళ్లే సృష్టించుకున్నారు. ఒకరికి ఏమాటంటే ఉలుకొస్తుందో అదేమాటను రెండోవాళ్ళు పనిపెట్టుకుని అనటం, ఒకరు ఏ విషయాన్ని గురించిగాని రాద్ధాంతంచేసే ధోరణిలో పడగానే రెండోవాళ్ళు చప్పరించి, "ఊ! ఈ భాగ్యానికేనా?" అనటం. గ్రహచారం సరిగాఉండి రెండోవాళ్లు తమతో ఏకీభవించగానే ప్లేటుమార్చేసి ఇంకోధోరణి పట్టుకోవటం — ఇటువంటివి ఆ దంపతులకు కరతలామలకమైనై.

అందుచేత అమ్మ, "ఏమండీ. అమ్మాయి పెళ్ళి" — అనగానే నాన్న, "అమ్మాయిపెళ్ళో అని నన్ను తరుముతా వేమిటి? అంత యావగల దానవు నువే చూడరాదూ?" అనేవాడు.

"ఆడకుంకను నా వల్ల ఏమవుతుందీ?" అనేది అమ్మ, మగవాళ్లమీద ఏదోఒక విసురు విసిరి.

"నీకు సమ్మంధాలు వెతకటం చాతకాదుగాని నాచేత వెతికింపజెయ్యటం చాతనవునంటావు! అంతేనా?" అనేవాడు నాన్న.

అమ్మ రెచ్చిపోయేది, "చాల్లెండి! ప్రెద్దానికీ పెడార్థాలు తీస్తూను! అయ్యో, కన్నకూతురి మెడని ఆ మూడుముళ్లూ ఎట్లాపడతయ్యా అని నేను ఇదై పోతుంటే మిమ్మల్నేదో 'యింప' జేయిస్తున్నానని గుంజుకుంటారేమిటి? ఏమిటా 'యింప' జేయటం?" అని అరిచేది.

"ఓహో! నువుగాంగా ఇంతేసి ఆడపిల్లను కన్నావ్. నువు

చెయ్యి పీలుజూసుకుని పదీహేనుకు అమ్మాయి పెళ్ళి గురించి ఆరాటం తెచ్చుకుంటే నేనుకూడా నీతోబాటు ఎగ రొప్పాలి? లేకపోతే నాకు నీకున్నపాటి ఆరాటం లేనట్టా? నాకు తెలీకుండా ఎక్కడ సంపాదించావేం తెలివితేటలు?" అనే వాడు నాన్న.

ఈసంభాషణ ఒకోక్కసారి గంటలతరబడి సాగేది. ఎవరి మటుకు వాళ్ళు, "ఈ దెబ్బతో నోరు ముయ్యాలిసిందే!" అను కున్నట్టుగా తమకున్న ప్రజ్ఞయావత్తూ వినియోగించి విసర టమూ, రెండోమనిషి ఆదెబ్బ తప్పుకుని ఇంకో అస్త్రం ప్రయో గించటమూ, చాతనయితే అవతలివాళ్ళ అస్త్రాన్నే తిప్పి కొట్ట టమూ జరిగి, వినేవాళ్ళకు భారతంలోని యుద్ధ పర్వాలు స్ఫురించేవి.

ఇద్దరూ అతిరథులే గనక ఎవరూ ఓడేవాళ్ళు కారు, ఎవరూ గెలిచేవాళ్ళు కారు. కాకపోతే తమ అస్త్రాలు విఫలమయి పోతున్నకొద్దీ ఇద్దరికీ ఆగ్రహావేశం మటుకు రెచ్చిపోయేది. "శేషం కోపేన పూరయేత్" అనుకుంటూ వాగ్యుద్ధం సాగించే వాళ్ళు.

ఈ వాగ్యుద్ధాలను అమ్మాయి ఇప్పటికి నాలుగేళ్ళ నుంచీ వింటున్నది. వాళ్ళు పోట్లాడుకుంటున్నది తనకు ఎట్లాగైనా పెళ్ళికావాలన్న ఉద్దేశంతోనే నని ఆమెకు ఒక్కసారయినా, పొరపాటునకూడా, అనిపించలేదు. వాళ్ళు దాంపత్య ధర్మంలో కొట్లాడుకుంటున్నారు అంతే. తనపెళ్ళి నిమిత్తమాత్రం — ఒక సాకు! కావలిస్తే వాళ్ళు వంటకాలను గురించీ, సినిమా కెళ్లటం గురించీ, నగలు కొనటం గురించీ, డబ్బు కాస్త జాగర్తగా వాడటం గురించికూడా అదే ఉత్సాహంతో కాట్లాడగలరు — అటుల సార్లు కాట్లాడారుకూడా.

నాన్న ఏదో కొత్త తలనూనె తీసుకురాగానే, "కాస్త డబ్బు చూసి మరీవాడుదురూ! అడ్డమైనవన్నీ కొనకా!" అనేది అమ్మ. లోగడ నాన్న చేసిన దుర్వ్యయమంతా చిత్తా వప్ప గించేసేది. దాంతోనాన్న అగ్గిరాముడయ్యేవాడు. కప్పు లేచి పొయ్యేది.

ఆతరవాత అమ్మ, "అమ్మాయికి నా కమ్మలిచ్చేసి నేను కొత్తవి చేయించుకుంటాను. సమ్మంధాలు రావలిసిన పిల్ల. ఆ ఒంటిరాతి కమ్మలేవిటి దాని రాత కాకపోతే! అయే ఖర్చు అవుతూనేఉంది. కావలిసింది ఒక్కటే అసురదు!" అని ఆకమ్మల చుట్టూ పెద్ద గూడును మహా ఒడుపుగా అల్లేది.

"దుబారా ఖర్చు గురించి నువు నాకు నీతులుచెప్పి మూడు రోజులు కాలేదే!" అనేవాడునాన్న. ఇంత శాంతంగా ప్రారంభ మైన చర్చ అరుపులతోనూ, శాపనార్థాలతోనూ విజృంభించేది.

ఈ చర్చలో ఇద్దరూ ఒక పొరపాటు చేసేవాళ్లు. అవతలవాళ్లు శాంతంగా తమ మాటలు వింటున్నారనీ, తాము చెప్పే మాటల్లో ఉన్న సత్యాన్ని గ్రహించి మనసు ఇట్టే మార్చుకుంటారనీ భ్రమ పడి మాట్లాడేవాళ్ళు.

"నేను డబ్బు ఖర్చుమాట ఎత్తటమే లేదు. నీలెక్కన నేను వెనకాముందూ చూడకుండా డబ్బు తగలేసేవాణ్ణేగా. నేననే దల్లా ఏమిటంటే నన్ను నువు నగలు చేయించమని ఏ మొహం పెట్టుకుని అడుగుతావూ అని!....అవును, అమ్మాయి చెవులు బోసిగానే ఉన్నై. నీ కమ్మలు దానికి పెట్టి దానికమ్మలు నువు పెట్టుకో. సంబంధాలు రావలిసింది నీక్కాదుగా?" అంటూ నాన్న సాగించేవాడు.

"అబ్బో, మీదుబారాఅంతా మీక్కావలిసినప్పుడే. నా కింద కానీ ఖర్చుపెడతారుగా? నాకు తెలీదూ? నగలు చేయించు కోవటం దుబారాఖర్చా? ఇంత పట్నంవుంది. ఏ నుగాళ్లనైనా అడగండి! నగలు తింటామా? ఎప్పుడమ్మినా డబ్బేగా! బంగారంధర పాపంలాగా పెరిగిపోతున్నదికూడానూ! ఇది ఇంతలో తగ్గదని వాళ్ల నారాయణమూర్తికూడా చెబుతున్నాడు. నా కమ్మలు దానికెందుకు పెట్టాలి? నేను పెట్టను. మీ కూతు రేగా? ఇష్టమైతే చేయించుకోండి, కష్టమైతే మానుకోండి. ఓహో?" అనేది అమ్మ.

"ఈ భాగ్యానికేనా కూతురంటే కొండంత ఆపేక్ష ఉన్నట్లు మాట్లాడావు? నేను కావాలనుకున్నప్పుడు దానికి కమ్మలు కొంటాలే నువు మాట్లాడక ఊరుకో!" అనేవాడు నాన్న.

"అడిగితేనే ఇంత అఘాయిత్యం మాట లంటున్నారు. అడక్కుండా దానిక్కమ్మలు కొంటార్ట. నే జూడను!" అనేది అమ్మ.

ఇటువంటి వాగ్వాదాలు జరిగినప్పుడు ఆఖరుమాట తనది కావాలని అమ్మా, నాన్నాకూడా విశ్వప్రయత్నం చేసేవాళ్లు.

అసలువిషయం అయిపోతే కొసరువిషయాలు తీసుకొచ్చి చాకిరేవు పెట్టేవాళ్ళు. ఆ చాకిరేవు ఎంతకూ తెమిలేదికాదు.

అమ్మా నాన్నా రెండుమూడు వాక్యాలు మించి మాట్లాడేసరికి అమ్మాయి, "మళ్లీ చాకిరేవు పెట్టారూ?" అని వాళ్ళకు వినిపించకుండా పైకే అనేది.

"చాకిరేవుకాదే—రావణాసురుడి కాష్ఠం! ఇది ఎన్నటికీ ఆరదు," అనేవాడు అన్నయ్య కొంచెం గట్టిగానే....

కన్నకూతురి పెళ్ళివిషయంగదా అని అయినా ఆ పుణ్యదంపతులు తమ పద్ధతులు కాస్త మార్చుకోలేరు నాన్నకు పురుషకారం తన్నుకొచ్చినప్పుడు అమ్మకు వేదాంతం పుట్టుకొచ్చేది. "ఏమిటో మీ వెర్రిగాని, మనచేతిలో ఏమీ లేదు. ఎంతమందిని చూస్తున్నాం కాదు; ఆ శారదాంబావాళ్లు ఆ కూతురికోసం నా తలవెంట్రుకలన్ని సంబంధాలు చూశారు. చిట్టచివరికి, వద్దంటే వద్దనుకున్న మేనరికమే జరిగింది. వరహీనం. పిల్లకన్న పిల్లవాడు రెండురోజులు పెద్దట. పైకి ఆ మాటంటున్నారుగాని చిన్నే మోకూడానూ," అనేది అమ్మ.

అమ్మకు ఆదుర్దా తన్నుకొచ్చినప్పుడు నాన్న సరిగా ఈ విధంగానే మాట్లాడేవాడు. "ఆ సాకేతరామయ్య వాళ్లమ్మాయి సమ్మంధాలకని కాళ్ళు బలపాలు కట్టుకు తిరిగాడు. చివరకు ఎటువంటి సమ్మంధం తెచ్చాడో చూడు! గీత, అంతాగీత!" అనేవాడు నాన్న.

అమ్మాయి పెళ్ళిగురించి అమ్మానాన్నా రెండేళ్లపాటు పడ్డ హైరానను పెళ్లిప్రయత్నాలని శత్రువులుకూడా అనరు "సమ్మంధాలు చూడాలి! ఎవరూ పట్టించుకోవటంలేదు! అందుకే ఇంతవరకూ ఒక్క సమ్మంధంకూడా చూడటం పడలేదు"—ఇదే వాళ్ళధోరణి.

ఆ తరవాత నాన్న కుండపగలేసి అసలు విషయానికి వచ్చాడు. "పడు, పడు అన్న నాసవితేగాని పడ్డ నాసవితి లేదుట. సమ్మంధాలు చూడు, చూడు అనగానే సరా? ఎట్లా చూడటం? ఎక్కడని చూడటం? ఆఫీసులోపని, ఇంట్లోపని. క్షణం తీరిక లేదు. దూడగుంజ దగ్గిరనుంచి బర్రెగుంజదగ్గిర కన్నట్టు ఇంటినుంచి ఆఫీసుకూ, ఆఫీసునుంచి మళ్లీ ఇంటికీతప్ప మరోచోటికి పొయ్యే అవకాశం లేదు," అని తనస్థితి పరిచిపెట్టాడాయన.

"మిగిలినవాళ్ళంతా పెళ్ళిళ్ళు చెయ్యటంలా?"అన్నది అమ్మ.

ఆవిడకు అవసరమైనప్పుడు ప్రపంచంనిండా పెళ్ళిళ్లు చేసేవాళ్లు కనిపించేవాళ్ళు, లేదా ప్రపంచంలో ఎక్కడ చూసినా పిల్లల పెళ్లిళ్లు చెయ్యలేక అఘోరించేవాళ్ళే కనిపించేవాళ్ళు. ఆవిడ జీవిత సత్యాలతో ఆ విధంగా ఆడుకునేది.

"పదిమంది మనుషులు వెయ్యేసి కళ్లతో చూస్తుంటే తప్ప ఆడపిల్లకు సమ్మంధం కుదరదు. అందుకని ఎంతమందికో చెప్పి ఉంచా. వాళ్లుమాత్రం ఏంచేస్తారు?" అన్నాడు నాన్న.

"ఏమీ చెయ్యకుండాఉన్నా మాబాగే! అడిగిందే చాలుగదా అని ఏ దిక్కుమాలిన సంబంధమో తెచ్చి మన మెడకు తగిలిస్తారు!" అన్నది అమ్మ.

"వాళ్లు సంబంధం చూపిస్తారేగాని చేసెయ్యరుగా?" అన్నాడు నాన్న.

"అయినా వాళ్లకు మన పిల్లపెళ్లే పట్టిందా ఏమిటి?" అన్నది అమ్మ ప్లేటునూరుస్తూ.

"ఇంతకుముందు వాళ్లు పనికిమాలిన సంబంధాలు తెస్తారన్నావు. ఇప్పుడు ఏ సంబంధాలూ చూడరంటున్నావు. ఏదో ఒకటి తేల్చుకో," అన్నాడు నాన్న, చురచురలాడుతూ.

"ఏదీ? ఒక్కళ్లయినా ఒక్కసమ్మంధం తెచ్చిన పాపాన పోయినారా?" అన్నది అమ్మ.

చర్చ హనుమంతుడి తోకలాగా పెరిగిపోయింది....

సమ్మంధాలు కావలసినవాళ్లు పత్రికల్లో ప్రకటనలు వేస్తున్నారు. ఆపని చేస్తే?

ఎందుకు? డబ్బు దండగ! అవేసే ప్రకటనలకు సమాధానాలు రాస్తే పోలా?

అందుకని పెళ్ళి ప్రకటనలు చూసి, ఆశాజనకంగా కనిపించిన వాటికి సమాధానాలు రాశారు. ఇద్దరు యువకులు మళ్ళీ ఉత్తరాలు రాశారు. కాని వాళ్ల షరతులు అందుబాటులో లేవు. ఒక అబ్బాయి తనకు ఉద్యోగంచూపించే పక్షంలో చేసుకుంటానన్నాడు.

ఒకనాడు దేవుడల్లే సీతప్ప మావయ్యొచ్చాడు. "ఏం బావా? పిల్లపెళ్లికి సమ్మంధాలు చూస్తున్నావుటగదూ? ఏ

దైనా ఒనసూడేలావుందా?" అని అడిగాడు.

"ఆకాశాన ఎక్కడ ఓ యింత మబ్బుతునక లేదు," అన్నాడు నాన్న.

"సతమతమై పోతున్నావమన్నయ్యా! నువ్వు కాస్త సాయం చేద్దూ" అన్నది అమ్మ.

"నీకేం తెలుసే, వెర్రిదానా? కో అంటే కోటి సమ్బంధాలు. అంతా డబ్బులో ఉందనుకో! ఓ పదివేలు పారెయ్. కొండమీది కోతి దిగొస్తుంది," అన్నాడు మావయ్య.

"పదివేలా! నీకేమన్నా మతిపోయిందా ఏమిటి?" అన్నాడు నాన్న.

"ఎట్టావేమరి! అయితేమిటుకేం? ఒక్కగానొక్క కూతురూ. పళ్లబిగువున ఆకట్నం అలా గిరవాటేశావంటే నీబరువు శాశ్వతంగా దిగిపోతుంది. ఆతరవాత ప్రాణానికెంత హాయి! ఎంత గరిమ!" అన్నాడు మావయ్య.

"అనుకోరించినట్టే వుందలే. పళ్లుబిగించినంత మాత్రాన పదివేలు రాలేట్టుంటే అబ్బాయిని ఇంజనీరు చదివించక పోయానా?" అన్నాడు నాన్న.

మావకు ఏదో తట్టింది.

"అన్నట్టు, వారే!" అన్నాడాయన. "మాకోడలి పినతాతగారు నలుగురు కూతుళ్లకు ఎంత చిత్రంగా పెళ్లిళ్లు చేశాడనుకున్నావ్? ఆయన భార్య, 'ఏమండీ, పెద్దదానిపెళ్లి చెయ్యొద్దూ?' అని ఓనాడన్నదిట. ఆయన వెంటనే పైన కండువా వేసుకుని వాళ్లవూళ్లో హైస్కూలుకువెళ్ళి, హెడ్మాస్టరుగారి దర్శనంచేసుకుని, 'అయ్యా, పెద్దతరగతులు చదివే వాళ్లలో పేదపిల్లలు, కాస్త చురుకైనవాళ్లు, ఎవరున్నారో చెబుతారా? అని అడిగాట్ట. హెడ్మాస్టరు ఇద్దరు ముగ్గురు కుర్రాళ్లను చూపాట్ట. తన కూతురికి ఈడూజోడూగా ఉండే కుర్రాణ్ణి చూసి, 'నాయనా, మా అమ్మాయినిచ్చి చేస్తాను, చేసుకుంటావా? మీపెద్ద వాళ్లు ఎక్కడున్నారు?' ఇలా అడిగి, అన్ని వివరాలు తెలుసుకుని, మాట్లాడవలిసిన వాళ్ళతో మాట్లాడి, నెల తిరక్కుండా పెళ్లి చేశాట్ట, నలుగురాడ పిల్లలకూ ఇదే పద్ధతిని పెళ్ళిచేశాడనుకో! నాలుగు సంసారాలూ నిక్షేపంగా ఉన్నాయనుకో. సంపద పెంచుకున్న కొద్దికి పెరుగుతుంది. సంచేశావో ఏ గొడవ ఉండదు," అన్నాడు మావయ్య.

నాన్న నిర్లక్ష్యంగా తిప్పి, "ఆరోజులు వేరు. ఈనాడు నా పిల్లను తీసికెళ్లి ఏ బీదవిద్యార్థికో ఇచ్చానో వాడు నాయింట తిష్టవేస్తాడు. వాళ్లకు నాలుగు కాయలుకూడా కావాలంటే నాసంగతి అడిగావ్?" అన్నాడు.

"అన్నట్టు పిల్లలిద్దరూ ఏరీ?" అని మావయ్య మాటమార్చి చుట్టూ కలయజూశాడు.

"వాళ్లా? ఏదో ఎక్స్కర్షన్‌ట — తిరపతి వెళ్లారు," అన్నాడు నాన్న.

"పిల్లదాన్నికూడా పంపారా?" అన్నాడు మావయ్య, ఘోరం జరిగిపోయినట్టుగా.

"ఒక్కరోజుకేగదా అని, మీచెల్లెలు నేను వద్దంటున్నా దాన్ని పంపించింది. నేను వెళ్లమనిఉంటే అదివెళ్లటం ఏడేది కాదేమో!" అన్నాడు నాన్న వెటకారంగా.

"మన సౌమ్యం అన్నయ్యకు తెలుసులెండి!.... నువుమాత్రం అశ్రద్ధచెయ్యక పిల్లసంగతి మనసులో ఒకపక్క ఉంచుకోవా అన్నయ్యా!" అన్నది అమ్మ.

"నువ్వింతగా చెప్పాలా? ఇహం ఆపనిమీదే ఉంటాననుకో!" అని మావయ్య అంటుండగానే పిల్లలు వచ్చేశారు. అబ్బాయి, అమ్మాయివెంట ఇంకోఅబ్బాయికూడా ఉన్నాడు. అమ్మాయి కొత్త పట్టుచీరె కట్టి పెళ్ళికూతుర్లే వెలిగిపోతున్నది.

"ఈచీరె ఎక్కడిదే?" అన్నది అమ్మ.

"ఈఅబ్బాయెవర్రా?" అన్నాడు నాన్న.

"అమ్మాయి మొగుడు, నిన్న తిరపతిలో వీళ్లిద్దరికీ పెళ్లి అయిపోయింది," అన్నాడు అబ్బాయి.

ఒక్కసారిగా ఫిలింనడవటం ఆగిపోయినట్టయింది. సౌండ్ లేదు, బొమ్మకదలదు. అందరూ కొయ్యబారి నోటమాట లేకుండా అయిపోయారు.

తరవాత జరగవలిసినదంతా జరిగింది. నాన్న అరిచాడు, అమ్మ ఏడిచింది. సీతప్ప మావయ్య వేదాంతం చెప్పాడు. అలా రాసిపెట్టిఉంది గావును!.... ఆపటం ఎవడితరం? ....

మాటలా? అబ్బో. ఇంతకన్న యిదిగా జరిగిన సంగతులు న్నాయి!....ఏమిటో!

ఉద్రేకాలు కాస్త తగ్గాక విచారిస్తే అమ్మాయి మొగుడు చాలానుంచి సమ్మంధపని తేలింది. అతనికి ఏవంకాలేదు. అబ్బాయి స్నేహితుడు, పరాయివాడుకాదు. అయిదారువేల కట్నంతో పిల్లలనిస్తామంటే చేసుకోనివాడు. నెలకు మూడు వందలు తెచ్చుకుంటున్నాడు కూడానూ!....

అందరూవచ్చి అమ్మనూ, నాన్ననూ అభినందించారు. పెళ్లి విందు ఘనంగా జరిగింది. "అమ్మాయి మీకు తెలీకుండా పెళ్ళా డిందిటగా?" అని కొందరడిగారు.

"ఇంకానయం. ఈసమ్మంధం మేం మొదటినుంచి అను కుంటున్నదే. అల్లుడికి తిరపతిలో పెళ్లిమొక్కుఉందట అందుకని అక్కడ జరిపించాం, మేం వెళ్ళాలంటే పడక, అబ్బాయిని వెంటపంపాం!"

అని అమ్మా, నాన్నా జవాబిచ్చారు

"వాళ్ళు కారుదిగి లోపలికివచ్చే సమయానికి నేను అక్కడే ఉన్నా!" అని సీతప్ప మాఁవయ్యకూడా గొప్పలు చెప్పు కున్నాడు.

వధూవరులు కారులోంచిదిగారని ఆయన కెవరు చెప్పారో తెలీదు.

---

# నువ్వు రావాలా?

పోలీసు : ఏంటబ్బాయ్ - నీసైకిలుకు లైటులేదు. నీవుపోవుటకు పిలులేదు.

పర్రాడు : ఓ పోలీసూ! నా సైకిలుకు లైటే కాదయ్యా, బెల్లు, బ్రేకులుకూడ లేవు. ఆపటానికి పీలులేదు.

*　　*　　*

రాము : ఓరే సోమూ! నాకు తెలుగులో 40. ఇంగ్లీషులో 30. లెక్కలలో 30 అన్నీకలిపి 100 మార్కులు వచ్చాయి తెలుసా?

సోము : నాకూవచ్చాయి లేరా మహా! తెలుగులో 1, ఇంగ్లీషులో 0, లెక్కలలో 0, అన్నీకలిపి 100 వచ్చాయి తెలుసా!

*　　*　　*

తల్లి : ఏంరా! అమ్మాయిని యెందుకు ఏడ్పిస్తున్నావురా? అది అడిగిందేదో యిచ్చెయ్యరాదట్రా!

కొడుకు : అంతేచేశానమ్మా! పచ్చి మిరపకాయ కావాలంది. సరేనని యిచ్చాను.

*　　*　　*

తండ్రి : "మనదేశములో అధికముగా వుత్పత్తి యగుచున్నదేది" అన్నదానికి యేం సమాధానము వ్రాశావురా?

కొడుకు : "ఆకలి" అని వ్రాశాను నాన్నా.

*　　*　　*

మోహన్: ఈవేళ నీవీపుమీద బెత్తం నాట్యం చేసిందెందుకురా?

మురళి : అయ్యవారు సోమరితనం గురించి వ్యాసం వ్రాయమంటే సోమరితనముగా కూర్చుండి పోయాను. అందుకే.

*　　*　　*

కృష్ణ : సార్. నేనెందుకండీ బెంచీ యెక్కడం సగంపాఠం ఒప్పగించాను గదండీ?

మాష్టారు: ఓహో అలాగా! అయితే ఒంటి కాలుమీద నిలబడు చాలు!

—ఎం. ఎ. సుబహాన్

# వసంత విలాసము

శనగన నరసింహస్వామి

★

జలజలరాలు పర్ణముల సవ్వడులా ? శిశిరర్తుమీన చం
చలనయనావినిష్క్రమణచాలితనూపురశింజితమ్ములా ?
లలితమనోజ్ఞమాధవవిలాససమాగమహర్షసంభ్రమో
త్కలితవనేందిరావిధుముఖీకరకంకణనిక్వణమ్ములా ?

2

ధనదదిశాసమీరణవితానము లెప్పుడు నిష్క్రమించెనో,
ఘనమిహికాలసజ్జవనికాపట మెప్పుడు చీలిపోయెనో,
జనతనుపీడక ప్రబలశైత్య మదెప్పుడు వీగిపోయెనో,
కనుగొనరాని వేగమునక్రమ్మెను పువ్వులకారు కమ్మగా.

3

మామిడిపూలబాణములు మానవతీహృదయైకలక్ష్యముల్
గా, మృదుకింశుకప్రసవకార్ముక మెక్కిడుకొంచు, షట్పద
జ్యామధురారవమ్ములు రసాస్థలి నించుచు వచ్చె మన్మథ
స్వామి, వసంతసారథిక చందనశైలమరుద్రథమ్మువై.

4

వచ్చెను ముందు మాధవుడు, వచ్చెను భావజరాజు ముందుగా,
వచ్చెను చందనాద్రిభవ వాయుకుమారుడు, ముందు, ముందుగా
వచ్చెను కోకిలప్రభువు, వచ్చినవారలయందు ముందుగా
వచ్చిన వారలెవ్వరను వాదము తేల్పగరాని శీఘ్రతన్.

5

ఋతురాజ! నీకు స్వాగతమంచు వల్లరీసతులు క్రొవ్విరులెందు చల్లినారు;
మధుదేవ! నీకు సన్మంగళంబని భూమిజాతమ్ము లిగురుల జోతు లెత్తె;
జగదేక సౌందర్యశౌర్యా! పరాకని శౌకపైకమ్ము లెచ్చరిక లిడెను;
కుసుమేషుమిత్ర! నీ కసమానజయమని కవలేక కంఠమ్ముగా పలికిరి;
బ్రహ్మచారులు మౌనులు పాంథసతులు పాంథులు వినాగ స్వాగతి పలుకనట్టి
వారలే లేరు సురభికి, వారియందు నొకవికారము జనియింప కుడుగలేదు.

6

తోరణమట్లు పల్లవము తోచెను తత్తరుశాఖలందు, మా
లారచనమ్మొనర్చెను విలాసముగాఁ కుసుమమ్ము లీనవో
ర్వీరుహజాతి, కిట్లు వనవీథులచెట్లు పరస్పరమ్ము స్వ
ర్థారమణీ సమృద్ధిగని క్రాలుని దెట్టి వసంతవేగమో !

7

గురుతరశైశిరావసరకోపబలమ్మున పత్రభోగమున్
దొరగి, ప్రియోపగూహనము దూరము గాఁ, గృశియించు వల్లికా
వరములు మేదినీజములు పల్లవకైతవరోమహర్షణ
స్ఫురణము నూనె కౌగిలులసొంపు ఘటించు వసంతవేళలో.

8

భూరుహజాతు లెన్ని యెటుపొంచి చిగిర్చిననేమి, పుష్పసం
సారవికాసహాసముని సమ్మను చిందిననేమి, వాసనా
భారము నెల్ల దిక్కులకు పంపి రహించిన నేమి, మారతూ
ణీరను నించు భాగ్యము గణించి సదొక్క రసాలసాలమే.

9

భామినీ పదహతి భాగ్యమ్ము నందక మున్నె పూచె నశోకము తడబడుచు;
మానినీముఖశీధుమాధుర్యమందక మున్నపూచె వకుళము తెగబడుచు;
నంగనాలింగన శృంగారమందక మునుపూచె కురవకము త్వరపడుచు;
లలనాముఖానిల లాలనంబందక మునుపూచె సిందుకము భ్రమపడుచు;
నళిననేత్రాకరస్పర్శనసుఖరాగగీతి హసితపరంపరోత్కృష్ట విభవ
మందకయె మున్నపూచె, మాకందచంపక ప్రియాళు వమేరుప్రాతువులు పొంచి.

10

తావిలేమిగొప్ప తప్పిదంబగుగాక,
పుష్పమెల్ల తన్ను నప్పుగాక,
కర్ణికారకుజము వర్ణప్రకర్షచే
చూపరుల యెడంద చూరలాడు

11

చందనశైలమందు కొనసాగును ముందటుపై తటాకవా
ర్బిందుకణాంతశైత్యము హరించును, మిదమహీజ వల్లరీ
సుందరపుష్పసౌరభము చూరగొనున్ భరముంగనున్ మరుద్
బృందము లల్లనల్ల విహరించును కాముకదుర్భరమ్ములై.

12

మలయమహీధరానిలము మందముగా మెయిఁ సోకినంత, కో
కిల శుకశారికామధుపగీతము వీనులఁ జేరినంత, పు
ష్పాల నెలవచ్చెరాయని కవోష్ణవినిశ్శ్వసనోగ్రులైన పాం
థులు పదమెత్తలేక నడిత్రోవల నిల్చిరి దీనమూర్తులై.

13

ఈ విరితావులీను, మఱి యీ సన తేనియ చూరవెట్టు, నీ
పూవ్రపడంతి వన్నెలు ప్రభూతముగా మెఱయించునంచు సం
భావన సేయుచున్ భ్రమరపంక్తులు రేపును మాపు మోదమో
హావృతసంభ్రద్గతిన్ తిరుగులాడెను పుష్పనికుంజవీథిలో.

14

మంచు కురిసినట్లు మకరందధారల
కుసుమ సముదయములు కురియుచుండ
సురభి పరమశోభ చూచుకోరిక వెండి
శిశిరమేగుదెంచు చెలువుదోచె.

15

మధుపసూను డొకడు మధుపాని మత్తెక్కి
కుసుమగర్భమందు సూర్కు చెందె;
తేటిబోటి యొకతె తీగటుయ్యాల నూగె
చెలులు గానఝుంకృతులు సలుపగ.

16

ప్రథమముగ పక్వఫల మివి
తథముగ రుచిచూచి, పిదప తాను మనుష్యా-
తిథికిచ్చె శుకము మును దశ
రథసూతికి శబరి విందు రచియించుగతిన్.

17

సహకారకిసము లాస్వాదించి మత్తెక్కి పికమొండు రాగగీతికలు పాడె;
కొసరి బాలకులు కోకోయన్న చెలరేగి కోకిల మొకర్కండు కుహూపు విసరె;
చూతాసవమ్మాని నోలిశాఖిక మీద కాకపుష్పంబొండు కన్నుమోడ్చె;
పరభృతమ్మొకర్కండు పనిలేనిపనిగ నాకలితీటి మావిమొగ్గలు దునిమెను;
చిరముగా గొంతులోపల చిక్కుకొన్న పంచమస్వరవిభవమ్ము బాహిరించు
మధుమహారాజునకు వందిమాగధత్వములు భజించెను కొన్ని కోయిలకొలములు.

18

కాకపికమ్ములన్ సమముగాగను లోకము పంచమస్వర
శ్రీకలనమ్ముచే వినుతిచేసె పికమ్మనె, రూపురేకలన్
గాకము కోకిలమ్మొకటిగా గనుపించిననేమి, యామునిం
గాకము కాకమే, మఱిపికమ్మపికమ్మె తలంచిచూచినన్.

19

కోయిలకూతకే మనసు కోతవడెన్మను, మీద శారికా
గేయము వీనుజంటలను చీల్చెను, వెంటనె కీరభాషణం
బాయుపుక్రుంగదీసె, పయి నాళిరుతమ్ములు జీవజాలకం
బే యెదలించెనంచు విలపించిరిమానిను లేమి చిత్రమో !

20

పొలతుల మోహనాస్యములో, పూచిన కమ్మని తమ్మిపువ్వులో,
వెలదుల దీర్ఘనేత్రములో, విచ్చిన నల్లని కల్వరేకులో,
నెలతల మంజువాక్యములో, నిక్కపు కోవిలతీపిపాటలో
కలచెను యౌవనోదయనికాముజగజ్జనహృజ్జలేజముల్.

21

కింశుకమన్న చిత్తమున ఖేదము చెందును, చూతమంజరీ
వంశములన్న భీతిగొను, బంభరపాళియటన్న జంకు, శీ
తాంశుడటన్న క్రుంగు, పికదర్పితగానమటన్న మానస
భ్రంశమునొందు, పాంథసతి మన్మథుడెట్టి విచిత్రధన్వియో !

22

కూయకే గుండెలు కూలారిపోనగ కోకిలమా ! నీదు గొంతుకోయ;
కాయకే మానసకమలమ్ము వాడగ నెఱివెన్నెలా ! నీవు నీరుగాను;
పూయకే చిత్తమ్ముగాయమ్ముపడ చూతసాలమా ! నీ పూతరాలిపోను;
వీవకే స్వాంతమ్ము వికలింప మలయసమీరమా ! నిను పాము చూరలాడ;
పయికుర ! తూపు లెదతూట్లుసేయ క్రూర ! కంతుడా ! నీవు భస్మమ్ముగాను; ననుచు
పాంథకాంతాబలములు రేవగలుబిట్టు తిట్టిపోసిరి యోదార్చు దిక్కులేక.

23

పీచిన బంధురభ్రుకుటివీచులు కాయజకార్ముకమ్ములై,
చూచిన చూపులెల్ల రతిసుందరమోహన మార్గణమ్ములై,
తోచిన విభ్రమమ్ములును దుర్లలితత్వ మనంగలేఖలై
యేచిరి కోడెకాండ్రయెద లీ మధుమాసమునందు జవ్వనుల్.

24

ఆమని పొంగులెత్తినది యందముగా వనభూములందు నా
రామములందుగూడ, మధురత్వము నింపినదొక్క పల్లి కా
సీమలయందె కాదు పురసీమములందును, నైన పల్లి కా
భూములు పన్యదేశములె పొల్చెను మాధవరాజధానులై.

25

ఒక యెడ చంచరీకనికరోత్కటగానము విందు సేయగా,
నొక యెడ కాకపుష్ట నివహోన్మదగీతము తుష్టినింపగా,
నొక యెడ శారికానముదయోచ్చలగేయము హాయిగూర్పగా
సకలవనమ్ము గానసభసల్పు ప్రకారముతోచె నామనిన్.

26

గత శిశిరర్తుధర్మము సగమ్ము బలమ్మునచెందెనో, యనా
గత శుచికాలధర్మము సగమ్ము వరమ్ముగపొందెనో, మహో
ష్ణత బెదరింపకుండ, పటుశైత్యముచూపక జీవకోటికిన్
సతము సుఖమ్ముగూర్చెను వసంతశుభాగతి జీవగఱ్ఱయై.

27

ఓయి విలాసరాశి! మధురోదయ! వత్సరమెల్ల నీవయై
చేయుము రాజ్యమంచు వివశించుచు జంటలు జోతలెత్తగా;
నోయికిరాత! మాయెదుట నుండక వేగమపొమ్ము గ్రీష్మమే
హాయి యటంచునున్ విరహులాడిరి యొక్కవసంతమూర్తినే.

28

ఈభూమిజాతమ్ము లివురించు నిప్పుడే కాదు మేఘోదయకాలమందు;
నీ తీవలంబూవు లెసలారు నిప్పుడే కాదు మేఘోదయ కాలమందు;
నీ పూవులం దావు లేపారునిప్పుడే కాదు మేఘోదయ కాలమందు;
నీ నెమ్మి నర్తనమెదనించు నిప్పుడే కాదు మేఘోదయకాలమందు;
నయిన నేమాయె ప్రతిపదమందు ముందు మరుని మొలిపించి వలపించు మంత్రవేత్త
మధుమహారాజుచెంత సామంతనృపులు సకలఋతువులు నింకవర్షర్తువెంత ?

29

ప్రతిభావత్కవికృతి శా
శ్వత నవ్యోన్మేషగరిమ సారించుగతిన్,
ప్రతివర్షముతో చెడి యీ
ఋతువు వెలువరించు నూత్నశృంగారమ్ముల్.

30

డాసిన మధుమాసమ్మును
వీసరవోకుండ ననుభవింపుడు పెనురా
కాసిబలె కౌగిళులు విడ
జేసి నిదాఘమ్ము నిప్పుచెరగకమును పే.

31

వనమయూరము :

పాదపలతాతతికి ప్రాణసముడై, పై
కాదులకు వాక్కులిడు నామని, మహోద్వే
లాదరముతోడ నుతయౌవన విలాసాఽ
సాదనమునిచ్చి మిము సాకుతసతమ్మున్.



# "ప్రజకంతా సౌభాగ్యం"

ప్రజకంతా సౌభాగ్యం చేకూరాలంటే
ప్రణాళిక విజయం గాంచాలోయ్ !
ప్రణాళిక విజయం గాంచాలంటే
పటుతరమౌ కృషి సల్పాలోయ్ !
ఫలితం పదిరెట్లకు పెంచాలోయ్ !!
ఫలితం పదిరెట్లకు పెరగాలంటే
పలువురమూ పనిచేయాలోయ్ !
పట్టుదలతో కృషి సల్పాలోయ్ !!
పట్టుదలతో కృషి జరగాలంటే
కలిసి కట్టుగా బ్రతుకాలోయ్ !
గట్టి పట్టుతో నిలువాలోయ్ !!
ప్రజకంతా సౌభాగ్యం చేకూరాలంటే
ప్రణాళిక విజయం గాంచాలోయ్ !
కష్టించి పనిచేయాలోయ్ !!
కష్టాలను మన మోర్వాలోయ్ !!!

—హెచ్. ఆర్. వడ్డెంపూడి

# హాస్యకల్పన

శిష్టా రామకృష్ణశాస్త్రి

హాస్యము కల్పింపఁబడునదా, లేక సృజింపఁబడునదా యని విచారింపదగినప్రశ్న. అప్రయత్నముగా జనించిన హాస్యమునకు సృష్టియని చెప్పుట యెంతయేని మేలు. హాస్య మప్రయత్నముగా సిద్ధించినపుడే స్వభావసిద్ధము, రసవంతముగా నుండి యవ్యాజమనోహరముగా భాసించును. హాస్యమొకానొకపుడు తనంతనే తాను, తలవని తలంపుగా, సద్యస్ఫురణతో నుద్బుద్ధమగును. ఇట్టి హాస్యమును సృష్టియనక తప్పదు. ఇటువంటి హాస్యము సహజముగా నుండును. ఒకప్పుడు హాస్యము కొంత వ్యాఖ్యానము చేయుటవలన ప్రతిపాదింపఁబడు నొకానొక వస్తువునందు. అపుడా విషయములో పూర్వము ద్యోతకముగాని యొకానొక హాస్యరసపూర్వకభావము ద్యోతకమై, కాఁబోలనిపించి సంభావ్యముగ దోఁచును. ఇందు హాస్యభావ మా వస్తువులో నారోపింపంబడుననుమాట. ఇట్టి యారోపణలోఁ గొంత సృష్టియుఁ గొంత కల్పనగూడ నిమిడియుండును. మూలవస్తువులో హాస్యరస సృజనాత్మక బీజము లంతర్గతముగనుండగ వ్యాఖ్యానము చేతనో, యారోపణముచేతనో,లేక యుత్ప్రేక్షాతిశయోక్తులచేతనో యందలి యంతర్గత హాస్యరసము బహిర్గతముచేసి, వాచ్యముగ వ్యక్తీకరింపఁబడుననుమాట. ఇఁక మూఁడవవిధ మపూర్వ కల్పనయే. ప్రాతిపదికలో హాస్యబీజములు లేకపోయినను కవిప్రతిభవలన చమత్కారపూర్వకమైన కొంత యపూర్వకల్పనచే నే బాదరాయణ సంబంధమునో కూర్చుటచే, హాస్యగుణహీనమైన విషయమందు గూడ హాస్యరసము జనింపఁగలదు. ఇందలి చమత్కారకల్పన శబ్దముచేఁగాని యర్థముచేఁగాని కల్గింపవచ్చును. మఱియు నిట్టి చమత్కార కల్పన కథాక్రమములో కొన్ని మలుపులుతిప్పి హాస్యరస సన్నివేశమునుగాని, హాస్యరస ప్రతిపాదకమైన పాత్రనుగాని సృజింపవచ్చును. కాని యిట్టి కేవల కల్పితాపూర్వకమైన హాస్యమొకప్పుడు కృత్రిమముగానుండి యస్వాభావికముగఁ గనఁబడవచ్చును. అందుచేతనే కాల్పనిక హాస్యము కట్టుహాస్యముగఁ గనఁబడి, యప్రయత్నముగ సిద్ధించిన సహజ హాస్యముతో సమానముగా శోభింపఁజాలదు. కాన నీ కాల్పనిక హాస్యమువలన గలుగునది కేవలము వినోదమేకాని, సహజ హాస్యమువలన గలుగు నానందమువంటిది కాఁజాలదు. వినోద సంతోషములకంటె శ్రేష్ఠమైనది యానందము. ఇందు మొదటివిధమైన సహజ హాస్యమున సూక్ష్మపరిశీలన మత్యావశ్యకము. రెండవ విధమైన హాస్యమున కొంత కవితాసృష్టి కవికి కావలయును. కాని మూఁడవ విధమైన హాస్యకల్పనమందు కవికి విశేష ప్రతిభయు సృజన శక్తియు నుండినఁగాని సాధ్యముకాదు. కాన హాస్యకల్పన యొక విధమైన కవితాసృష్టి యని యంగీకరింపవలసి యున్నది. కాని మొదటివిధమైన హాస్యసృష్టి సంఘటనతోఁ గూడినది. అనగా సంఘటనలోనే హాస్యసృష్టి యుండును. ఇఁక మూఁడవవిధమైన హాస్యము కల్పనతో సృష్టింపఁబడును. ఇదియే భేదము. పై పరిశీలనము నుదాహరణలతో వివరించి విచారింతము.

సామాన్యముగా సంభాషణలో నాంగ్లభాషా పదములు ప్రయోగింపఁబడుట విద్యావంతుల యాచారమైయున్నది యీ కాలమున. కాన నాంగ్లభాష బాగుగ రానివారుగూడ తద్గౌరవప్రాప్తికై సంభాషణలోఁగొన్ని యాంగ్లపదములను దొర్లించుటకు ప్రయత్నము చేయుదురు. ఒకమారట్టి పెద్దమనిషి యొకఁడు వీధిలోఁ బోవుచుండగా నతని స్నేహితు డతనిఁ గలిసికొని కొంతసేపు మాట్లాడిన తర్వాత "ఏమిరా అట్లా నీరసముగా నున్నావే"మని ప్రశ్నించెను. అందులకా పెద్దమనిషి "నా సర్కంఫ్రెంస్ (circumference) ఏమీ బాగుండలేదురా" అని జవాబిచ్చినాఁడు. అందులకాతని స్నేహితుఁడు 'అది circumference కాదురా, circumstances అని అనాలరా,' అని దిద్దినాఁడు. దానికా పెద్దమనిషి 'దానికి దీనికి నాట్టే difficulty లేదులే' అని అన్నాడు. అంత నాతని స్నేహితు

డామాట difficulty కాదు difference రా అని చెప్పాడు. ఈ సంభాషణ విన్నవారికి నవ్వు పుట్టకమానదు. ఇందలి హాస్య మా సంభాషణలోనే యున్నది. కాని కల్పన యేమియు లేదిందు. సరియైన యాంగ్లభాషాపదము వాడుట తెలియక యమాయికముగా నా పెద్దమనిషి తత్సదృశ్యమైన యితరపదమును వాడుటచే నిందలి హాస్యము జనించినది. ఇందు హాస్యకల్పనకు ప్రయత్నమే లేదు. మరియొకటి, ఆంధ్రుఁడొకడు కన్నడదేశమునకుఁ బోయి యొక చోట భోజనము చేయుచుండెనట. ఈ యాంధ్రునకు కన్నడము బాగుగరాదు.ఆ కన్నడగృహస్థున కాంధ్రము రాదు. మనయాంధ్రుడు భోజనసమయమున నుపయోగపడు రెండు మాటలనుమాత్రము వినినాఁడు. అవి ఒకటి బేకు=కావాలి, సాకు=అక్కరలేదు అని. కాని వీని యర్థము తారుమారు చేసికొని, భోజనసమయములో నేది తెచ్చినను 'సాకు' అని చెప్పుటచే, విస్తరిలో నేమియులేకపోయెను. కాని యతని యాకలి యధికముగనే యుండెను. ఇది ప్రక్కవారికి విస్మయము గొల్పినది. అంత సత్యమెరిగి యొక దాయనతో "సీ సాకులు చట్టుబండలైనట్లే యున్నది. నాలుగు బేకులు బేకమ"న్నా డట. ఇందలి హాస్యముగూడ సంఘటనలోనే యున్నదికాని, కల్పనలో లేదు. సమానమైన రెండు పదములలో నొకదాని కింకొకటి తారుమారు చేసికొనుటచే నిందలి హాస్యము జనించినది. ఇంకొకటి, ఒకమా రొక యాంధ్రు డొక సత్రమునకేగి తన గొడుగు నొకమూలగ పెట్టి పనిచూచుకొనుటకు లోనికిపోయినాడు. తర్వాత నా మూలనే యొక తమిళుడు నిద్రించుటకై పరుండి నిద్రపోయెను. కొంత కాలమున కా యాంధ్రుడు తనపని నెరవేర్చు కొని మూలనున్న గొడుగును తీసుకొనుచుండగా దాని కమ్మి యా తమిళుని చెవికమ్మలో నిరికికొనుటచే లాగుచుండెను. ఆంధ్రుడు లాగుచుండెను. తమిళుడు నొప్పితో 'కాదురా' అని యరచు చుండెను. అందుల కాంధ్రుడు గొడుగు నాతఁ డపహరింపఁగోరి తనది కాదనుచున్నాడనియెంచి, 'నాదిరా' అని గద్దించుచుండెను. ఈ విధముగా తమిళుడు 'కా'దనియు నాంధ్రుడు 'నా'దనియు వివాదపడుచుండిరి. తమిళుడు 'కాదను' పదములో 'కాదు' శబ్దము నకు చెవియను నర్థము. కాని యాంధ్రుడు, గొడుగు తనదికాదని తమిళు డంటున్నాడని యర్థము చేసికొని వివాదపడెను. ఇది ప్రక్క వారికి హాస్యజనక మాయెను. తమిళమున చెవికి 'కాతు' అని శబ్దమైనను జనసామాన్యము 'కాదు' అని యుచ్చరింతురు. ఒక్కటే పదము భిన్నభాషలలో భిన్నార్థము గల్గియుండుటచే నీ హాస్యమునకు కారణమైనది. ఒకమా రొక పెద్దమనిషి యొక విషయమును వ్రాసి యొక typist కిచ్చి దానిని టైపు చేయవలసినదిగా కోరి, (spelling) వర్ణక్రమములో సందేహము వచ్చినచోట నిఘంటువు (dictionary) ను చూడుమని సలహాయిచ్చి వెళ్ళిపోయి, కొంతకాలము తర్వాత తిరిగి వచ్చినాడు. అప్పటికా టైపిస్టు దాని నంతయు టైపుచేసి సిద్ధముచేసి యా పెద్దమనిషి కిచ్చివేసినాడు. కాని దానినిండ spelling తప్పులే యుండుటచే నా పెద్దమనిషి చూచి, యా టైపిస్టుతో 'సందేహము వచ్చినచోట నిఘంటువును చూడుమని చెప్పితినికదా, యిట్లేల తప్పులతో టైపు చేసితి'వని యనెను. అందుల కా టైపిస్టు "అవును, సందేహము గల్గినప్పుడుకదా నిఘంటువును చూడుమనిరి మీరు. నాకు సందేహమే కలుగలేదు. అందుచే నిఘంటువును చూడవలసిన యవసరమే కలుగలే" దని, సమాధాన మిచ్చినాడట. అందుల కా పెద్దమనిషి లోలోన నవ్వు కొనినాడు. ఇందలి హాస్యముగూడ సంఘటనలో స్వతస్సిద్ధముగా నున్నదేకాని ప్రయత్నపూర్వకముగ కల్పింపఁబడినదికాదు. టైపిస్టు అమాయికముగనే పలికినాఁడు.

ఇక, మూలవిషయములో హాస్యము బీజప్రాయముగానుండి, బహిర్గతముకాక యున్నదానిని, కవి తనకల్పనాశక్తితో నెట్లు హాస్యపంతముగా చేయునో చూతము. శివుఁ డర్ధనారీశ్వరుడు. పార్వతీపరమేశ్వరుల కుమారుఁడు విఘ్నేశ్వరుఁడు. అతఁడు గజాననుఁడుకదా. శివునకు సర్పహారములు గలవు. ఈ వికృతు లన్నియు నొక్కచోఁజేర్చి కొంచెము హాస్యముతో వినాయక స్తుతికిఁ బూనికొని యిట్లు వర్ణించినాఁడు భ్రాంతిమదలంకారముతో నల్లసాని పెద్దనామాత్యుడు.

ఉ॥ అంకముచేరి శైల తన యాస్తన దుగ్ధములానువేళ బా
ల్యాంక విచేష్టఁదొండమున నవ్వలిచన్ గబళింపఁబోయి యా
వంకఁ గుచంబుగాన కహివల్లభ హారముఁగాంచి, వే మృణా
ళాంకుర శంకనంటెడు గజాస్యునిఁగొల్తు నభీష్టసిద్ధికిన్॥

ఇందు గజాననుని బాల్యాంకవిచేష్ట వర్ణింపఁబోయి, తనకు ప్రియమైన మృణాళాంకుర శంకతో శివుని యహివల్లభహారము నంటినాఁడట. ఇందు కవి మూలవిషయములలోఁగల వికృతి నుపయోగించుకొని, వానినన్నింటి నొకచోటఁగూర్చుకొని, సహజ చమత్కారములతో హాస్యరసప్రతిపాదక సన్నివేశము నొకదానిని చిత్రించి చూపినాఁడు. ఇందలి సంఘటనలకు పాఠకులు మంద హాసముచేయక యుండఁజాలరు.

విష్ణువు పాల్కడలిలో శేషశయనముపైఁ బవ్వళించుట పురాణ

ప్రసిద్ధము. ఇందు వికృతి యేమియు సామాన్యముగ గోచరింపదు. కాని కొన్ని కారణములారోపించి ప్రకృతిని వికృతిగా మార్చి వ్యాఖ్యానించి హాస్యరసమును పుట్టింపవచ్చును. చూడు డొకకవి శేఖరుఁడు శేషునిపైఁ బవళించుట నిట్లుత్ప్రేక్షించినాఁడు.

క॥ శివుఁడద్రిని శయనించుట, రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపైఁ, బవళించుట నల్లిబాధ పడలేకసుమీ॥.

నల్లిబాధ పడలేకయే పై వారందఱట్లు చేసిరట. ఈ యుత్ప్రేక్ష కొఱ చిఱునవ్వును మనము చూపక యుండలేము. ఇంతటితో విష్ణుని శేష శయనమును వదలఁ దలచుకొనలేదు. మరియొక కవి యక్కడఁగూడ విష్ణునకు నిదురపట్టనీయఁ దలఁచుకొనలేదు. మఱియొక కారణమును గల్పించి యాయన శేషశయనమును పరిహసించినాఁడా కవి. నిరంకుశోపాఖ్యాన కర్తయగు రుద్రకవి, యిట్లు వర్ణించినాఁడు.

చ॥ కలశపయోధిమీఁదఁ దరఁగల్ మఱి హోరని మ్రోయ, వేయి ఫం
గుల తలపాన్పు పాము బుసకొట్టఁగ నేగతి నిద్ర చెందెదో
యలసతఁ దండ్రి, చీమ చిటుకన్నను నిద్దురరాదు మాకు నో
జలదదరీ దరీ కుహర భాస్వదరీ యుదరీ దరీ హరీ॥ (శతకము)

మొదటి పద్యమున విష్ణుని శేష శాయిత్వము నభినందింపఁ బడితే నల్లిబాధ పరిహారకార్థము. రెండవ పద్యమున మఱియొక బాధను కవి కల్పించి పరిహాసము చేసినాడు. ఇంతటితో వదలక వేమనయోగి విష్ణుని పాల్కడలి శయనము నిట్లు వేళాకోళము చేసినాడు.

గీ॥ పాలసాగరమునఁ బవ్వళించినవాఁడు
గొల్లయిండ్ల పాలు గోరనేల,
ఎదుటివారి సొమ్ము లెల్లవారిక తీపు
విశ్వదాభిరామ వినుర వేమ॥

చూచినారా విష్ణువు నెట్లు తాళము పట్టించినారో కవులాతని క్షీరసాగర శయనత్వమును. ఇది హాస్యరస కల్పనా సృష్టి. కార్య కారణ కల్పనలో నెట్లు హాస్యరస ప్రదిపాదన మగునో దీనివలన విశదమగు చున్నది. ఒకటే విషయ మొకరి కొక విధముగా ద్యోతకముకాగా, నింకొకరికి మఱియొక విధముగా గోచరించును.

ఒక వస్తువును మఱియొక విషయముతోఁ జమత్కారముగాఁ బోల్చి హాస్యరసమును గలిగింప వచ్చును. తిరుపతి వెంకటేశ్వర కవులు దమ శ్రవణానందములో నశ్య వేశ్యలకు సాదృశ్య మిట్లు చెప్పి హాస్యమును గల్పించిరి. శ్రవణానంద కావ్యమున వేశ్య నాయిక కదా.

గీ॥ నిదురఁ బోఁగొట్టుఁ గ్రమముగా నెత్తికెక్కుఁ,
గలుషత ఘటించుఁ గుండయుఁ గుల్లయుఁదన
చేతికొనఁ గూర్చునదిగానఁ జెప్పనగునె,
వేశ్యకును నశ్యమునకు భేద మిలను॥

ఇందలి కల్పన యూహా కల్పితములైన కారణములపై నాధారపడి యున్నది. స్థూలదృష్టికి వేశ్యకు నశ్యమునకుఁ బోలిక లేకపోయినను ఫలము సమానమగుటచే సాదృశ్యము కవి భావనా శక్తి మూలకమునఁ గూర్పబడి హాస్యజనకమైనది. మఱియొక చోట నా కవులే లోభగుణమును రూపకల్పనచేసి గీరతమున నిట్లు వర్ణించి హాస్యము నుత్పాదించిరి యతిశయోక్త్య లంకారముతో.

మ॥ ఒక యేగానికిఁ జిన్న కుఱ్ఱనికి నాయుష్కర్మ చేయించి దా
నికినై కాని యొసంగిఁ తక్క సగమున్ దెమ్మన్న 'నా చేత లే
దక టా' నాఁగను క్షౌరపుంగృతికిఁ దా నంగీకృతిం జొన్పు లో
భ్యకులా యమ్మగు ముద్దరాలి చరితం బాలించితే తిర్పతీ॥

ఈ హాస్యకల్పన యతిశయోక్తితోఁ గూడినది. దీనిలోనైనఁ గొంతకాకపోయిన కొంత హాస్యము మూలమున కారోపింప వచ్చును. కాని మూలముననే మాత్రము హాస్యమున కవకాశము లేనిచోటఁగూడ భ్రాంతిమదలంకార కల్పనముతో శ్రీకృష్ణదేవ రాయలు దన యాముక్తమాల్యదలో నెట్లువర్ణించినాడో గనుడు.

మ॥ తల పక్షచ్ఛట గ్రుక్కి బాతువులు కేదారంపు గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుషస్నాత ప్రయాత ద్విజా
వళి పిండీకృత శాటులన్ సవి దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గన్ వెసబాఱ వానిగని నవ్వున్ శాలిగోప్యోఘముల్॥

చెఱువుటొడ్డున తెల్లని బాతు లొడలుముడుచుకొని నిద్రించు చుండఁగా వాని నుదికిన బట్టలుగా భ్రాంతి చెంది యారెకులు వానిని గ్రహించుటకై రేవులో దిగగా నా బాతువులు పాఱిపోవు టను జూచి సమీపమున పొలముగాంచు స్త్రీలు నవ్విరట. ఇట్టి విచిత్రమైన భావనాపూర్వక కల్పనయందు హాస్యరస ముదయించి నది. ఇటువంటి కల్పనచేయుటకు కవి గొప్ప ప్రతిభావంతుడు గావలయును. ఇవి యన్నియు నర్థగత కల్పనలు. ఇఁక శబ్దగత మైన కల్పనచేఁగూడ చక్కని చిక్కని హాస్యమును బ్రతిపాదింప వచ్చును. ఇది ఉక్తి చమత్కారముతోఁ గూడినది. ఈ పాటను దిలకింపుడు.

(1) దానంలోకి ఏ దాన మెక్కువా బ్రహ్మంగారూ,

దానంలోకి నిదాన మెక్కువా బ్రహ్మంగారూ.

(2) కారంలోకీ ఏ కార మెక్కువా బ్రహ్మంగారూ,
కారంలోకీ ఉపకార మెక్కువా బ్రహ్మంగారూ.

ఈ పాటలో నాన - నిదానములు, కార - ఉపకారములను శబ్దము లుపపదముల కూర్పుతో చమత్కారముగ నర్థభేదము గల్పింపఁ బడి చిరునవ్వును గల్గించును.

శబ్దగత కల్పనగల హాస్యమొకప్పుడు శ్లేషరూపము దాల్చును. గుంటూరు క్రైస్తవ కళాశాలలో సంస్కృత పండితులుగా నుండెడు శిష్టా సీతారామశాస్త్రిగారు గొప్ప చమత్కారముగా మాట్లాడెడివారు. ఆయన యాజానుబాహువు, స్ఫురద్రూపియు. బిళ్లగోచిపెట్టి ధోవతి గట్టుకొనెడివాఁడు. అందుచే చాల పొడవు గల ధోవతులను వాడెడివారు. వారొకమారట్లు ధోవతి కట్టుకొని రాఁగా నొకరు చమత్కారముగా 'మీరు కట్టుకొనుట కెన్ని మూళ్లు గావలె' నని పృచ్ఛించిరట. అంత వెంటనే యాయన, "ఎంత నాయనా, మూఁడు మూళ్లు" అనిరట. అందులకు ప్రశ్నించిన యాయన చకితుడై నాఁడు. ప్రక్కనున్న వారి శిష్యులలో అక్కిరాజు ఉమాకాంతంగారు మొదలైనవారు శాస్త్రిగారి శ్లేషను గుర్తించి మంచిహాసము చేసిరి. ఇందు మూఁడు మూళ్లు తొమ్మిది మూరల పొడవని వివరణార్థము. స్థూలదృష్టికి మూఁడుమూళ్లే పొడవని చమత్కారము.

భావగర్భితముగ పల్కు హాస్యమును రేకెత్తించుటను కీచకవధ ఘట్టమున తిక్కన చక్కగ ప్రదర్శించినాడు. కాముకుడగు కీచకుని రహస్యముగ చంపనెంచిన భీముడు ద్రౌపది యనుమిషతో నర్తనశాల కంధకారమున వచ్చి, యతనిని గలిసికొని యిట్లు పలుకును.

గీ॥ ఇట్టివాఁడవు గావున నీవు నన్ను
బొగడుకొనఁదగు నకటా నా పోల్కియాడు
దాని వెదకియు నెయ్యెడనైన నీకుఁ
బడయ వచ్చునె యెఱుగక పలికితిట్లు ॥

క॥ నా యొడలు సేర్చినప్పుడె
నీ యొడ లెట్లగునొ దాని నీ వెఱిగెదు వ
న్నే యబలల తోడిదిగాఁ
జేయఁ దలఁచితివి తప్పు సేసితి గంటే ॥

నను ముట్టి నీవు వెండియు
వనితల సంగతికిఁ బోవు వాఁడవె యైనం
దునవేఁ బడసిన ఫలమే
కనియెద విదె చిత్తభవ వికారము లెల్లన్ ॥

ఈమాటలందలి భావము కాముకుడైన కీచకున కొకవిధముగాఁ దోఁచినను భీమునికిఁ గల్గిన క్రోధమిందు వ్యక్తీకరింపఁబడుటయే కాక, యందలి భావగర్భితమైన యర్థము ప్రక్కనున్న ద్రౌపదికి నవ్వుపుట్టింపకపోదు...ప్రక్క మనమున్నను సందర్భము తెలియునుకాన చిరునవ్వు పొందకుండ జాలము. ఇది నర్మగర్భితమైన పరిహాసము భీముడు కీచకునితోఁ జేసినది.

శబ్దకల్పన కర్థకల్పనను జోడించి శ్రీనాథుఁడొక చాటువున నిట్లుపరిహాసము చేసినాఁడొక యరవపిల్లను. 'కంచి యరవ తలసమూహ్య ఖడ్గలతలు' అని వర్ణించియు.

గీ॥ మేఁతఁగరిపిల్ల పోరున మేకపిల్ల
పాఱుపోతుతనమునఁ బందిపిల్ల
యెల్లపనులను జెఱుపంగఁ బిల్లిపిల్ల
యందమునఁ గోతిపిల్ల యీయరవపిల్ల॥

అని యపహాస్యము చేయుట నీతని హాస్యరస ప్రియత్వము చాటును. ఇంకొకచోట నీతని పరిహాసము భోజన సమయమునఁ జేయఁబడినది.

ఉ॥ 'రామయమంత్రి భోజన పరాక్రమమేమని చెప్పవచ్చు, నా
స్వామి యెఱుంగుఁ దక్కఁబళ చాతురి తాళఫల ప్రమాణముల్॥

ఇదికూడ నతిశయోక్తితోఁ జెప్పఁబడినదే. ఇంకొకచోట నుపమానముతో

ఉ॥ మాకలిదిండి కామయ కుమారకుఁడన్నిట తండ్రిపోలికే
కాక తదన్యుఁడెట్లగును గాడిదకుం తురగంబు పుట్టునే॥

అని వ్యాజస్తుతి పూర్వకముగా పరిహాసము చేయఁబడినది. అర్థ చమత్కార కల్పనచే శోభించినట్లుగా హాస్యరసము కేవలము శబ్ద కల్పనచేఁగూర్పఁ బడినపుడు విశేషము రక్తికట్టదు. చూడుడిందు సదృశ శబ్దములకూర్పు తప్ప మఱియేమియులేదు. ఇది పామరులకు మాత్రము తాత్కాలికముగ కొంచెము నవ్వుపుట్టింప వచ్చును. అంతమాత్రమే.

ఉ॥ నీళ్ళకు, నిజ్జితోళ్ళకును, నేతికరళ్ళకు, దొడ్డయుత్తరేణ
వ్రేళ్ళకు, దర్భముళ్ళకును, వేదపునోళ్ళకు, సన్నకుట్టు వి
స్తళ్ళకు, రావిపేళ్ల కనిళంబును మళ్ళకు, పప్పుకూర వ
చ్చళ్ళకు, రాగిబిళ్ళలకు సంతస మందుదు రాంధ్రవైష్ణవుల్॥(చాటువు)

ఇది తేలికరకమగు హాస్యము. అతిపేలవముగా నుండును. భావ కల్పనలేని శబ్దముల కూర్పులోఁగల హాస్యమంతయు నిక్షేప యుండును. ఇది చప్పిడిమెతుకు. అతిశయోక్తి, యుత్ప్రేక్ష, భ్రాంతిమంతము, వ్యాజస్తుతి మొదలైనవాని సహాయమునఁ గూర్పఁబడిన హాస్యము ముందర నిట్టి శబ్దకల్పనాపూర్వక హాస్యము చంద్రునిముందు నక్షత్రములవలె నుండును. కాన పామరులు దీనిని గణించినను విద్యావంతులు దీనిని గౌరవింపరు. విశేష భావకల్పన లేకపోయినను కొంచెము యుక్తి నైపుణ్యముగల కూర్పులో హాస్యరసపోషణము జరుగును. చూడుడు వేమన పద్యమగు క్రిందిదానిని

గీ॥ సకల తీర్థములను సకల యజ్ఞంబుల,
తలలు గొరుగకున్న ఫలములేదు,
మంత్రజలముకన్న మంగలిజలమెచ్చు,
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఇం దలంకారాదులేమియు లేకపోయినను యుక్తికల్పనచే హాస్యము జనించి శబ్దకల్పనా పూర్వక హాస్యము కంటె నెక్కువగ శోభించి రక్తికట్టినది. కాన చమత్కారార్థ రహితమై కేవలము శబ్దములచేఁ గూర్పఁబడిన హాస్యము రసవంతముగాదు. ఇట్టిదే వేమనగారి మఱి యొక పద్యమందలి హాస్యము తపము చేయఁగోరు ముముక్షువును గూర్చి చెప్పినది.

గీ. గుహలలోనఁజొచ్చి గురువుల వెదుకంగఁ,
గ్రూరమృగమొకండు తారసిలిన
ముక్తిమార్గమదియె ముందుగాఁ జూపురా,
విశ్వదాభిరామ వినుర వేమ.

విషయమును సందర్భమును మలుచుకొని సన్నివేశమును గల్పించు కొనుటలోనే యిట్టి హాస్యము పుట్టును. ఇదియొక విధమైన హాస్య కల్పన.

మఱియొకవిధమైన హాస్యకల్పన పుష్పలావికావర్ణనమందు గానుపించును. ఇం దభిప్రాయగర్భితమైన మాటలతోడను, శ్లేషల తోడను సంభాషణముసాగి చమత్కారకల్పనతో హాస్యరసము ప్రతిపాదింపఁబడును. విజయవిలాసము నందలిది.

ఉ. ప్రాయపు గాయకుల్ వెలనె పాన నెగాదిగఁజూడ నేర్పుతో
రాయివి దండమీఁదఁ గొసరం దొరఁకొంటిరి మంచిసాములే
పోయిటులైనచో సరసముల్గద మీ కిపుడంచు నవ్వరిం
గాయజ తూపులమ్ముదురు కందువ మాటలఁ బుష్పలావికల్.... I. 14.

ఇందు 'దండ, సాము'ల శబ్దములమీఁద శ్లేషింపఁబడినది. దండ యనగా పూదండయనియు, బాహుదండలేక భుజదండయనియు యర్థద్వయము సాములనగా స్వామి శబ్ద వికృతియు, సాముగరి డీలు చేసినారనియు నర్థము. కొసరుటయన యధికముగా కోరుట. యనిభావము. పుష్పలావికా వర్ణనములను ప్రత్యేకముగా వెల్లండ ప్రభాకరామాత్యులవారు దమ 'ఆముక్తమాల్యద పర్యాలోకన' మను విమర్శగ్రంథమున 60, 61 పుటలలో నాముక్తమాల్యదా వసుచరిత్ర కావ్యములనుండి చక్కఁగ నేర్చి కూర్చినారు. ఆముక్త మాల్యదలో పుష్పలావికావర్ణనము విపులముగ మూఁడు పద్యము లలో నిట్లు సేయఁబడినది.

సీ. వెలఁది, యీ సీ దండ వెలయెంత ? నా దండ,
కును వెలబెట్ట నెవ్వని తరంబు,
కలువతావులు గాన మలికదంబకవేణి,
కలుపతావులు వాడకయ కలుగునె,
కడివోదు నా కిమ్ము పడతి, యీ కేదంగి,
ననకడివోమి ముందటికిఁ జూడు,
జాతులే వంబుజేక్షణ, వద్మినులు నైత,
మును నున్నయెడ జాతు లునికి యరుదె.

గీ. యనుచు దొలినుడి నభిలాష లెనయమూగి,
పలుకుతోడనె నర్మ గర్భంబుగాఁగ,
నుత్తరము పల్లవశ్రేణి కొసఁగు చలరు,
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున.

చ. సరసుల నర్మమింపుల నొసంగఁ గదంబపు దండగట్టుచో
గరగుటఁదెల్పు దృక్తరళ కాంతులు నుత్తరమిచ్చు నంతరాం
తరముల నవ్వులజా గలువ తండము మొల్లలునించు మిన్నుగ్రు
చ్చి రహిని రిత్తనూలొనఁగి సిగ్గువహింతురు పుష్పలావికల్.

సీ॥ పద్మాస్య, పురినను భవితకు సీవ యె
త్తులు పెట్టెదనఁగ రావలిసె నిటకుఁ
దెలుపుమా, జాముండు నలరిం బోఫటికా ద్వ
యమ్ముండు నలరింపొ కంబుకంఠి

యేవేడుటకు నీవు ఋతువేలచెప్పె ద
పువిద, మేమందాక నోర్వఁగలమె
చేరఁగారాదె బాసికము గేల్సోకిన
యంతనె చెడునె యేణాయతాక్షి॥

గీ॥ యనుచుఁ బరిభాషవోలెదమ్మాన దొరల
నాడమోవి చెఱంగిడి యాగునవ్వు
కంటనిగుడ విరుల్మ్రాన్పు కరణిజల్లు
సరసపు జలంబె జాణల సుదులుగొలుపు॥

ఇందలి ప్రశ్నోత్తర పూర్వకమైన సంభాషణమందలి చమత్కార మెంతయు హృద్యమై పరిహాస పూర్వకమైన హాస్యరసమును పోషించుచున్నది. వసుచరిత్రలో పుష్పలావికావర్ణ మిట్లుసేయఁ బడినది.

సీ॥ పొన్నపూ వాడినేలఁ బొదివితే చెలి! యది
పొడమె బల్దివిపైఁ బొదువ వలదె?
చెలువ! మాటితివేల కలువ చాలదియుగ
గప్పగరాదె మిన్నుల బావికడది
మొగడ తమ్ముల నేల మూసితే సతి! మూయ,
దగదెమానస భూనిధానములవి,
తరుణి! పూరెమ్మ యెత్తవదేల యదిహేమ
శిఖరిదాపుది బయల్ సేయఁదగునె॥

గీ॥ యనుచు రసమర్మసరసోక్తు లాడునట్టి
జట్టికాండ్ర యథోచిత సరసవచన
రచనదేల్చుచు వివిధ విభ్రమమువరల
విరులు విలుతురు పుష్పలావికలు వీట॥

ఇందతిశ యోక్త్యలం కారముచే చమత్కరింపఁబడి హాస్యరసము ప్రతిపాదింపఁ బడినది. ఇఁక కంకంటి పాపరాజు తన యుత్తర రామాయణమున నెట్లు పుష్పలావికా వర్ణనమున హాస్యరసమును ప్రతిపాదించినాఁడో చూతము.

సీ॥ పొగడవిరుల్ లేవె మృగరాల మధ్యమ
విటరాజ చెంగల్వ విరులుగావె
జాతులేమైనను సంతరించితె కొమ్మ
నేర్చుకోవలసిన నీటుకాఁడ
వగలాడి! యిచట సువర్ణముల్ గలుగునే
కలయిండ్లఁ గలుగును జెలువరాయ
తమ్ములఁజూపవే తరుణీశిరోమణి!
యాఁడగాఁజనిరి రేపాడిరమ్మ॥

గీ॥ వలయు పున్నాగతతు లేవె వన్నెలాడి
యేలయడిగెద వీయూర నేమి కొదవ
యని విటుల జాణ తనమున నపహసించి
పువ్వులమ్ముదు రచ్చటఁ బువ్వుఁ బోండ్లు.

ఇందు చమత్కార సంభాణము రసవంతముగా నున్నది. రసిక జన మనోభిరామమునను, యయాతి చరిత్రమునను పుష్పలావికా వర్ణనములు గలవు. కాని యవి సంభాషణలోలేవు. అందేమియు చమత్కారమే లేదు. హాస్యరస మంతకంటె లేనేలేదు. కాన చమత్కార సంభాషణతోఁ బుష్పలావికా వర్ణనము చేయఁగల్గుట సులభసాధ్యమైన సర్వ సామాన్య విషయముగాదు. అది చేతకాని వారు సాధారణముగ చేసిరి. మఱి కొందఱు దానిని పూర్తిగ వదలివేసిరి.

రసాంతర పోషణమూలమున హాస్యరసమును ప్రతి పాదించుట యింకొక విధము. హాస్యరసమునకు శృంగార రసముతో మైత్రియు, నితర రసములతో వైరము నియునాలంకారికుల మతము. కాని యద్భుత భయానక రసములు పోషింపఁ బడినచోట్ల హాస్య రసమునకుఁగూడఁ దావు గలుగుచున్నది. ఋష్యశృంగుని చరిత్రలో వేశ్య లతనిఁ గాంచినపుడు వారి పరస్పర చేష్టా సంభాషణములలో నద్భుత రస ముభయులకు గల్గించును. దానితోఁబాటు హాస్యరసముగూడ పుట్టినది. అట్లే యుద్ధమధ్యమున పారిపోవు పిరికిపందలగు కొందఱు యోధులకు భయానక రసము గలుగగా, దానిని తిలకించు ప్రక్కవారికి హాస్యరసము గల్గించును. ఇట్లు భయరసముల కొకమారే యవకాశము గల్గుట "పిల్లికి చెలగాట యెలుకకు ప్రాణసంకట" మనునట్లుండును. ఉత్తర గోగ్రహణ సందర్భమున నుత్తరుఁడు కౌరవసైన్యమును గాంచి భీతిచెంది పాఱిపోవు సన్నివేశమున భయానక హాస్యరసములు రెండును ప్రతిపాదింపఁబడును. విరాట పర్వమున తిక్కన రచనయిది.

క. కని యుత్తరుండు గరుపారిన మేనును దల
కు మనము ఱిచ్చవడిన చూ
పునునై తొట్రుపడుచు ని
ట్లనియె దిగులుసొచ్చి యా బృహన్నలతోడన్.

*　　　*　　　*

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా
ర్ముక విద్యాప్రౌఢిమై నిరూఢులయిన యీ
శకుని జయద్రథ దుర్ముఖ
వికర్ణకర్ణాది యోధవీరుల కెదురే.

క. ఇట్టగు చెఱుఁగక వచ్చితి
మెట్టొకో మనభంగి వీరలిందఱును గడున్

బెట్టిదులు మనకు మార్కొను
నట్టి కొలఁదిగాదు భీతియడరెడుఁ దోడ్తోన్.

ఉ. కౌరవసేనఁ జూచి పడకంపొడఁగెన్ మదిలోన స్రుక్కెను, సీ
పూరకపోవుచున్కి యిది యొప్పునె యిప్పటి భంగిఁ జూచినన్
వీరల నేను మార్కొనమి నిశ్చయ, మిట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణములు దీపసమున్ వినవే బృహన్నలా.

వ. అనిన దరహసిత వదనుం డగుచు శతమఖ తనయుం డతని కిట్లనియె.

*  *  *

ఉ. అంతిపురంబులోనఁగల యంగన లెల్లను నెమ్మనంబులన్
సంతసమందఁగా బసులఁ బయ్యనఁ దెచ్చెద నంచుఁ బూని నీ
వెంతయు మేటివై యరద మెక్కి రయంబున వచ్చి యిచ్చటన్
దంతితురంగ సద్భట కదంబముఁ జూచి కలంగు టొప్పునే.

ఆ. అనిన పలుకులకు బృహన్నలఁ గనుగొని
యెలుఁగుపడఁక నాతఁ డిట్టులనియె
బసుల దయ్య మెఱుఁగుఁ బడఁతుల సంతోష
మేలనాకు ననికిఁ జాలనేను.

*  *  *

వ. ...ఆననంబు వెల్లటిల్ల, మానసంబు తల్లడిల్ల నా భూవల్లభ కుమారుఁడు.

క. దవ్వుల విలిగినఁ బౌరులు
నవ్వుదురంటె మేలుమేలు నాగకురా నీ
క్రొవ్వరుగ దేనిఁ దలపడు
మెవ్విధిఁ జనితేని యనుచు నెత్తిన భీతిన్.

క. శరములు శరాసనము శ
య్యా రథముపై డిగ్గవిడిచి యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం
బురి దెసకును బజ్జవీడిఁ బోవం బాఱెన్.

*  *  *

సీ॥ వెలవెలబారుచు వెగడొందుఁ బెదవుల
తడియాడునెంతయు తల్లడిల్లు
జల్లననంగంబు లెల్లనిండఁ జెమర్చుఁ
బదములుఁ గరములుఁ గుదియఁబడకు
హృదయంబు దటతట నదరంగఁ బెలుకురు
దీనదృష్టుల మోముఁ దేటిచూచు,
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్పువిడుమని
ప్రార్థించుమాటఁ గీడ్పాటు దోఁప

తే. నిష్కళిత శుద్ధహేమంబు నిర్మలోద్య
లాప్త వైదూర్యములుఁ దురగాఢ్యుఁ బథముఁ
గరటి దళతింబు నొకయూరుఁ బురమునొచ్చి
నపుడ యిచ్చెద నీ కనునార్తుఁ డగుచు.

క. నారోడి ప్రేముడింగిడు
నాతురయై యెదుడు చూచును బసఁజేతః
ప్రీతిగఁబని యాయుమఁనొడ
సూతుంబోసిఁగదే విశుద్ధ చరిత్రా.

వ. అని మరియు నానావిధ దీనాలాపంబులం బ్రార్థించు చుండం బార్థుండు నగుచు నతనిం దేరు సేరందెచ్చె.''

తిక్కనగారిందు భయానకరసమును ప్రతిపాదించుటలోనె శ్రద్ధ వహించిరికాని హాస్యరసమును పోషించుటలో నెక్కువ జాగ్రత్త వహింపలేదు. యథార్థముగను దాంభికములు చెప్పుకొని రాజకుమారుడు యుద్ధభూమిని జూచుటతోడనే పిరికిపందయై పారిపోవుట హాస్యాస్పదముగా నుండక మానదు. అందుచేతనే 'ఉత్తరకుమార ప్రజ్ఞల'ని లోకోక్తియైపోయినది. ఉన్న వర్ణనను బట్టియైనను భయానకరసముతోఁబాటు హాస్యరసమును, తర్వాత కరుణయుగూడ ప్రతిపాదింపబడియే యున్నవి. సామాన్యముగ పురాణకవు లేరసమునైనను విశేషముగా వర్ణింపక క్లుప్తముగ వర్ణించి తమ గంభీరస్వభావమును ప్రకటించెడువారు. ఇందుచేతనే తిక్కనరచన యట్లున్నది. క్షత్రియవంశజుఁడై, రాజకుమారుడై, స్త్రీల సమక్షమున గర్వములాడి, యుద్ధము సేయకయే శత్రుయోధులను జూచినవెంటనే రణభూమి వదలి పారిపోవుటయు, నర్జునకు లంచమిచ్చెదనని బ్రతిమాలుటయు, శరీరమునిండ ముచ్చెమటలు కప్పుటయు మొదలైనవి చూచినపుడు తప్పక ప్రక్కనున్నవారికి హాస్యము జనింపక మానదు. అంతవరకు తిక్కన సముచితముగ వర్ణించి హాస్యరసప్రతిపాదన గావించినాఁడనియే చెప్పవచ్చును. కాని కవి యుత్తరుని వేళాకోళము చేసి యల్లరిపాలు గావింపఁదలఁచుకొనలేదు. అట్లే చేయదలఁచుకొనినచో నన్నెచోడుడు తన కుమారసంభవమున దక్షప్రజాపతి యజ్ఞధ్వంస సమయమున దిక్పాలురు భయపడి పారిపోయిన రీతి వర్ణించి గేలి చేసెడివాఁడె. కాన నిందలి హాస్యరసపోషణము గంభీరముగా నున్నదని చెప్పవలయును. ఇది పాత్ర విశేషముచేతనే జరిగినది. కాని సంఘటన వలనగాని, కల్పనవలనగాని జరుగలేదు.

ఇటువంటి సన్నివేశమునే శ్రీనాథకృతి యని తలంపఁబడు పల్నాటి వీరచరిత్ర భాగములో బాలచంద్రుని యుద్ధములో

నున్నది. బాలచంద్రుని యుద్ధమునకు తాళలేక నాగమ్మపక్షపు సైనికు లోడిపోయి, భయమెత్తి పారిపోయియు, దాగుకొనియు, పిరికిపందలై దమ దీనదశను, నాగమ్మ తమ్ము ప్రేరేపించుటయును దలచుకొని విలపింతురు. ఈ సందర్భ మెంతయు హాస్యజనకముగా నున్నది. కనుడు

"బాలునిఁ గనుగొని భయమంది బెగడి
పాఱిపోయెడు పందభటసమూహంబు
పాఱిపోఁగలేక బ్రదుకుపై నాశ
బ్రతిమాలుచుండెడు బహువిధంబు
లిటువంటి జగడంబు లెన్నడెఱుంగ
మేలాగుపోదు మన్నేడ్చెడి వారు
ఆలుబిడ్డలఁ బాసి యన్నంబు కొఱకు
వచ్చితిమీ నేల వ్రాసెను మృత్యు
వని దుఃఖమొందుచు నసురుసురంచు
వేగమె ప్రాణముల్ విడిచెడువారు
బహుదినంబులు మేము పాలేరుచేసి
మునికొల్ల లెల్లను ముంజార్లుదోసి
పడతులు దిట్టిన పడలేక వచ్చి
చచ్చుచు నుంటిమీ సమరరంగమున
పాఱిపోనిచ్చిన బ్రదుకుదుమయ్య
అని మ్రొక్కుచుండెడు నతిదీన భటులు
బోయవారము మేము పూర్వంబునందు
భుజముల కాయలుపూని కన్గొనుడి
పగవారు మముగని పాఱిపోవుదురు
మీకేమి భయమని మెలత నాగమ్మ
బాగుగా నమ్మించి పంపవచ్చితిమి
జీవముల్ దక్కిన చిన్నలఁ గలసి
బలుసాకు దినినైన బ్రతుక గలము
మీరు పిల్చినవేళ మేమటుదెంతు
మని యంజలి యొనర్చి యవమానమొంది
మగసిరి విడిచిన మానహీనులును
వీలుచిక్కిన రణవీరుల వదలి
పోయెడు నట్టి దుర్బుద్ధి యుక్తులును
చచ్చిన విధమున సమరోర్వియందు
పలుకక యూరక వ్రాలెడువారు
చనలేక భయమున చచ్చినవారి
మీఁద ద్రోసుక యుండి మెదలనివారు
చచ్చిన గజముల చాటునా డాగి
పందతనంబున పడియుండువారు
పెండ్లాలదలచుక బిట్టేడ్చువారు
వల్మీకములమీఁద వసియించువారు
గడ్డిలోఁ జొరఁబడి కదలనివారు
వ్రేళ్ల చీకెడువారు వెన్నిచ్చువారు
వెండ్రుకల్ విప్పుక విదలించువారు
నీవారమని పల్కి నిల్చుండువారు
ఆయుధాల్ వడవైచి యలికెడువారు
పడలేక చతికిలబడి యుండువారు
పవరంబులోఁగూలి ప్రాణజాలంబు
విడిచియు ఖడ్గముల్ విడువనివారు
భయదమై యిబ్బంగి పరికింపరాక
సమర రంగము భయ జనకమై యుండె."

ఇందు పిరికిపందల విలాపములోను చేష్టలలోను చక్కని హాస్యము ప్రతిపాదింపఁబడినది. దీనిలో భయానకముకంటె హాస్యమే యెక్కువ గలదు. ఈ హాస్యములోఁ గొంత కవి కల్పనయు నున్నది. అది యుత్ప్రేక్షాతిశయోక్తులతోఁ గూడినది. ఇది సంఘటనకు సంబంధించిన దైనను కల్పన సహాయముగా గలది. పై తిక్కన రచిత యుత్తరుని సంఘటనలోని హాస్యము విశేషముగ పాత్రకు సంబంధించినది. అందు కవి కల్పన లేదనియే చెప్పవచ్చు. ఇందు వివిధములైన పిరికిపందలు, ధైర్య సాహసములు లేకపోయినను కేవలముదరపోషణకై సైనికవృత్తి నవలంబించిన వారును, భార్యతో పోరాడి వచ్చినవారును, నాగమ్మ ప్రేరణచే వచ్చినవారనియు దెల్పఁబడుటచే, వారి విలాపములలో కరుణము కంటె హాస్యమే యెక్కువ ద్యోతకమగుచున్నది.

ఈ గ్రంథమందే పొలికలనిలో పిశాచగణము చేసిన ప్రలాపములుగూడ నవ్వుగొల్పును. ఆ ఘట్టమిది.

"కలను గాచుకయున్న కాళినిజూచి
మీ దయచేతనే మేము దనియగ
అధిక భోజన మాంస మబ్బెను మాకు
అని మ్రొక్కి తేన్పుచు నౌత్సుక్యమడర
బాలుడు మనపాలి పరమేశ్వరుండు
చేయంగ నాతడిట్లు సిద్ధించె మనకు
అని కొందఱాడిరానందగరిమ
నాయకురాలైన నాగమ్మనుండి
మన కాంక్ష దీరెను మాటలకేమి
అని కొందఱాడిరి హర్షంబుమీద
నిబ్బంగి మెచ్చుచు నింతులు తమరు

చల్లులాడుచు రక్త సాగరమందు
మునుగుచు నీదుచు మూకలుగట్టి
జలకమాడి చెదరి చౌకలింపుచును
కుప్పించి దుముకుచు గొబ్బున మునిగి
దూరాన దేలుచు దూగివచ్చుచును
మదమెక్కి సోలుచు మఱిసుక్కి పడుచు
నెవ్వరురా మీఁద నెక్కినవారు
దిగిరార తులువ మర్దింతెద నిన్ను
అని వెక్కిరించుచు హాస్యమొనర్చి
ఘటకళేబరములు పట్టుకవచ్చి
చచ్చిన గజముల సంధించి నిల్పి
కదనమాడుమటంచు కత్తులఁ బొడిచి
పడియున్న గజములపైనిఁ గూర్చుండి
అంకుశంబులతోడ నదలించువారు
వాజి శవంబుల వడిమీద నెక్కి
చబుకుల గొట్టుచు చనుమనువారు
గజములనాజుల కాలిమానసుల
పట్టుకవచ్చి యూపాథోధి యందు
ఘనమైన సేతువు గట్టుదమంచు
సంతోష మొందెడు శాకినీగణము."

చచ్చిన శవములతో పిశాచములు చేసిన చేష్టలు మిగుల నవ్వు గొల్పుచున్నవి. ఇవి నరుల చింపిరి పనులకే మాత్రము దీసిపోవు. ఇందలి హాస్యము స్వభావోక్తియేమో ననిపించును. ఇట్టి వర్ణన వేణీ సంహార నాటకమునందుగూడ కలదు. ఇది భీభత్స రసముతోఁ గలసిన హాస్యము.

ఇఁక శృంగారముతోఁ గూడిన హాస్యమును పరామర్శింతము. క్షీరసాగర మథనమున బయలుదేరిన యమృతమును పంచిపెట్టుటకు శ్రీ మహావిష్ణువు మోహినీ యవతారమునెత్తి దానవులను వంచించిన ఘట్టమును శ్రీనాథుడు హరవిలాసములో షష్ఠాశ్వాసమున నిట్లు వర్ణించినాడు.

క॥ బృందారక పథమున దిగి
యిందీవరపత్ర నేత్ర యిరువంకల వా
రుం దమక దమక రారా
యిందనఁగా రెండు వేళ్ళ యెడమున విడిసెన్ ॥ VI 101

వ. నిలిచి హావభావవిలాసంబులన దేవాసురులం భ్రమియింపంజేయుచు స్కంధావార మధ్యంబున. 102

సీ॥ పాకశాసనునకుఁ బరిహాస వచనంబు
గాలకేయునకు శృంగార లీల
వైవస్వతునకు భ్రూవల్లరీ నటనంబు
కరటి దానవునకుఁ గలికిచూపు
పాశపాణికిఁ గుచప్రాంతోరు దర్శనం
బంధకాసురునకు నలఁతి నగవు
ధననాయకునకు నుత్కంఠా విశేషంబు
మహిషునకు నర్మమర్మ కలన
గీ॥ గంధవహునకు సిగ్గు జలంధరునకుఁ
గలికితనముఁ బావకునకుఁ గౌను బలికి
వలపు నటియించుచును వార వార తనకుఁ
దానవారికి వారికినైన యట్లు ॥ VI 103

ఈ విధమైన మోహినీ నటన దేవ దానవు లిద్దఱకుఁ గూడ నాశాజనకమై వారితో పరిహాస పూర్వకముగ ప్రవర్తించినది. ఇందు స్త్రీ సంబంధమైన విలాసపూర్వక హాసము ప్రదర్శితమైనది. ఇది యొకవిధమైన శృంగారమయ హాస్యరస పోషణము. వేశ్యా చేష్టల నిది యనుకరించినది. తర్వాత దేవ దానవు లిద్దరునుకూడ

వ. మఱియు విష్ణుమాయా విశేషమున.

క॥ ఇది చెప్పినట్లు చేయుదు
మిది పంచినట్లు నడతు మిది కళ్యాణా
భ్యుదయ విధానము మాకని
హృదయంబులఁ దలచుచుండి రిరుదెసల వారల్ ॥ 107

తే॥ కనకసుహాసనము వెట్టి కాళ్ల గడిగి
పాద తీర్థమ్ము లొఁగిద్రావి ప్రణతిచేసి
కొలిచి కూర్చుండి రిరువంక కొలమువారు
భువన మోహినిమైన యప్పువ్వుఁబోడి ॥

క॥ ఎవ్వరి వంకఁ గనుంగొను
నవ్వనితామణి విలోచనాంచలమున వాఁ
డవ్వేళన కీలించున్
మువ్వంబగు కేలుదోయి మకుటాగ్రమునన్ ॥ VI 109

స్త్రీ వశ్యులై వారామెకిట్లు సేవ చేయుటయు తర్వాత కథా సందర్భమునుబట్టి కూడ హాస్యజనకము కాకపోదు.

శృంగార రసాత్మకమైన హాస్యముతోఁ గూడిన చక్కని సన్నివేశము కళాపూర్ణోదయ మందలి నిజ మాయారంభల కలహ సన్నివేశము. వీరిద్దరి మధ్యను చిక్కి నలకూబరు డుక్కిరిబిక్కిరగును. ఎవతె నిజరంభయో, ఎవతె మాయారంభయో తెలియక, అంత నారదు డక్కడకు వచ్చును. ఈ సన్నివేశమందలి హాస్యము పరాకోటికిఁ జేరుచున్నది.

చ॥ అనుడు కుబేర సూను మొగ మారసి తత్ప్రియ యొక్క కేల నా
తని మెడఁ గౌఁగిలించియయుదంచిత హాసముతోడ నిట్లనున్

మన చరితంబుఁ జెప్పెను సమస్తము వేల్పులసాని చెప్పిన
ట్ల నిజముగాఁగ నిశ్వరవిలాసిని మెచ్చుచునుండి చూచెనో॥ III 185

గీ॥ అచల సపుదట్లు వినఁగూడి యలరినదియు
సట్లనీ వేగుచో వచ్చినదియుఁ దాన
యనుచుఁ దోఁప సంపరికి యెట్లాడనేర్చె
మగుపగాచిర యిది పెను గిదరగాని ॥

ఉ॥ ఇప్పుగిదిన్ మదాకృతి వహించి నినున్ వినఁబాయఁ జేయనే
చొప్పునసైనఁ దాఁగల గుఁజూచు దురాశల మాయలాడివా?
తప్పక యింతఁ దత్తఱచిలంబఁగు యుక్తుల మాటలెన్ని యే
నొప్పఁగ నాడుకో నెఱుఁగకుండునె నిట్టివి చెప్పనేటికిన్ ॥ 187

క॥ వినుసల్లభ కన్నుందం
గనుజాపం దివియ నేర్పుగలము నిముచ్చి
వనిత తగదిచట నుండన్
వెనుకను దిద్దుకొన వచ్చునే యొకసైనన్ ॥ 188

వ. అని యచ్చటఁ దన్ను నిలువనీక పోఁదోలుటకు నిజ వల్లభుని సత్వరంబుగా బోధించు నా చంచలాక్షి పలుకులకు నలుక బలియ మనంబు సైరింపలేక యాకంబుకంఠి దాని నధిక్షేపించుచు నిట్లనియె. 189

క॥ త్రుళ్లగ నేటికి నిలు నిలు
మిల్లలికినఁ బండువగునె యింతటిలోనే
వల్లభునకు గడు నచ్చిన
యిల్లాలవె యేమలాఁలినె పోఁదోలన్ ॥ 190

క॥ మగఁడా పట్టెంబునఁ దలఁ
దెగఁగొట్టినఁ గొట్టుఁగాక తెకతేరఁగ నీ
కెగవిడిచి పోయెదనె ప్రో
వగనా కాణాచి యైన వలపుల పంటన్ ॥ 191

క॥ ఈ రీతి మద్వల్లభుఁ
గోరిక మెదఁ గౌఁగిలించుకొని నీ వుండన్
సైరించుట కొఱగాదిది
రారమ్మిక నోర్వఁ జుమ్మ రావే యనుచున్ ॥ 192

క॥ తెడదెరువు లిచటఁ జెల్లవు
పుడమి నహిహి దొంగలాగఁ బొడిచినఁ గోకల్
విడుతురె గడింతునే యె
క్కడి గతిమాలిన పిశాచికవో నీ మాటల్

వ. అనుటయు నా యింతి సైరింపక.

మాలిని॥ అంత మదింపకులే యని పల్కిన
నంత మదింపకులే యనుచున్
గంతు లడంచెద లెమ్మని పల్కిన
గంతు లడంచెద లెమ్మనుచున్
రంతుల నేమి ఫలంబని పల్కిన
రంతుల నేమి ఫలం బనుచున్
బంతము చూడగదే యని పల్కినఁ
బంతము చూడగదే యనుచున్ ॥

సీ॥ ఒట్టుసుమీ యన్న నొట్టు సుమీ యంచు
నేమేమి యనిన నేమేమి యనుచుఁ
గానీ గదే యన్నఁ గానీ గదే యంచు
నింకేల యనిన నింకేల యనుచు
నోసిపోవే యన్న నోసిపోవే యంచు
నౌనంటి వనిన నౌనంటి వనుచు
మఱవకు మిది యన్న మఱవకు మిదియంచు
నీ వెంత యనిన నీ వెంత యనుచు

తే॥ ఒకతె మగనికి నాసించు టొప్పదనిన
నొకతె మగనికి నాసించు టొప్పదనుచుఁ
బట్టియాడె నా రంభతోఁ బ్రథమ రంభ
ప్రియుఁడు నిలుమన్న నిలువక పెద్దరొదగ ॥

చ. జగడపుకూటి సత్తఱవు సారెకుఁగోరుచు వీరివారినిన్
దగిలెడు తందనాల జడవారి పోరిపోరిఁగుంచె వీచుచున్
మిగులగ వీణెమీటుచును నేఁడు వడంతుల యొద్దనుం గదున్
నెగడెడు విందు గగ్గెనని నెమ్మది మెచ్చుచువచ్చెఁ జెచ్చెరన్—197

క. వచ్చినఁ కుబేరసూనుఁడు
నచ్చెలువలు నెదురుగాఁగ నరిగి యతనికిన్
నిచ్చలమగు తాత్పర్యం
బచ్చుపడఁగ మ్రొక్కిరతఁడు నల్లననగుచున్— 198

క. నలకూబర నీకిందే
చెలువ ప్రియవధూటి నాకుఁజెప్పుమా దానిన్
దెలియక దీవింపఁగరా
దలరుఁ డొకరొకళ్ల ప్రేమ ననుచున్ మిమ్మున్ 199

మ. తనకంటెన్ బ్రియ నీకులేదు తనసౌందర్యంబె సౌందర్య మం
చును గర్వింపుచు నున్న రంభమనసుం జూడంగలేకిట్టు దా
నిని నీవే సృజియించిరో, యిదియతా నీ తోడఁ గ్రీడింపఁగాఁ
దనమే నొక్కటి చాలదంచుఁ గడపన్ ద్వైరూప్యముం దాల్చెనో200

గీ. ఎట్లయైన నీ ప్రేమ యీ యిరువురందు
సమమగునొ కాదో చెప్పుమా చాలఁదడవు
వీరింబోరించి తప్వేడ్క విరియంజిమ్మ
లేక కనుగొంచునుంటి నే నాకసమున.

క. అనుటయు నే నెక్కడ వీ
రిని బోరించితి నయోవిరించితనయ నా
కును వీరల సమరూపత
యును బోరును వెఱఁగొనర్చుచున్నది మిగులన్.... 202

ఇందులో ముఖ్యముగా కథను మలుచుకొనుటలోనే యిట్టి హాస్యసన్నివేశములు పుట్టినవి. ఈ సన్నివేశమును బహు రమణీయముగ కల్పించినాడు పింగళి సూరన. షేక్స్పియరుకవి తన Comedy of Errors అను నాటకములోఁగూడ నిట్టి సన్నివేశమును సృజింపఁజాలకపోయెను. పొరుగింటి పోట్లాట విన వేడుక. దానిని గల్పించినవాడు నారదుడు. ఏమియు నెరుగని వాని వలె వారి కలహ సందర్భమునవచ్చి వారిలో నెవరి నెక్కువ ప్రేమింతువని నలకూబరుని ప్రశ్నించుట హాస్యజనకముగాదా. మాయా రంభను నలకూబరుడో లేక రంభయో సృజించుకొనినట్లుగా నారదుడు పల్కెను. కథ నిట్లు మలచుటలో హాస్యకారణమైనది కూడ. సవతుల కలహము వారిలో వారికి భేదకారణమే యైనను వినువారికిమాత్రము హాస్యరస జనకముగా నుండకపోదు. దీనిలో నొకరనినమాటనే రెండవవారు పలుకుట, మాటకు మాట రెట్టించుట చూడ స్వభావోక్తితో నుండి కలహముగూడ హృదయరంజకమే యనిపించును. ఇదియొకవిధమైన హాస్యరస పోషణము. ఇట్టి సన్నివేశము మరియొకటి గంగా పార్వతుల సపతి కయ్యమున గాంచగలము. కూచిమంచి తిమ్మనకృత శివలీలా విలాసమున నది యిట్లు చిత్రింపఁబడినవి.

క. నిగిడెడు కొరకొరతోడన్
మొగమించుక చేవురింపఁ బోణిమి నభ్రం
బుగ నగభవనుని గడితంపు
సిగ లోపలనుండి గంగ చివ్వన నులికెన్....II 163

వ. అప్పుడు భవాని దానిం గనుగొని యిట్లనియె. 164

క. ఎక్కడిదానవె నీ విటు
లక్కజముగ నా హృదీశునౌఁ దలపైఁ బెం
పెక్కగ వసించి యిప్పుడు
చిక్కిన నులికితివి బుద్ధిసెప్పెదఁ జుమ్మీ. 165

క. నీ వెక్కడ నే నెక్కడ
భావజహరుఁ డెచట నోసి పరగంగనికన్
గాపరముడిగి తటాలున
వేవేగ మహాలయంబు వెలువడి పొమ్మా. 166

క. పోకుంటివేని నిన్నున్
రాకాసులవంటి ప్రమథ రాజోత్తములన్
దీకొలిపి ప్రోలువెడలఁగ
నూకింతుఁ జుమీ చలంబు నూలుకొనంగన్. 167

వ. అనిన పార్వతీదేవికి భాగీరథి యిట్లనియె. 168

గీ. అక్కరో యిట్టిమాటల నాడనేల
నీవు శంభునిఁగోరి మున్నేవిధముగ
వచ్చి చేకొనియున్నావో వాలెముగను
నేను నటువలె వచ్చినదానఁ జువ్వె. 169

క. చిగురాకుఁ బోండ్లకెల్లను
మగఁడే మారగను మేటి మక్కువతోడన్
నగమేన నిల్పుకొన్నను
సిగలో నిడుకొన్నఁ జెల్లుగదమ్మా.... 170

వ. అనిన భవాని దానికిట్లనియె. 171

క. మేల హాహా యెంతటి గ
య్యాళివె చేరినటులుండ కఱచెదవు కడుం
గూలికివచ్చిన యాతఁడు
పాలికిఁబట్టిన క్రియన్విపర్యాసముగన్... 172

ఆ. అడుగు నిలుపనీక వడికొట్టు చూపుచు
నింగిముట్ట మిగుల పొంగెదేమి
గట్టివాదనంబు గనఁబడనౌనె నీ
నిలువు నీరుగాను నీచురాల.... 173

వ. అనిన గంగ యిట్లనియె. 174

ఆ. పెద్దదాననుచు పెళపెళ నార్చుచు
జగములెల్ల మ్రింగఁ జాలునట్టి
సత్తిరూపుపూని జడిపింపవచ్చెదు
కినుక నిగుడ నీవు గిరితనూజ.... 175

వ. అనిన హైమవతి యిట్లనియె. 176

గీ. నిచ్చనిచ్చలు పంకంబు నివ్వటిల్లఁ
గోరి మితిలేని జలచర కోట్లలోన
నడచుకొనియుండు చెనటువయారె నీవు
నన్ను నెదిరింప నెట్టిదానవె తుటారి....

ఆ. వక్రగతులచేత వాలెంబుఁ జెక్కు త్రో
వల వెలుంగుచుండి కలకనిగుడఁ
దూలిమెర సెపేమి దుష్కీర్తి బొడవి వీ
బ్రతుకు బైలుగాను పలువదాన.... 178

క. అనినన్ జాహ్నవి గిరిసుతఁ
గనుగొని యిట్లనియె నీవు ఘనురాలవె మేల్

మును చండికవై యొక కా
తెను పోతును జంపి దాని హితమఱిఁగొనవే.... 179

గీ. సతియ యూరూర దేశదేశములఁ బెద్ద
సత్తివై నిల్చి కూర్చును శాకములను
గోళ్ళ గొడియలు గుగ్గిళ్ళ కుడుములట్లు
దనివినన మెక్కి కడుపు బద్దలివి గదవె....

వ. అనిన చండిక యిట్లనియె. 181

గీ. ఓసి గయ్యాళి నీకింత రోసమేల,
చెడగు జాలారివాని నింటఁ బొడమిబిట్టు
చేఁప జెల్లలు దిని మేను చెందనున్న
పరికెతవు నీవు నా తోడ సరియె చెపుమ...

వ. అనిన భాగీరథి యిట్లనియె.

గీ. అప్పరో యింత నీ గుట్టు చెప్పనేల
పిల్లి గంజాయి నంజుడు నెల్ల ప్రొద్దు
బాళిగాఁదిను కదజాతివాని యింటఁ
బుట్టితివొ లేదొ చెప్పుమా గట్టిగాను....

వ. అని యిత్తెఱంగున నిరువురు వాదింపుచున్న సమయమునఁ గాత్యాయనీదేవి మహాదేవుని మొగంబు జూచి యిట్లనియె.''.... 185

ఈ సవతుల పోరులో పరస్పర నర్మ మర్మములను భేదించుకొనుట యొకవిధమైన హాస్య మొప్పఁజేయును. దేవతలుగూడ మానవులవలెనే నతి నీచముగా ప్రవర్తించి సంభాషించుదురుకదా యనియు దీనివలన స్పష్టమగును. దేవతలకుఁగూడ నీ బాధ తప్పదనిపించును. వారివారి దోషములను తడవుకొని కలహించుట సహజముకదా. ఈ కలహ మింకొక విధముగ బాగున్నది. ఈ కథా సన్నివేశమే గేయరూపమున నీ క్రింది రీతి వర్ణింపఁబడినది. 'గంగా వివాహము'ను ద్విపదలో దీని కర్త పసకాడ సన్యాసి సాలె కులమువాడు. మచ్చునకుమాత్రము

ద్వి. గంగవైతే నీవు గగనమందుండక
మగని శిరమెక్కుటా తగునటే గంగా
చాపలమ్మే నీవు జాలారి దానవు
నిన్నెట్లు వలచెనే నీలకంఠుండు
కులమెంచితే లేదు గుణమెంచి తెచ్చేను
జాతులెన్నఁగబోకు సవతి గౌరప్ప
జాతితక్కువదాన జాలారి నా సవతి
నీతిమాలినదాన నెరజాణ గంగ
ఎంతపని వచ్చెనే యింతలోనే నీకు
జాతితక్కువలెంచ చెల్లదే గౌరప్ప
జాతేమి కారణము నీతె కారణము.

ఇందు వ్యక్తీకరణ విధానము మాత్రము భేదము. భాష జాతీయము. పాటకు వీలైనది పామరులకుఁగూడ. కాని యితివృత్త ముదాత్తమైనదే. ఇఁక పామరుల సరస విరస రూప మెట్లుండునో సింగడి కలాపములో సింగి సింగడ్ల గేయరూప సంభాషణ యిది. ఇది జానపద హాస్యమునకుం జెందినది.

సింగడు : మనసు రాకపోతే మును పెరుగవె సింగి
అనువులంటె నోరు ఆగలించి
కిళ్లమంటె బిగ్గ కరచియు బట్టితే
కొరడదెబ్బ లనుచు ఎరుగవటవె ॥

సింగి : కొరడదెబ్బ లనుచు మరిమరి బలికేవు
తరముగాదు నాదు దరికి రాకు
మురువు వరువులేని పురుషత్వమేలనీ
సరసమేల నాకు చాలుపోర ॥

సింగడు : మూల మెరుగ కీవు చాలని బల్కేవ
దేల శింగి నీకు నోలిగట్టి
పాలివారు నన్ను గేలిపెట్టిన గాని
బాలపాప వనుచు బలుకలేదె
దండిగాను గుడిసె పెండెలన్నియు దీసి
వండి వండి కూడు వాస్చలేదె
కొండమీద సింగ డుండునోయని బల్కి
నట్టి శింగ నీకు గుట్టులేదె ॥

సింగి : గుట్టు గాకపోతే నట్ట నడవిలో
కొట్టవచ్చినట్టి గుణము నీది
వట్టిమాట లేరవద్దు నిన్నొల్లను
బుట్టతోడు నమ్మ పొమ్ము సింగా ॥

సింగడు : శింగీ నిను జూచితేనే
నంగజుడును రూపురేఖలందును మును నా
సంగతి నీ విటులై తిరు
గంగను న్యాయంబుగాదు గట్టిగ శింగీ ॥

సింగి : చేకువలె నుండు మీసాలు చీపికళ్ల
చింకి తలగుడ్డ గొంగళి చంకబెట్టి
కప్పు పొక్కిడి పొగసిద్ద వొప్పు జూచి
నయమె నిన్నంగజుడన్న నప్పరటర ॥

ఇది పామరహృదయమును ప్రదర్శించుచు చేయు సరసవినోద హాస్యము. భార్యాభర్తలకుమధ్య, పామరులకిది హృదయంగమముగా నుండును. ఇట్టిదే గొల్లకలాపములో రాధను శ్రీకృష్ణు

నకు నప్పగింత చేయుచు హాస్యగాడు పాడు అప్పగింతపాట యిది.

అగ్నిసాక్షిగా దీని పెండ్లాడినావు
అవని భారమ్ము నీ భారమయ్యా
బొమ్మరిళ్లున్నాయి బొమ్మ లున్నాయి
యిఖ నెవ్వరున్నారు నా తల్లి రాధ.
గుజ్జనగూళ్ళకి బియ్యం మడిగేవు
యిఖ నెవ్వ రడిగేరె నా చిట్టితల్లి
హితవుగా మగడు చనువిచ్చి పిలిచిన వేళ
మురిపించగాబోకు ముదిత నా తల్లి
చీకటికి చిత్రాంగి వెన్నెలకు వెరికి
గాదయ్య యీ కన్నె గిజకన్నెకత్తె
ఇరుగు పొరుగుల్లార ఓ యింతులారా
కంచాలు, ముంతల్లు కనిపెట్టుకొండి
బాల చిన్నదిగాని సోల మింగింది
సోధించి చూడుడీ ఆ సోద్యమంతా
బావ మరదులు నిన్ను ఎవ్వరేమన్నా
కదు రెర్రగాగాల్చి కంట్లోబెట్టూ
తోటికోడలు బిడ్డ కూటికేడుస్తే
పీటచెక్కాలోను పెణతోడగొట్టూ
ఇరుగు పొరుగులవారు నిన్నేమి యన్నా
యిల్లు తగులబెట్టి మళ్లిరావమ్మా
బుద్ధు లెరుగదు బాల ముద్దుకే కాని
బుద్ధు లొచ్చేదాక దిద్దుకోవయ్యా॥

ఇట్టి బోధనలతో నప్పగింతలు చెప్పుట పామరులకు హాస్య జనకమౌను. కాని యిటువంటివారు లోకమున లేరనికాదు. పెంకె వారు, మూర్ఖులు లోకములలో కొందరుండకపోరు. వారు భర్తలకు యమ లోకమును గల్పింతురు. ఇటువంటి యామె చరిత్రయే జైమినిభారతమందలి యుద్దాలకుని భార్యయగు చండిక కథ. ఆమె

సీ॥ సంధ్యవార్చగ నిమ్ము జలపాత్రమునఁ బోవఁ
గొట్టిన నతికించు కొనఁగ వలసె
తడి ధోవ తిమ్మన్న నడిమికి వడిఁజింప
కట్టుకోఁబడె బ్రహ్మ కమ్మివైచి
యక్షమాలికఁ జూపు మనఁద్రెంచి వైచినఁ
బనిచెడి ఫలిఁ గ్రుచ్చుకొనఁగ వలసె
సమిధ లిమ్మన్న బ్రేలిమిగుండ మార్పఁగ
నూడుఁకోఁ బడెమింద నొక విధమున

గీ॥ ననుదినము నిట్లు ప్రాతికూల్యము భజింపఁ
జండికతమున ముని బ్రహ్మచర్య నియమ
మునకు గృహమేధి వర్తనమునకుఁ దొలఁగి
రెంటికిని జెడ్డరేవని రీతియయ్యె॥

ఇటువంటి మహా పతివ్రతలతో కాపురము చేయు భర్తల జీవితమే యొక హాస్యరస సాధనము వంటిది. ఇందలి హాస్యము పాత్రపై నాధారపడియుండును. కాని సన్నివేశమునకు సంబంధించి నది కాదు. కల్పనయు నిందుండదు.

కథా విశేషముపై నాధారపడియున్న హాస్యము శశిరేఖా పరిణయములోనిది. ఇందు ఘటోత్కచుని మాయచే నంతయు విపరీతముగ గోచరించుటచే వికారచేష్టలకును, తన్మూలమున హాస్యమున కునికిపట్టగును. ఇది యద్భుత హాస్యముతో మిశ్రిత మైనది. అందరకు శశిరేఖగా కనుపించుచుండగా, ఘటోత్కచుని మాయచే లక్ష్మణకుమారునకుమాత్ర మామె పిశాచముగాఁ గనఁ బడుటచే వారు గగ్గోలుపడుదురు. ఇందుచే హాస్యము గలుగును. ఆమె లక్ష్మణున కనేక విధములుగాఁ గనఁబడును.

సీ॥ చూడ లక్ష్మణున కాసుదతి కుందేలుగా
గంతులు వైచుచుఁ గానఁబడియెఁ
వెంబడి నతఁడాత్మ వెఱగంది చూడగా
బిండిఁ బొక్కుచు గండుబిల్లి యయ్యె
వగచుచుఁ దెరవంచి వాఁడు వీక్షింపఁగాఁ
గొక్కిరింపుచుఁ బండుక్రోతి యయ్యె
నిది చిత్రమని యెంచి పదిలంబుగాఁ జూడ
రోమముల్ పెరిగి భల్లూక మయ్యె

గీ॥ మదిని భ్రమచెందికనొ యంచు మయిఁ జూడ
మినుకు కోఱల సర్పమై మీది కెగసె
నపుడు భయమున రెప్పలల్లార్చు కొనుచుఁ
బండ్ల నిగిలించి విలపించెఁ బెండ్లికొడుకు॥

ఇందలి సన్నివేశ మింద్రజాలముగా పరిణమించును. దీనిని చూచువారలకు హాస్యము గల్గింపక యెట్లుండగలదు. ఇదియొక్క విధమైన హాస్యమనవలయు.

ఈ విధముగ హాస్యరసము పరిపరి రీతుల సన్నివేశముమీఁదను, పాత్రలమీఁదను కథాసంవిధానములోను, భావకల్పనలోను భాసించు చుండును. ప్రాచీనాంధ్ర పద్య వాఙ్మయమునఁ దుఁ గనబడు హాస్య రసవైవిధ్యము నవ్యాంధ్ర వచన వాఙ్మయమునందుగూడఁ గానరా దని యిందువలన చెప్పవలయును. నవీనాంధ్ర వచన గ్రంథములలో హాస్యము కేవలము వివేకహీనులు, మూర్ఖులు మొదలైన విదూషకుని వంటి గణపతి, బారిష్టరుపార్వతీశము మొదలైనవారివలన జనించును. పద్యకావ్యములలో పాత్ర వైవిధ్యము గనఁబడును. ప్రాచీన వాఙ్మయములో చమత్కార వాక్పాటవము గోచరించును. చాలచోట్ల నొకే చిన్నవిషయము నానుడు చేయఁబడి విసికింపఁ జేయుటయు గలుగును. ఇదియే భేదము.



# ఉగాది అభినందనము

సంపూరి రామకృష్ణమాచార్య

ఆమని వేపపువ్వాడ, రసార్ద్రమనోజ్ఞనవీనతింత్రిణీ
కోమలశర్కరా రుచులకున్, కదళీఫలపాకసిద్ధికిన్
మామిడి పిందెలే వగరు మాటడ, క్షీరమధుస్రవంతి కా
భూమికుగాది తెచ్చు సుఖభోగులు కందు తెలుంగునీదరుల్

బంగరుంగలల్ హృదయాన రంగరించి
రెక్కలు పొదుగు ప్రాతకోరికల నెల్ల
క్రొత్త సంవత్సరం బొనగూర్చు మీకు;
అందుకొనుడు; ఈ సుహృదభినందనమ్ము.

ఆమని కన్నెమొగ్గల ఒయారము తెచ్చుట మోసులెత్తినన్
ప్రేమ సముద్రమై పులకరించు తెలుంగు ఎడంద; చంద్రికా
కోమల కావ్యనిర్ఝరులకున్ సుకుమార మనోజ్ఞ శిల్పగా
నామృత దివ్య విద్యలకు ఆర్ద్రితకున్ నెలవయ్యె సోదరా

ఉత్తరమునుండి వీచెడి ఉద్యమమ్ము
దక్షిణమునుండి రేగెడి దండయాత్ర
తూరుపుం బడమరల దుమారములును;
కౌగిలించుకొనుత తెన్గు గడ్డపైన.

కోరుకొనిన కోరిక సీతకోక చిలుక
పట్టుకొనబోయి వెనువెంట ప్రాకులాడ
చేతి కందదు గాని నిశ్చింతతోడ
వదలి కూర్చున్న వచ్చి పై వ్రాలవచ్చు.

ఆయువుగల్గు నాల్గు గడియల్ భువిమీద ప్రమోదహావ భా
వాయతనేత్రదీధితుల ఆడుచుపాడుచు నవ్వుకొంచు లో
కాయతనం బొనర్పు; జగమంతయు ఈశ్వర చిద్విలాస తే
జోయుత తన్మయత్వమున సొంపులు నింపును పువ్వుటీరమై.

*ఆనందోల్లసనమ్మునన్ మధుర గీతాలాపనన్ సుందరో*
ద్యానామోద వితర్ది జేయుము భువిన్; దౌర్జన్య దంష్ట్రోగ్ర హిం
సా నాట్యమ్ము నెదిర్చి నిల్వుము దయాశౌర్యమ్ముతో; ఈ పురా
క్షోణిన్ మానవజన్మ గల్గెనని ఔత్సుక్యాన గర్వింపుమా.

పోరునప్పుడు మరణించు వారికంటె
పారిపోవునపుడె చచ్చువారు హెచ్చు;
మాయ మర్మాల నడివీధి మధ్య నిలిపి
ముక్కుమీద గ్రుద్దుము మేలిముసుగు తొలగ.

లీలానందచిదార్ద్రరాగరసలాలిత్యమ్ము నిండార భూ
గోళమ్మున్ గ్రహతారకానివహముల్ గూర్చెన్ జగత్ స్రష్టయే
కేళీ తాండవమూర్తి; విశ్వమయ సంగీతామృతాంతర్ఝరీ
హేలాయోగలయాప్తి నీ బ్రదుకు సంధింపన్ ప్రయత్నింపుమా.

ఈ మహి వింతసత్ర మిటు లించుక సేపు వసించి పోవు వా
రీ మనుజుల్; వృథా వ్యథలనేల తపింప? ప్రమోదశీలివై
యే మనుకారముల్ గొనక యీ యిహ నాటకరంగమందు నీ
భూమిక నిర్వహించుటకు పూనుము నేర్పున మేలు బంతిగల్.

నీ సహజన్ములల్ గలిసి నిర్మల సుందర మందహాస చే
ష్టాసుకుమారతల్ విరియగా సుఖియింపు మనోజ్ఞగాన వి
న్యాసతరంగితంబయిన నాట్యవినోదమునందు మంగళా
శాసనమున్ పఠించు నిముషంబులదాక రసజ్ఞమూర్తివై.

చూతఫలోద్గమమ్ము,
వనసుందరి ఆమెని మేల్ముసుంగు కైసేతలు,
మల్లెతే వలపుసిగ్గుల వెన్నెలొల్కు;
షడ్రసోపేతముగాగ
మా తెలుగుబిడ్డల జీవితమెల్ల దిద్ది,
ఈ నూతన వత్సరంబిక
మనోరథ సిద్ధులొసంగి యేగుతన్.



# కావ్యరస విరోధ పరిహారములు

కుంటిమద్ది శేషశర్మ

"ఇదమంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయం।
యది శబ్దాహ్వయం జ్యోతిరా సంసారం నదీప్యతే॥"

ప్రాణికోటిలో మానవునకు భగవాను డనుగ్రహించిన అపూర్వశక్తి వాక్కు. దాని సహాయముతో హృదయగత భావములను మనుజుడు వెలువరించుచున్నాడు. చమత్కృతి జనకములు నర్మోక్తులు శ్లేషార్థసంయుతములు వ్యంజనారంజితములు ప్రయోగించి యెదుటివారి నానంద పరవశుల నొనరించుచున్నాడు. శ్రావ్యముగ గొంతెత్తి పాడి శ్రోతల నుఱ్ఱూత లూగించుచున్నాడు. పోటుమాటలఁ బల్కి గీర్వాణుడై శపించి పరిపంథుల మదముడుపుచున్నాడు. అనుగ్రహించి ఆశీస్సులఁ గుమ్మరించి సర్వజన సుఖ మాచరించుచున్నాడు.

దీనికంతటికి సాధనము వాక్కు. అదిలేదేని సమస్త నిత్య వ్యవహారమును స్తంభించును. పశులవలె కిచకిచ లాడవలసి యుండును. అదిలేదేని తినుటకు నోరున్నను ఉన్నదానిలో చేరిక గాదు. కావుననే పశువులను నోరులేని జీవాలందురు. మూగ వారి ముచ్చట పరికించితిమేని "వాక్కు లేదేని జగమంతయు నంధకార బంధురము." అని తోచును గదా.

పెదవి కదలించిన వాక్కు వెలువడును. ఈ వాగ్వికారమంతయు వాఙ్మయమే. అంతయు సారస్వతమే. ఐనను వాఙ్మయ పదము పరిమిత శబ్దజాలమునకే సంకేతితము. చరిత్రలు, శాస్త్రములు, సూత్రములు, సూక్తములు, ఆగమములు, నిరుక్తులు, ఇత్యాదులన్నియు సారస్వత వాచ్య బహిర్భూతములే.

యదార్థ కథనము గాక ఒక ప్రత్యేకత, ఒక వైలక్షణ్యము గల వాణీవిలాసమే వాఙ్మయశబ్దాభిధేయము. శబ్దముల కూర్పునందో, భావావిష్కరమునందో ఒక విచ్ఛిత్తి లేకున్న నది 'వాఙ్మయము సారస్వతము' అనిపించుకొనదు. ఉన్నదున్నట్టు చెప్పిన హృదయవికాసము భావోద్వేగము జనింపదు. హృదయమును ద్రవింపఁజేయని గ్రంథమువలన నానందమేమి గల్గును? విన్నంతనే అనిర్వచనీయానందసంధాయకత్వమే కావ్యమునకు పరమ ప్రయోజనము. యథాస్థితి కథనమునందు పై ప్రయోజనము నెఱవేరదు. ఉన్నదున్నట్టు విషయ నివేదనమునకు చరిత్రగ్రంథములు వార్తాపత్రికలు నున్నవిగదా!

"ముదేమురారే రమరైస్సుమేరో
రానీయయస్యోపచితస్య శృంగైః।
భవన్తి నోద్దామగిరాం కవీనా
ముచ్ఛ్రాయ సౌన్దర్యగుణా మృషోద్యాః॥"

"ద్వారక జగన్నాటక సూత్రధారుడగు కృష్ణుని నగరము. దాని దాపున నున్నది రైవతక పర్వతము. అది తత్పురజనుల క్రీడాశైలము. కృష్ణుని ప్రీతికై సురలు మేరుపర్వత శిఖరములను మోసితెచ్చి ఆరైవతకాద్రిని పెంచి యలంకరించిరట." అని వాకొనుచు మాఘకవి, "అదెక్కడైన కద్దా? బంగారు కొండ ఉండడము, దాని శిఖరములను పెరుకుకొని తెచ్చి వేరొండుకొండ కతుకడము సాధ్యమా? ఇదంతయు వట్టి ప్రలాపములు. అడుగువారు లేక నోటికి వచ్చినట్లు వాగుట కవుల నిరంకుశత. అవి నమ్మరాని పల్కులు. అసత్యములు." అని తలంతురేమో అని, అతడే అనుచున్నాడు 'కవుల మాట లసత్యములుగావు' అని.

దీనినే భంగ్యంతరముగ కీర్తిశేషులగు శ్రీ కపిస్థలము కృష్ణమాచార్యులవారు—

"జిహ్వాంగణే ష్వనృతమేవ సదా కవీనాం
నృత్యం సమాకలయతీతిహి యే భణన్తి।

కుర్వన్తుతే నను నిజామచిరేణ జిహ్వాం
జహ్నూద్భవాసలిలసంగమతః పవిత్రాం॥"

"కవులు వట్టి అసత్యవాదులు. వారి నాల్కలపై నిచ్చలు కల్లలే తాండవించు చుండును," అనువారు తమ కవిదూషణా కాలుష్యమునకు ప్రాయశ్చిత్తముగ గంగాతీర్థమును పుక్కిట బట్టి తమ నాల్కలను పవిత్రమొనర్చు కొందురుగాక. అనిరి.

దీని భావ మేమి? కవులు ఉద్దేశ్యము రసికజనానంద సంపాదనము. అందు కుపమోత్ప్రేక్షలు రూపకాతిశయోక్తులు కూర్చి విచ్ఛిత్తిగల్గించినంతమాత్రమున వారి నసత్యవాదులని తూలనాడఁజనదు. అని గదా!

కావున పెద్దన్న ప్రవరముఖమునఁ గావించిన—

"నిడుద పెన్నెఱిగుంపు జడగట్ట సగరము
న్మనుమండు తపముసైకొనినచోటు
జరఠకచ్ఛపకులేశ్వరుని వెన్నుగానరా
జగతికి మిన్నేరు దిగిన చోటు
పుచ్చడకతనంబు వోవెట్టి గిరికన్య
పతిఁగోర్వ నాయాస పడినచోటు
వలరాచరాచవాడలికాఁకు కనుపెచ్చుఁ
గఱగిన యలకనికరపుఁజోటు
తపసి యిల్లాండ్ర చెలువంబు తలచి తలచి
మున్ను ముచ్చిచ్చును విరాళిఁగొన్న చోటు
కనుపపులు వేల్పు బడవాలఁగన్న చోటు
హర్షమునఁజూచి ప్రవరాఖ్యు డాత్మలోన.
కులిశధారాహతి వోలుపునఁ బైనుండి
యడుగుమోవఁగ జేగురైన తటుల—"

అను హిమవద్వర్ణనను పరికించి. "ఇదేమి మంచుకొండ? పెద్దన యేనాడైనా హిమవంతమును గాంచినాడా? అది యెందుఁజూచినను వట్టి తెల్లని చల్లని మంచురొంపితో, మంచు రాలతో తుషారగ్రావములతో నీహార శిఖరములతో కాలూన రాని తావులుగాని; ఇచ్చట భగీరథుడు తపసు చేసినాడు, ఇచ్చట పార్వతి శివుని వశీకరింపఁ దపించినది. శివుని కంటి మంట నిచ్చటనే సుమాయుధుడు నూడిమసియయ్యెను. కుమారుడు జనించిన శరవణమయ్యదియే. ఇంద్రుని వజ్రాఘాతమున విదారితమై కెంపులు మియు నిటారు సానువు లియ్యవియే," అని ఇదం ప్రథమముగ హిమవన్నగ విహారమునకుఁ జనిన ప్రవరునికి తెలియుటకు నోటీసు బోర్డులు తగిలించినారా? మార్గదర్శకుని వెంట పిలుచుకొని పోయెనా? ఆ మంచు మలలోఁ జేగురు తటు లుండెనా? ఇదంతయు కవికల్పనగాక వాస్తవమా? అని విమర్శించు తత్త్వచింతకు లుండవచ్చును.

కాని కేవల ప్రాలేయ నిలయ బాహ్యస్వరూప కథనమునకు స్వారోచిషమనుసంభవము భూగోళ శాస్త్రముగాదు. యథార్థ స్వరూప ప్రదర్శనము కవియుద్దేశ్యముగాదు. అట్లొనర్చిన సరస హృదయానందము జనింపదు. కావ్యత్వము సిద్ధింపదు. దానిచే కర్త శాస్త్రపండితుడనిపించుకొనును గాని కవియని పించుకొనలేడు.

ఏవస్తువైనను చూచువారి కందరకు సమానముగ నాత్మ స్వరూపము నావిష్కరింపదు. అనగా నందరు నొకే దృష్టితో వస్తువులఁ బరికింపరు. గజేంద్రమోక్షమునందు ఒక పెనుమడుగున మొసలివాతికిఁ జిక్కి వేలకొలది వత్సరములుపోరి, నెత్తురు ఓడి, శోషిల్లిన శరీరముతో లావొక్కింతయు లేక. విహ్వల ధైర్యముతో, తావులు దప్పిన ప్రాణములతో, డస్సిన తనువుతో, "నీవేతప్ప నితఃపరం" బెరుగని యీ దీనుని,—"కలడందురు దీనులయెడ కలడందురు పరమయోగి గణముల పాలం గలడందు రన్నిదిశలను" అని పెద్దలస్వానుభవముతో ఘంటాఘోషముగఁ జెప్పిన పరమసత్యమును అజ్ఞానినై — "కలడు కలండనెడువాడు కలడో లేడో" — అని సందేహించితినే. అట్టి తప్పిద మొనర్చిన దీనుని — ''మన్నింపన్ గదే: రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా''. అని పలికి, అరక్షిత రక్షకుండైన ఈశ్వరుడు ఆపన్నుండైన నన్ను గాచుగాక అని నింగి నిక్కిచూచుచు బయలాలకించుచు నెత్తిన తొండముతో నున్న కరీంద్రుని—

అక్కాసారంబు తీరంబున గజేంద్ర రక్షాపరత్వంబు నంగీకరించి, మార్గమున దేవతానమస్కారంబు లంగీకరింపక మనస్సమాన సంచారుండై యేతెంచుట శిథిలకచభరంబుతో వారిచరంబును ఖండింప మహోద్యద్విస్ఫులింగచ్ఛటా పరిభూతాంబర శుక్రమైన చక్రమును బంపు సంరంభ ముడివోని కరుణావరుణాలయుడైన శౌరిని, నక్రగల కర్తనవ్యాపారాయమాణంబగు చక్రమును గమనించి—

సామాన్యమానవుకు, "ఇది యేనుగు, అది మొసలి, కరీం

ద్రుని రక్షించుటకు వచ్చిన శ్రీమన్నారాయణుడతడు, అదో చక్రము నక్రము కుత్తుక నుత్తరించుచున్నది. అని గ్రహింపఁగలడు. వాని చూపులు అంతకుమించి లోనికి చొరవు.

దానినే గాంచిన భక్తుడు, "అహో! భగవానునకు భక్తులపై నెంత దయ! వైకుంఠమునుండి ఆపన్న కరీంద్ర రక్షణార్థము, ఎకాయెకి, అభ్రగపతిన్ బన్నింపక హుటాహుటి చనుదెంచినాడు, కాని మకరిని ద్రుంచుటకే ఇంతదూరము రావలసియుండెనా? ఆ వైకుంఠమునుండియే చక్రమును బంపక పోయెనా? కాదుకాదు. అనన్యభక్తుడైన గజేంద్రునకు దర్శనమిచ్చి అతడు కేలెత్తి యొసంగు సద్యోవికసితాంభోజమును పరిగ్రహించి అతని నానందపఱచుటకే వచ్చినాడు." అని భావించును.

ఆ చిత్రమునే గాంచిన చిత్రకారుడు, "ఆగజమును చిక్కిపోయినట్టు చిత్రించుటకు ఇచ్చట లేతరంగు, ఇచ్చట ముదురు రంగు కూర్చినాడు. తొండము నెత్తినప్పుడు పై భాగమున వళులను ప్రదర్శించుట కతని కుంచెము ఎన్ని పోకలు పోయినదో, ఆతుండాగ్ర మార్దవము సూచించుట కాతడు వాడిన వన్నెలెవ్వియో" అని పరికించును.

చట్టము బంధించువాడు, "దీని పొడవెంత? వెడల్పెంత? ఎంతమందము చెక్క కట్టవలెను? ఎంత అద్దము అవసర"మని గణించును.

ఇట్లు వానివాని ప్రవృత్తిననుసరించి యూహలు పొడమును.

అటులనే తుషారగిరికి పోయిన ప్రవరునికిని. వానికి నట్టి యూహలు పొడముటకు కారణమేమి? అందుకు సమాధానమును అందేగలదు.

"ఆపురిఁబాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మ దీ
క్షాపర తంత్రు డంబురుహ గర్భకులాభరణుం డనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యు డలేఖ్యతనూవిలాసుడై."

అతడు భాషాపరశేషభోగి. అనారతాధ్యాపన తత్పరుడు. వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీక్షాపర తంత్రుడు. అని వేద వేదాంగములు పురాణేతి హాసములు చదివి శిష్యులకు బోధించువాడు. అతనికి స్మృతి పురాణ విషయము లన్నియు కరతలామలకములు. అట్టివాని కా విషయములుగాక ఇతరములు మదికి దట్టునా? పలుకులు నమలిన వాని నోట నింగువవాసన వచ్చునా?

పాత్రాను గుణముగ పలికించినాడు పెద్దన. దానిని సరసులను మతించినారు.

"పెద్దనవలె కృతిసెప్పిన పెద్దనవలె లేకయున్న పెద్దనవలెనా?
ఎద్దనవలె మొద్దనవలె గద్దనవలె కాకునూరి కవి చవడప్పా."

అని యనంత కవుల ప్రశంసల నందుకొనిన కవి.

అంతియగాక వ్రాసినకవి పురాణములు పుక్కిటబట్టినవాడు.

"హితుడవు చతురవచోనిధి వతుల పురాణాగ మేతిహాస కథార్థ
స్మృతియుతుడ వాంధ్రకవితాపితా మహుడ
వెవ్వరీడు పేర్కొన నీకున్."

అని లోకచిత్తముల నాకళించుకొనిన కవిరాజు కృష్ణదేవరాయలతో పొగడ్తనందినవాడు. అనురూప పాత్రమును ప్రవరుని సృష్టించినాడు. ఎంత సారస్వతాభిలాష కృశించినను నేడు మనుచరిత్ర పద్యములను హృదయ తంత్రులు మ్రోగ నాలపింతురన్న అతనిరచనా విధానము ప్రశంస నీయముగదా!

కనుక నున్న దున్నటుల చెప్పుట కవిత్వ లక్షణముగాదు.

"కావ్యం యశసేర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే."

అని కావ్యమున కనేక ప్రయోజనము లున్నను సద్యః పరనిర్వృతియే పరమ ప్రయోజనము.

వినినంతనే అనిర్వచనీ యానందము గల్గుటే పరనిర్వృతి. ఆ యానందము వ్యక్తినిబట్టి యుండును. "లోకోభిన్నరుచిః," గదా! ఆ రుచియు వయః పరిపాకమును బట్టి మారుచుండును.

బాలురకు లోతునకు దిగి భావముల నాకళించుకొనఁ జాలిన చిత్త సంస్కార ముండదు. వారు కేవలము బాహ్యస్వరూప భావనా నిర్వృతాత్ములు. కావుననే బాలురకు అద్భుత సన్నివేశములట్లు కరుణ శృంగారములు రుచించవు. సర్కస్సు చూచుట కువ్విళులూరినట్లు నాటకములఁ జూడ వాంఛింపరు. వయస్సు ముదిరియు హృదయ సంస్కారము లేని వృద్ధులును బాలురతో సమానులే. అట్టివారికి శబ్దచిత్రణము హృదయ రంజకము.

"ధగధగని దేహరుచి నిగనిగని కుందనపుఁ
దగడు దెగడం జిగురు జిగినెగచు మోవిన్

నగవు నిగుడన్ గురులు పొగరు మగుడన్
నయనయుగళి వెలితామరల మగల మగలై డాఁ
లెగయ మృగనాభి ఘుగఘుగ లెసఁగఁ జామరలు
మగువలిడ మౌళిమణి మిగులఁగ నెలుంగున్.
తెగలుగల వారముల జిగి చెలఁగగాఁ గొదకు
మొగులందగు యానమున గగనచరుడయ్యెన్.

ఇట్టి లయతాళబద్ధములై అనుప్రాస జుష్టములైన పద్యములు లేడెందముల నుఱ్ఱూత లూగించును. అర్థపర్యాలోచనముతో ప్రమేయములేదు.

''అటఁజని కాంచె భూమిసురు డంబరచుంచి శిరస్సరజ్ఝరీ
నిటల ముహుర్ముహుర్ముహుర్లుఠదభంగమృదంగ త
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాపి కలాపజాలమున్
కటకచరత్ కరేణు కరకంపిత సాలము శీతశైలమున్.''

అను పద్యములోని పదములు మద్దెల మ్రోతవలె శ్రవణ తాడితము లగుచుండ బాలురు శ్రుతిపుటముల విచ్చి యాలకింతురు. శిశువులు చిందులు త్రొక్కుదురు.

కాని సంస్కృత హృదయులకు నిది రుచింపదు. ఆహార్య విలాసములతో కనువిందొనరించు సుందరీ సౌందర్యమున కన్న సామాన్యమగు చేలము ధరించిన సుశీల హృదయ సౌందర్యము మనోహరముగదా!

''యేకేచి దర్థగురుతా మవిచిన్త్యవాచాం
ప్రాసైకబద్ధధిషణాః కవయోలిఖన్తి।
తేషాంకృతీ రసికరంజనతాం నయాతి
భూషాంచితా వివసనా వారిణేతు నేవ॥

అని, అర్థ సౌందర్య శూన్య ప్రాసప్రాశస్త్యముగల కావ్యశోభ బహుభూషణభూషిత కోటపీ సౌందర్యమువలె రసికజన హృదయానంద కందము గాదని కీర్తిశేషులు కపిస్థలము కృష్ణమాచార్యులవా రనిరి

ఐనను మహాకావ్యములందు వివిధ చిత్తవృత్తులకును ఆనంద హేతువు లుండవలయునని కవు లట్టి శబ్దాలంకార ప్రచురములను నిబంధింతురు. అంతమాత్రమున నుత్తమ కావ్యత్వ సంపాదనా ధూర్వహత్వము వానికిలేదు. ప్రసిద్ధార్థ పదత్వ రూప ప్రసాదము, పృథక్పదత్వరూప మాధుర్యము సౌకుమార్యము మొదలగు తత్తద్రసాను గుణములగు గుణములతో గూడిన రచననే వ్యక్తమగు, విభావానుభావములతో పరిపుష్టమగు రసమే కావ్యత్వ ధూర్వహము.

''విభావై రను భావైశ్చ సాత్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయ మానః స్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః''

రసోత్పాదన కారణములగు శకుంతలా ద్యాలంబన విభావముల చేతను, ఉద్దీపకములగు చంద్రికాదులచేతను, హృదయగత భావములను సూచించు కటాక్ష భుజవిక్షేపాది కార్యభూతానుభావముల చేతను, స్తంభ ప్రళయరోమాంచాది సాత్విక భావముల చేతను, ఏడాచపలతాది వ్యభిచారి భావముల చేతను పోషింపఁబడిన స్థాయిభావము సహృదయ హృదయముల యందు శృంగారాది రసాత్మకముగ చర్వణా విషయ మగుచున్నది, అట్టిరసము;

''శృంగారః కరుణ శ్శాన్తో రౌద్రోవీరోఽద్భుతస్తథా।
శాన్తోభయాపకశ్చైవ బీభ శ్చేతి తేనవ॥

అని తొమ్మిది తెగలుగ నిర్ణయింపఁ బడినది.

ఇట్టినవరసములకు కొన్నింటికి పరస్పర విరోధము కొన్నింటి కవిరోధముగలదు. వీర శృంగారములకు, శృంగార హాస్యములకు, వీరాద్భుతములకు వీర రౌద్రములకు, శృంగారాద్భుతములకు విరోధములేదు.

శృంగార బీభత్సములకు, స్పృంగార కరుణములకు, వీర భయానకములకు, శాంత రౌద్రములకు. శాంత శృంగారములకు విరోధము.

లన కావ్యమున నొక రసమును పోషింపఁదలచిన కవి. తద్విరుద్ధ రసము నిబంధింపరాదు. నిబంధించిన నది ప్రకృత రసమునకు బాధకమగును. పరస్పర బాధితములై ఏ రస వికాసమును లేకపోవచ్చును.

ఒకవేళ విరుద్ధములగు రెండు రసములను కవి కూర్పదలచెనేని రసములకు విరోధము తొలగించి, కూర్పవలయును.

విరోధము ద్వివిధము. స్థితివిరోధము, జ్ఞానవిరోధము, ఏకాశ్రయము సహింపకుండుట స్థితివిరోధము. ఒక్కనికే వైషయికానురాగము విషయ వైరాగ్యము సమకాలమున కూర్చ రాదుగదా!

మాత్సర్యము త్సార్య విచార్య కార్య
మార్యాస్సమర్యాద మిదంవదన్తు।

సేవ్యానితంబాః కిముభూధరాణాము
తస్మరస్మేర విలాసినీనామ్॥

అని రాగియై కాంతా నితంబమునో, విరాగియై గిరినితంబమునో ఆశ్రయించ వలయునని పక్షద్వయ నిరూపణమున భర్తృహరి.

భిన్నాశ్రయములందు వానిని నిబంధించుటతో నది తొలగిపోవును. జ్ఞాన విరోధము ఒక దాని జ్ఞానము అన్యవిషయ జ్ఞానమును కలుగనీయకుండుట. రెండింటి మధ్య అవిరోధి రసాంతర నివేశముతో నదియు పరిహరింప నగును.

లోకమునందును విరుద్ధ వస్తువులనిట్లు సంధించి ప్రకృత కార్యమును సంఘటించుట గమనించుచున్నాను.

"చెప్తానేనొక సత్యం అందరి జనుల కగత్యం
నిప్పుకు నీటికి వైరం! అది మనకే ఉపకారం! చెప్తా॥

నిప్పు నీటిలోఁ బుట్టిందంట! దానిని జూస్తే దీనికి మంట!
ఆ రెంటికి పొందిక లేదంట! అది ఉంటే మనకే తంట! చెప్తా॥

అదెటయ్యా! అంటే :

కొట్టము గాలిందంటేనూ; నీళ్ళనేవి లేకుంటేనూ;
ఆపై నేనేం జెప్పేను; మిగిలేదంతా బుగ్గేను; చెప్తా॥

తపేలమధ్యా బెట్టామంటే; నీళ్లూబియ్యం బోశామంటే,
అడుగున మంటలు వేశామంటే,కడుపునిండ భోంచేశామంటా

కనుక నేంజెప్పేదేమయ్యా! అంటే :

లోకములో నీ విరుద్ధశక్తుల నొకటన నొకటిని దండించి,
ఒక్కొకపట్టున మధ్యవర్తితో నా రెండింటిని సంధించి,
జగదుపకారం జేశామంటే అదియే తెలివని నే నంటా
చెప్తానేనొక సత్యం అందరి జనుల కగత్యం.

ఇదేవిధముగ కావ్యములయందును రసవిరోధము పరిహరణీయము. అనురాగము సర్వప్రాణిసహజము. అయ్యది ఆలంబన భేదమునుబట్టి నామభేదమును బొందుచుండును. పూజ్య దేవాది విషయకమేని భక్తియని, పుత్రాది విషయకమేని వాత్సల్యమని, మిత్రవిషయకమేని మైత్రియని, స్త్రీపుం విషయకమేని ప్రేమయని వ్యవహరింపఁబడుచున్నది, ఇందు కామినీ కాముక విషయకమైనది శృంగారస్థాయి భావమని, అన్యము కేవల రతి మాత్రమని ప్రాచీనులు నిర్ణయించిరి.

"రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంచితః
భావఃప్రోక్తః తదాభాసా హ్యనౌచిత్యప్రవర్తితాః"

అని ఉచిత దేవాది విషయకమై వ్యంజనాగమ్యమైన రతి భావమాత్రము. "స్త్రీపుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్యః చిత్తవృత్తి విశేషః రతిః స్థాయిభావః", అని పండితరాయలు "తంత్ర సంభోగ విషయక ఇచ్ఛావిశేషో రతిః" శృంగార స్థాయి భావమునకు విద్యానాథుని లక్షణము.

భావప్రకాశమునందు;

కామోపచారస్సంభోగః కామస్త్రీపుంసయో స్సుఖం।
సుఖమానంద సంభేదః పరస్పర విమర్దతః॥
ఉపచారస్తదానంద కారకం కర్మకథ్యతే॥

అని వివరింపబడినది. దీనికి విరుద్ధము వైరాగ్యము.

పండితరాయలు :

నిత్యానిత్యవస్తు విచారజన్మా విషయ విరాగాఖ్యః నిర్వేదః।

అని. కావున శృంగార శాంతములకు పరస్పర విరోధము. దాని నొకచో నిబంధించుట విరుద్ధము అనుచితము. విరోధమును పరిహరించి సమర్థముగ నిర్వహించుట అత్యంత వైదగ్ధ్య విశేషము.

మన యాంధ్రకవితా పితామహుని గంటము ఆ చాతుర్యమును విజయవంతముగ ప్రదర్శించినది.

ప్రబంధకాలమునకు యుద్ధములు మతయుద్ధములు సమసి ప్రజ సుఖభోగలాలసమైనది. పురాణయుగమునందలి ధర్మదీక్ష కృశించినది. పోతన భక్తిప్రబోధ మడుగంటినది. హరవిలాస శృంగారము శ్రీనాథుని నైషధశృంగారము వీథినాటక ప్రభావము పండితపామరుల మెండుగ నాకర్షించినది. రాజాస్థానముల నాశ్రయించిన కవిత సుఖలాలసులు రాజ్యపరిపాలనోద్విగ్నమనస్కులు నగు వారి చిత్తవృత్తి కనుగుణముగ శృంగార ప్రధానమగుచున్నది. ఏ కాంతమున ప్రణయాతిశయమున నేయగుగాక, "జలజాతాసనవాసవాదిసుర పూజాభాజనంబై తనర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమును వామ పాదంబునన్ దొలగన్ ద్రోచిన," కాదు కూడదనక, "అట్లయగు; నాథుల్ నేరముల్ సేయ పేరలుకన్ జెందినయట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే" అని సమర్థించు పరిస్థితి దాపురించినది. ఇప్పుడే యిట్లున్న రాబోవు కాలమూహించిన, పచ్చి

శృంగారము శృతిమించి, రాధికాసాంత్వనాదులు వెలువడి, ధర్మప్రవృత్తి నామరూపశూన్యము గావచ్చునని, నాటి సాహితీ సమరాంగణ చక్రవర్తి కృష్ణదేవరాయలు తలపోసినాడు. ఇప్పుడే అందుకు విరుగడ సమకూర్చకున్న, మానవులకు పెంప వికత తప్పదని గ్రహించినాడు. అనవరతము అతని మానసము నీ సమస్యయే కలవర పరచుచున్నది.

కావుననే, "స్వైరవిహారమునకుఁ బయలుదేరిన పాండ్య రాజునకు వైదేశిక బ్రాహ్మణముఖమున,

వర్షార్థమష్టౌప్రయతేత మాసాన్ నిశార్థమర్ధదివసేయతేత
వార్ధక్యహేతో ర్వయసానలేన పరత్రహేతోరిహజన్మనాచ.

అని బోధించి, లోకమును సంస్కరించినాడు.

కరవాల ధారాకౌశలముననేగాక కవి కలమున గల పట నెంతటిదో ఊచముట్టు ఎఱింగిన వాడుగాన, పెద్దనను ప్రియ మారఁ బిలచి,

"హితుడవు చతురవచోనిధి వతుల
పురాణాగమేతిహాస కథార్థ
స్మృతియుతుడ వాంధ్ర కవితా పితా
మహుడ వెవ్వరీడు పేర్కొననీకున్॥"

అని స్తుతించి, శిరీషపేశల సుధామయోక్తులతో కలిధ్వంసక మగు మనుచరిత్రము కృతి యొనర్పుమని ప్రార్థించినాడు. కలి ధ్వంసకమని కథకు విశేషణము. అతుల పురాణాగమేతిహాస కథార్థ స్మృతియుతుడవని కవికి విశేషణమును రచింపఁబోవు కావ్యము శృంగార ప్రధానముగాక ధర్మబోధకముగ నుండ వలయునని సూచించుచున్నవి. ధర్మపద్ధతి యనిన పెడమోము పెట్టు లోకముయొక్క ప్రవృత్తి తెలియనిదిగాదు. కావున వారు అహమహమికతో గ్రహించుటకు చక్కెరపూసిన చేదు మందును వలె ఈ ధర్మోపదేశమును శిరీషపేశల సుధామయోక్తు లతో గావింపవలయునట. మృదుమధుర వాక్యములను పూత పూసి కాంతాసమ్మితముగ బోధించు కావ్యము రచింపుమని, 'భవచ్చతుర రచనకు రససముంచితకథల నింపు గులుకు స్వారో చిషమనుసంభవమును' జెప్పుమన్నాడు.

ఇంగితజ్ఞుడగు కవి కృతిపతిభావ మూహించినాడు. శఠకోప తాపస ప్రసాదాసాదిత కవితావిలాసము ఫలింపనందులకు దీక్ష వహించినాడు.

"వరణాద్వీపవతీ తటాంచలములన్ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధసుధా ప్రభాధవళిత ప్రాలేయరుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నార్యావర్తదేశంబునన్
బుర మొప్పున్ మహికంఠహార తరళస్ఫూర్తిన్ విడంబించుచున్."

'అర్థశబ్దతో వాపి మనాక్కావ్యార్థసూచనం' అను నాట కోక్తక్రమము ననుసరించి, సూచ్యార్థసూచన యిందుఁ గని పెంగుచున్నది. ఇందు వరూధినీ ప్రవరులు సరసుల హృదయ ముల నాకర్షించు పాత్రలు. అందు వరూధిని, చిన్ని వెన్నెల కందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన సుకుమారి. కులీన. రహిపుట్ట జంత్రగాత్రముల ఠాల్గరగించు విపుల గాంధర్వ మభ్యసించిన కలావతి. ననవిల్తు శాస్త్రంపు మినుకులు వెన్నతో నలవాటైనవి. కనకనగసీమ కల్పవృక్షముల నీడఁ బచ్చరాచట్టు గముల నిచ్చవచ్చినట్టు విశృంఖల విహార మొనర్చునది. పద్మ సంభవ వైకుంఠభర్గ సభలయందు గాన నృత్యముల ప్రదర్శించి వాసిగాంచినది. హయమేధ రాజసూయము లుంకువలిచ్చి ఎందరో వీరికడగంటి విలాస భిక్షకు కాచువారు. ఇట్టి ఈమె శృంగారమూర్తి.

ఇక ప్రవరుడో, నిర్మలధర్మకర్మదీపావరతంత్రుడు; అనారతా ధ్యాపన తత్పరుడు; వరుణాతరంగిణీ దరవికస్వర సూత్న కమల కషాయగంధము వహించి ప్రత్యూష పవనాంకురములు పైకొనువేళ వాయన స్తుతిపరత్వముననేచి, సచ్ఛాత్రుడగుచు నాఁ పగకేగి, యఘమర్షణ స్నాన మాచరించి, సాంధ్యకృత్యము దీర్చి, సావిత్రి జపియించి, సైకతస్థలి కర్మసాక్షి కెరగి, ఫల సమిత్కుశ కుసుమాది బహుపదార్థ తతియు నుదికిన మడుగు దోవతులు గొని బ్రహ్మచారులు వెంటరా, ప్రజల మెప్పులకు పాత్రుడగుచు నిచ్చలు నింటి కేతెంచు నిష్ఠాశీలుడు. వాని చక్కదనము — వైరాగ్యమునఁ జేసి — కాంతసేయు బారకా మినులకు — పూచిన సంపెగపొలుపు మధుకరాంగ నలరువని — భోగ బాహ్యమైనదట, అట్టి పరకాంతా గాంగేయుడు.

"శీలంబున్ గులమున్ శమంబు దమమున్
జెల్వంబులే బ్రాయమున్
బోలంజూచి యితండు పాత్రమని యే
భూపాలు డీవచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనడు నూ
న్యక్షేత్రముల్ వెక్క చం
దాలంబందు నొకప్పుడున్ దఱుగ దిం
టన్ బాఁడియున్ బంటయున్"

అని పరార్థ పరాఙ్ముఖుడు.

"వేధాద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషుచ
తాసు తేష్వప్యనాసక్తః సాక్షాద్భర్గో నరాకృతిః"

ఇట్టి వైరాగ్యమూర్తి ప్రవరుడు శాంతరస ప్రత్యామ్నాయము.

రెచ్చిపోవుచున్న శృంగారమును, ఆభాస శృంగారమును కుదించి శాంతమునకు విజయ ధ్వజమును ప్రతిష్ఠించుట కృతి కర్తృభర్తల ఆశయము. ఆ యభిప్రాయమే స్ఫురించుచున్నది. "వరణాద్వీపవతీ" — అను పద్యమున.

ప్రాలేయరుఙ్మండల హారిణము శృంగారోద్దీపనము. శృంగారమునకు ప్రత్యామ్నాయముగ గ్రహింపఁబడినది. సాత్త్విక ప్రధానమైన శాంతమునకు ప్రతినిధిగ సౌధ సుధా ప్రభలు స్వీకరింపఁబడినవి.

శృంగార ప్రాబల్యము శాంతము మ్రోల మోకరిల్లినది. శాంత ప్రభలు పైకొన్నవి. సర్వము శాంతమయమైనది యని ధ్వనించుటకు "సౌధసుధా ప్రభలచేర ప్రాలేయ రుఙ్మండలీ హారిణము ధవళితమని వర్ణితము.

"ఎవ్వతవీవు భీతహరిణేక్షణ! సుఖంబె నీకగున్. పురంబు పేరు తెరువెయ్యది? తెల్పఁగదవే." అని యర్థించిన ప్రవరుని రూపరేఖా విలాసంబులఁ గాంచి, అక్కమలపత్రేక్షణ నర్మగర్భంబుగా, "ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! ఏకాంతమునందు నున్న జవరాండ్ర నీ నెపంబున బల్కరించు లాగింతయుఁగాక నీవెఱుఁగవే మును వచ్చిన త్రోవ చొప్పు?" అని దోషమారోపించి, 'నీకింత భయంబులే కడుగ నెల్లిదమైతిమె?'' అని తూలనాడి, రిచ్చపడిన యాతనికి తన కులగోత్రాదులు వెల్లడించి, స్వస్థుని గావించినది వరూధిని. ''భూసురకైతవకుసుమశరాసన!" అని హృదయములోని వలపు పట్టియిచ్చునట్లు సంబోధించినది, — "మనసు నుద్దీపించు— నీ మణి భవనమున నాసీనుడయి, మా యాతిథ్యము నంగీకరించుము. మమ్మానంద పఱచుము. కుందనము వంటి మేను మధ్యందినాతపోష్మహతి వడదాకి కందినది. మా ఇల్లు పావనము సేతు, బడలికలువాయ, "కొంత విశ్రమించి చనుమని ప్రార్థించినది. ఎక్కడియూరు కాల్నిలువ కింటికి నేగెదనంచుఁ బల్కెదవు, మీ కుటీరముల కీనందన చందనోత్కరములు ఈ గాంగసైకతములు సరిగావా ? యని యధిక్షేపించినది. ఈ వక్రభాషణములు ఫలింపమి,— "నిక్కము దాపనేల ధరణీసుర నందన యింక, నీవయిన్ జిక్కె మనంబు." అని యుల్లము వెల్లడించినది. "చిత్తజు బారికి నప్పగించెదో, చొక్కపు పూపొదరిండ్లఁ గౌగిటఁ గారవింతువో'', అంతటికిని నీదే భారమని ఆత్మను ధారవోసినది.

అప్పటికిని మనస్కరించని యాహితాగ్నియగు ప్రవరునకు, ''యజ్ఞకోటులన్ బావనుతౌటకున్ ఫలము మాకపుగిళ్ళ సుఖంచుళేగదా !" యని ధర్మసూక్ష్మము వివరించినది. "వెన్నవలెన్ గరంగు నలివేణుల గౌగిటఁ జేర్చు భాగ్యము ఎన్ని భవంబులన్ గలుగు.'' నని, అనితరలభ్య మీ సౌఖ్యమన్నది.

"ఎందే డెందము గందళించు రహిచే నే కాగ్రతన్ నిర్వృతిన్ జెందున్ — ఆ యింపే పరబ్రహ్మము'' అని ఆనందో బ్రహ్మ మటన్న బ్రాబల్కునకు భాష్యము నొనర్చి బోధించినది.

ఇందు ప్రవరాలంబనకమై, తదీయ రూపదర్శనము చేతను, నభోవాహినీశీతలగంధవాహ పరిఖేలన్మంజరీ సౌరభగ్రహణేందిందిరతుందిలకాంతార సంతానముల చేతను, ఉద్దీపితమై ఝణంఝణత్కటక సూచిత వేగ పదారవిందయై లేచుటలచే, తేనడు మల్లలనాడ పూచిన పోకనును బోదియ జేరి తదీయ పదపీకలశాంబుధి వెల్లిగొల్పు విలోకన ప్రభలఁ జూచుటల చేతను, అనుభావితమై వరూధినీ నిష్ఠరతి — ఏకత్రాను రాగము చేత - శృంగారాభాసముగ సహృదయ హృదయ చర్వణా విషయ మగుచున్నది.

ఇట్టి శృంగార విరుద్ధము శాంతము. అయ్యది సంపూర్ణముగ పరిపుష్టమై ప్రధాన చర్వణావిషయ మగుచున్నది. భిన్నాశ్రయములందు రాగ వైరాగ్యములను విరుద్ధ భావములను నిబంధించుటచే విరోధము పరిహరింపఁ బడినది.

ఇందలి వైరాగ్యము ప్రవరనిష్ఠము. అతడు స్వధర్మపరుడు. అత డాకాంక్షించినది బ్రహ్మానందాధి రాజ్యపదము. అట్టివాడు విషయ చపలబుద్ధియై ఇంద్రియ వశుడయ్యేనేని, ఆ పదవికి దవ్వగుచున్నాడు. అతడు విధివిహిత కర్మల సన్యసింపఁ దగదని ఆహితాగ్నియైనవాడు. అతనికి నరణులు దర్భలు ప్రియమైన ట్లన్యములుగావు. స్వర్గాది సుఖములు సర్వములు తుచ్ఛములు, మీసాలపై తేనియలు.

అందుచే "ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగారఁ బైయంచుల్ మోవఁగఁ గౌగలించి, యధరం

జాసించిన వరూధినిని — హా శ్రీహరీ! యంచు పెడమోమై, తదీయాంసద్వయమంటి పొమ్మని త్రోసెను.

అవును. ధీరహృదయులను సతుల మాయలు గలంచునా?

అంతఁబోక, "దయావిహీనుడా! నీ చదువేల కాల్పనా? యని దూషించి, 'వెలిబెట్టరే జాడబులు పరాశరుబట్టి దాశ కన్యాకేళి తప్పుఁజేసి?" అని పురాణ పూరుషుల నుదహరించి, "వారికంటెను నీ మహత్త్వము ఘనమా?" యని నిష్ఠురము లాడి, ఎన్ని టక్కు టిక్కులు చూపినను, మౌనమే సమాధాన ముగా, నవ్వనజగంధి మేని జవ్వాజిపసగ దంబించు నొడలు గడగికొని, ప్రాయశ్చిత్తముగ వార్చి, స్వాహావధూవల్లభుని హవ్యవాహనుని కరుణా కటాక్షమున, ఇనుండు పశ్చిమాం బుధి సేరకయమున్న స్వగృహంబు సేరికొనియె నట.

అట్టి దాన జపాగ్నిహోత్ర పరతంత్రుడు పరధనదార పరాఙ్ముఖుడు. భగవత్పాదాంబుజ ధ్యానరతుడు. విప్రతల్లజుడు, ఆదర్శమూర్తి.

ఇవ్విధముగ నాశ్రయభేదముచే రాగ వైరాగ్యములకు సన్నివేశము గల్పించి విరుద్ధ రసముల పోషించి కృతకృత్యుడై లోకమున కసమానమైన ఆరాధ్యపాత్రను నిరూపించినాడు పెద్దన.

> "కుండలీకృత కోదండ దోర్దండస్య పురస్తవ
> మృగారాతేరివ మృగాః పరేనైవావ తస్థిరే."

ప్రకృత ప్రశంస నీయుడగు రాజు కుండలీకృత కోదండుడని, రాజనిష్ఠముగ నుత్సాహస్థాయి భావమగు వీరమును, శత్రు నిష్ఠముగ భయానకమును వర్ణించిన వీరభయానకములకు విరోధము పరిహరింప బడినదని పండితరాయలు.

శృంగార శాంతములకు విరోధ మనిన, ఇచ్చట శృంగార శాంతపదములతో లౌకికములైన రతిశమములే గ్రాహ్యములు కాదేని రసానుభవము సామాజికుని యందుగాన, రసమెయ్యది యైనను పరబ్రహ్మానంద సధ్రీచమే గానను విరోధ ప్రసక్తియే లేదు.

ఇట్లు పెద్దన రాగ విరాగములను వరూధినీ ప్రవర నిష్ఠ ములనుగా పెంపొందించి కృతిపతి మనోభిప్రాయానుసారము కవితారసమును ప్రవహింపఁజేసి తన యాంధ్ర కవితా పితా మహ బిరుదమును చిరస్థాయి చేసికొన్నాడు.

ఇట్టి కావ్యసారమును గ్రోలి యానందించు శక్తిరక్తులు నేడు కృశించి నశించుచున్నవి. బడులయందు భాషా బోధన గ్రహణముల యందు శ్రద్ధాభక్తు లడుగంటు చున్నవి. సంపూర్ణ ముగ లోపింపక మునుపే వాని రక్షణకు నాగరక సంఘము, అధికార వర్గము, ఉపాధ్యాయ సందోహము పూనుకొని పని వాడు సంస్కారమున కుల్లాసము గల్గింతురని యాశించు చున్నాము.



దృష్టివున్న వాండ్లకు అంధురాలనయిన నాసలహా ఒక్కటి. రేపు నీకు అంధకారం అలుముకుం టుందని అనుకుని నీ నేత్రాలను యీరోజే విప్పారజేయి. అలాగే ఇతర ఇంద్రియాలను కూడా. రేపు చెవిటి వారమవుతామని కోయిల గానాన్నీ, సంగీత మాధుర్యాన్నీ, వాయిద్యాల నాదాన్నీ విని ఆనందించు. రేపు నీస్పర్శజ్ఞానం లోపిస్తుందని యీరోజే నీవు ముట్టుకోదలచిన ప్రతి వస్తువునూ తాకిచూడు. పూవుల పరిమళాన్ని ఆస్వాదించు; అన్నిటినీ రుచిచూడు. ఇంతెందుకు, ప్రపంచం నీకందించిన ఆనందాన్నంతా అనుభవించు. ఇంద్రియాలకు సంపూర్ణంగా పని కల్పించు.

— హెలెన్ కెల్లర్

# నేను

ఉత్పల సత్యనారాయణాచార్య

ఏకవీరను కాకతమ్మను
ఈశ్వరీ శివశక్తిని
హరిహరాత్మక చిదచిదీశ్వర
పరమదైవత శక్తిని.

ఏడుకొండల యేడుగడపై
నేసరేగిన భక్తిని
రాజమన్నరు స్వామిపైనను
రాగరంజిత భక్తిని.

ప్రాకృతాశ్రమ వాటికలలో
బౌద్ధగీతులు పాడితి
ఆరునెలలం గవిని జేసితి
హాల ధరణీపాలుని.

ఆంధ్రజాతిని సువ్యవస్థిత
మైన దానిని జేయగ
భారతార్థము విప్పి చెప్పితి
బాల్యమందున దీయగ.

కాకతీయ ధరాతలేంద్రుల
గణన కెక్కిన దానను
తెలుగుజాతికి తీరుతెన్నులు
దిద్ది తీర్చిన దానను.

మనుమసిద్ధికి మరల పట్టము
మంతుకెక్కగ గట్టితి
ఓరుగంటి ప్రతాపరుద్రుని
యొద్ద తెన్గును మీరితి.

బమ్మెరను శ్రీభాగవతమును
పాలకుర్తిని శైవము
సింహపురి నద్వైతధర్మము
జెల్లుబడి చేయించితి.

కొండవీటి తెలుంగుజేడుల
కొల్వులం దలరారితి
కప్పురపు వసంతరాయల
మెప్పులను గైకొంటిని.

వేమభూపతి బొక్కసమ్మును
వెచ్చపెట్టిన బాలను
తీర్థమార్చితి దక్షిణాధిపు
దేవిడీ వరహాలను.

సంస్కృతాంధ్ర కవిప్రకాండుల
జక్కదిద్దిన దానను
వాణి పినవీరన్న యింటను
వీణ మీటగ జేసితి.

కృష్ణరాయల మదకరీంద్రము
నెక్కి నిక్కుచు బోతిని
దేశభాషల దెలుగు లెస్సని
దీమసంబున జాటితి.

తంజకాపురి గోపురోపరి
ధౌత రంజిత కాంతిని
విజయరాఘవ సాహితీప్రియ
వేద్యమాన జయంతిని.

★

# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న 144 కె. ప్రసూనరెడ్డి, కొండాపూర్, మెదక్ జిల్లా

మూడవ పంచవర్ష ప్రణాళికలో బాలల గ్రంథాలయములు స్థాపించుటకు డబ్బును కేటాయించినారా ?

సమాధానం : రాష్ట్రంలో పిల్లల గ్రంథాలయాలను, నెలకొల్ప డానికి తృతీయ ప్రణాళికలో ప్రత్యేకంగా ఏమీ కేటాయించ బడలేదు. అయితే ప్రతి జిల్లా ముఖ్యపట్టణంలోనూ ఒకటి చొప్పున మొత్తం పదకొండు పిల్లల గ్రంథాలయాలు రాష్ట్రంలో ఇదివరకే ప్రారంభింపబడినవి. రాష్ట్రంలోని అన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయాలలోనూ పిల్లలకొరకు ప్రత్యేక విభాగాలు ఏర్పాటు చేయబడినవి.

ప్రశ్న : 145 కుందూరు వెంకటరామరెడ్డి, మొరిపిర్ల, (వరంగల్ జిల్లా)

వరంగలులో (కాకతీయ) యూనివర్శిటీ స్థాపించునట్టి విషయముగూర్చి తెలుపగలరు :

సమాధానం : వరంగలులో విశ్వవిద్యాలయాన్ని స్థాపించే ప్రతి పాదన లేవీ ప్రస్తుతానికి లేవు.

ప్రశ్న : 146 కె. ఆర్. అప్పలనాయుడు, పండిట్ లుముట్, పెరక్, మలయా.

భారతదేశంలోకెల్లా మిక్కిలి పెద్దదైన నీటిపారుదల ప్రాజెక్టు ఏది ? దానిక్రింద ఎంత భూమి సాగు అవుతున్నది ?

సమాధానం : భాక్రానంగల్ భారతదేశంలోని ప్రధాన నీటిపారు దల ప్రాజెక్టు. ఇది తూర్పు పంజాబు రాష్ట్రంలో వుంది. ప్రస్తుతం ఈ ప్రాజెక్టు నిర్మాణదశలో వుంది. దీనిక్రింద 66,00,000 ఎకరాల విస్తీర్ణంలో నీటిపారుదల చేయడానికి తలపెట్టబడింది.

ప్రశ్న : 147 కె. ప్రసూనరెడ్డి, కొండాపూర్

మన రాష్ట్రంలో అబ్కారీ ఆదాయం ఎంత ? ఏ ఏ జిల్లాలలో యెంతగలదు ?

సమాధానం : ఆంధ్రప్రదేశ్‌లో 1959–60 వ సంవత్సరంలో ఎక్సైజుపల్ల లభించిన ఆదాయం రు. 7,05,28,555-69న.పై.లు జిల్లాలవారీ సంఖ్యలు దిగువ ఇవ్వబడినవి :-

1959 ఏప్రిల్ 1 లగాయతు 1960 మార్చి ఆఖరువరకు ఎక్సైజుద్వారా లభించిన ఆదాయ వివరాలు తెలుపు పట్టిక :

| జిల్లా పేరు | మొత్తం రూ |
|---|---|
| నిజామాబాదు | 966,27.37 . 25 |
| మెదక్ | 685,98,88 . 27 |
| మహబూబ్‌నగరం | 864,54,37 . 09 |
| ఉత్తర హైదరాబాదు | 528,27,05 . 74 |
| దక్షిణ హైదరాబాదు | 632,51,53 . 46 |
| వరంగల్ | 662,15,79 . 65 |
| కరీంనగరం | 922,21,10 . 00 |
| ఆదిలాబాదు | 410,92,72 . 59 |
| ఖమ్మం | 404,58,18 . 22 |
| నల్గొండ | 795,75,29 . 32 |
| శ్రీకాకుళం | 106,54,5 . 61 |
| విశాఖపట్నం | 261,91,4 . 45 |
| తూర్పుగోదావరి | 227,03,8 . 48 |
| పశ్చిమగోదావరి | 536,22 . 49 |
| కృష్ణా | 297,06,3 . 50 |
| గుంటూరు | 109,03,8 . 59 |
| నెల్లూరు | 259,41 . 35 |
| కడప | 678,61 . 90 |
| అనంతపురం | 366,89,9 . 47 |
| కర్నూలు | 259,76,4 . 27 |
| చిత్తూరు | 239 48 . 52 |
| మద్రాసు | 331,4 . 53 |

# వెలుఁగు బాట

మిరియాల రామకృష్ణ



తెరచాటువోలె వెల్తురు మాటువడినది సంజ మూసినది విషాదపుట్లు
ఆ విషాదచ్ఛాయ యటు నిల్చిపోలేదు ఘనతమస్సూచి గ్రుచ్చినది మేన
వ్యథ వడ్డ యెదకు నీశ్వర పదాన్వేషణ కోలని నీటికి దుగ్ధజలధి యయ్యె
దిసమొల కాలరాత్రికిఁ జేల మెప్పుడో కాంతితంతువుల భాస్కరుఁడు నేయు.

అంతదాఁకను బహుళ పక్షాంతరిక్ష చటుల జూటాటవీ జటాపటలకంట
కచ్ఛటాకుటీరక వాటఘటిక తెఱచు కొనుచువచ్చి చీఁకటులు గగ్గోలు సేయు.

2

దిక్కుల మెఱుఁగారు తెక్కలు మసిఁబాఱ పొగమబ్బు పొదరిండ్ల మూలఁద్రోసి
అనిల మాందోళించి యాకులపా టొంద పరిమళాశనము లేబరము సేసి
జలదేవతల కూర్మికల కైశికలు పీడ నిసుమంటుచోట నట్టేటఁగలిపి
వహ్ని నాలుక త్రుప్పుపట్టఁగా నరణి వాసమ్ముగా నిత్రుపాసమ్ము గొలిపి

పృథ్వి గిరగిరతిరుగ గిర్వెట్టి కొట్టి నింగి నోర్మూసి చెపుడు పుట్టంగఁ గట్టి
కాలమహిషమ్ము విసరు లాంగూలమనఁగ నకట! తామసి సృష్టి నల్లాడఁజేయు.

3

మెయిమండి కనులెఱ్ఱనయి దిస్సుదిస్సని యౌచితి వీడు క్రోధాంధుఁబోలె
అంగదచే మాఁడి యంగమ్ము గ్రుంగి ఖడ్గము నెత్రు నాకు ముష్కరునిఁబోలె
ఇంద్రియమ్ముల కీలు నెఱుఁగక కికురింతగని వాగురల వ్రేలు కామిఁబోలె
విముఖుఁడై శుష్కవాదము భుజించుచు నాత్మ దృష్టింపలేని నాస్తికునిఁ బోలె

ఈ తమోగుణమ్ములను ప్రయోగించుకొనుచు వచ్చు చీఁకటి కెదుటఁగన్పడుట కీడు
వా తెరలుమూసి తెప్ప కావడుల కనులు నిలిపి మోయుచు నిరులపుంతలు తరింతు.

4

కునికిపాట్లీ చీఁకటిని కౌఁగిలింపఁగఁ మూసి యెన్నాళ్లు వాపోయినవియో
ఆవులింతలు రేయి మోపి తేనియలకై యెన్నాళ్లు నోర్విప్పియున్న యవియో
మఱపు లీ మఱుసంజ మైనంటి తలవిప్ప గలవంచి యెన్నాళ్లు తలఁచుకొనెనో
స్వప్నమ్ము లీ చీఁకువాలుం దెరలనెత్తి యాఁడ నెన్నాళ్లు కన్నార్పలేదో
ఏ గతిని జూచినను నీ తమోగుణమ్ము మోహటంకారములు సేయ మునులుగూడ
నిజమనోనిష్ఠ భగ్నమై విజితులౌదు రే! యిరులు గ్రమ్మఁగ వెలుఁగు రేక లేక.

5

రేవేయు శిబిరమం దావులించుచుఁగాని వెలుఁగు తాండవమాడ నిలువలేక
క్రుంకుఁ గొండల గుసగుసలాడుచుఁగాని పొడుపుఁ గొండలనెక్కి నడువలేక
కంటకాంకూర శృంగము లెక్కియేఁగాని ఘంటాపథచ్ఛాయఁ గదలలేక
తడిమబ్బు గొడుగులెత్తఁగ వచ్చుచుఁగాని యర్కకేతనమెత్త నరుగలేక
శాస్త్రమతి ముందుఁబడని వాచాలుఁబోలె భవగవేషణ మెఱుఁగని కవినిఁబోలె
కాపురుషుఁబోలె నొక్క తస్కరునిఁబోలె వేయు నిట నట చీఁకటి వెట్టితలలు.

6

ఈ తమోజీమూత మెంత తృష్ణవహించె ఇంత పాతమ్మొనె యీ జడాత్మ
అనిమేష దరహాస మంత యెత్తగునొకో ఇంతలో తానశే యేడ్పు నీళ్లు
ఈ చలిమంటలో నేనొక్క సమిధనా ఇంతగా వణఁకునే యీ భవమ్ము
ఈ యిరుల్ తెరలెత్త నింత కల్లోలమా ఇంతగా మునుఁగునే యీ ఘటమ్ము
కాలమత్తేభగాత్ర నిర్గతములైన మదము లట్టుల నీ యిరుల్ నదములయ్యె
ఈ యగాధము లందు నా యింద్రియములు తేఁటులట్టులు మున్గునో తేలిచనునో.

7

అవ్యక్తసౌందర్య మాలోకనము సేయ మొఱపు వాల్గనులెత్తు మింటియెత్తు
అనురాగఝురగానమాకర్ణనము సేయ వాయువల్లకి మీటు వార్ధిపాట
ఆనందమకరంద మాస్వాదనము సేయ మొగ్గదొన్నెలు నిల్పు పూప్ప పిలుపు
ఆమోదపవమానమాఘ్రాణ మొనరింప పూవెన్నెలలు విప్పు తీవకొప్పు
కనఁగ వినఁగ చేకొనఁగ మూర్కొనఁగ నసఁగ నిరులలోనుండి త్రోపాడి యెగుఁదేరు
నాకుఁగన్పించునా వెల్గురేక లిప్పు డింద్రియాంబుధినుండి త్రోయింతు నుప్పు.

8

నునుసంజగాలివేణువు శ్రుతుల్ వినఁగనే కోయిలపాట నింగులకు సాగు
వెఱిచీఁకటుల పేరు వినినంతనే గ్రుడ్లగూబలు కనులలోఁ గూరుచుండు
గిఱికొన్న శశిరేఖ గిరినెక్కఁగనె చకోరికలు కోరికలతో రెక్కలార్చు
తేయిరుల్ కనులెత్తి లేవంగనే తీతువులు గొంతునెత్తు కీడులు తలెత్తు

పసిఁడిరాయంచవలె మీనబాలవోలె పలుకోవలె వెలుఁగు పరాలు రాల
మూలకాకమ్ము వలె కొంగవోలె నిరులు క్రుంగవలె మన్ను మిన్నులకుం గలంగి.

9

ఇరులల్లు విష్ణు వాగురకాల కాలాగ్ని నాలుకల్ రుచులెత్త ఫాలమెత్తి
పతనమైపోవు నంబరవేణి నిలఁబెట్టి చాంద్రీలతలు వాలు జడలఁగట్టి
ముకుళించుకొన్న కాలిక మోము వికసింప మెయినుంచుకొని నీడ మెలఁగనిల్పి
పొగచూరు కాటిలో నిగిలించు గాలిదయ్యాలపై తాండవమ్మాడి యాడి

అలసనాతన తనురోచి నవఘుళించి పొలయు నేతెంచు వెల్గుల కలసిపోయి
మచ్చరములేని యెదతోడ మచ్చలేని తెలిపులుంగట్టు లెగిరిపోవలతు నేను.

10

కనుకట్టు గాఁజాలు కరములూచినఁ జాలు ఋతుమంజరుల పూలు రేకులెత్త
ఎఱనెత్తుఁ గనువిచ్చి చిఱుచిత్తుమనఁ జాలు నిరులుండలేక రాతిరులఁ జేర
చినచూపు మెఱుఁగెత్తి చెవినూది ననుజాలు మబ్బు జాలుపులెత్తి మడుఁగులెత్త
మునివ్రేలు చెంపఁజూచినఁ జాలు నిలువంగఁ జాలక మంచు సంజలకుఁ జేర

చాయగ హసింప స్వప్నఝుంఝులు నశింప సప్తకళలెత్త తొలుసంజ సుప్తి విడువ
ప్రాగ్గగనదిగ్గజంపు పెంపారు దంత కాంతివలె వచ్చు వెల్గు నా కనుల కగునె.

11

చుక్కల తలకెత్తు చొక్కపుఁ గడలిచే గుండెలు పూలముగ్గుల వెలుంగ
తమ్ముల కులికించు తుమ్మెద ఱెక్కతో గుండెలు పూలరేకులుగ విరియ
మల్లెల మెయిదాల్చు వల్లుల నవ్వుతో గుండెలు పాలనిగ్గులను నిండ
వెన్నెల మొలకెత్తు క్రొన్నెల చిన్నెమై గుండెలు పాలవాఁగులుగ పొంగ.

తలకు ఱెక్కకు మెయికిని మొలకుఁ బట్టి నా తనువసన మట్లున్న నల్ల నిరుల
నూడ్చి శివుని దేహమువోలె నొప్పు తెల్ల వెలుఁగు దుప్పటమ్మునకె నే నిలిచిపోతి !

12

ఒక వెల్గు పొడుపుఁ గొండకు రాగ మొగఁబోయ నర్కకాంతము చూపు లరుణమగును
ఒక వెల్గు గుండెవత్తికి నంట శశికాంత మశ్రుతారాధార నార్ద్రమగును
ఒక వెల్గు రాకకై యుడుకాడి రాగాగ్ని పొగఁబోలు నిరుల లోనగు చకోరి
ఒక వెల్గు కడలి యాత్రకుఁబోవ విరహ ఝుంఝుల బోరుమని యేడ్చు చక్రవాకి

ఖండితలు వోలె నభిసారికలును విప్రలబ్ధలును ప్రోషితలువోలె లాలస మెయి
రాలు పుఱుఁగులు వెలుఁగుకై ప్రాణమెల్ల పట్టుకొనినట్టు లూహింతు పవలురేలు !

13

పొలిమేర త్రుప్పు మబ్బులు మూఁగ నేమౌను వజ్రదీధితుల యంబరములుండ
అలనల్ల కాలముద్రలు సోఁక కగ్గునే రజతాద్రిసితశేఖరమ్ములుండ
చలికారు సంజమంచులు వడ్డ చిలుమౌనె మేరుపర్వత కాంతిధారలుండ.
పెనుగాలి చీఁపురెత్తిన ధూళి బ్రుంగునే నందనారామ గంధమ్ములుండ.
నిత్యమై నిల్చు వెల్గది. నేను నేను. దివ్యతకు కత్తి నేను. ముదిమికి గుత్తి
నేను. చేఁదుగుండెల మిత్తి నేను. మృత్తి కావిలీనమై వెల్గునై పోవఁగలనె.

14

ఋతురాజ శుద్ధాంత మెన్నిరంగుల క్రొత్త చేలమ్ము లూడ్చివైచినదో యిటులె:
అంబరశ్రీవేణికవగుంఠనములైన సాంధ్యరాగము లెన్ని చనెనో యిటులె
మునిమాపు గళము జార్చిన వెన్ని మెఱుఁగారు జిలిబిలి చుక్క జాబిలి సరాలో!
ఏడురంగుల పైఁట లెన్ని మాటినవో శ్రావణ సంధ్య వక్ష మిప్పటికి తడిసి.
కడకు నేనొక్క రాగమ్ము నొడలినుండి కడపలేనైతి సౌర పుల్కలకు నోడి
ఇంద్రియమ్ముల చెఱయుచ్చులేమొ కాక ఇరుల మీసమ్ములేమొ నా కెదురునిల్చు.

15

దివ్వెపండుగకు భీతిలిపోయి కాఁబోలు సగమయి కృష్ణపక్షమ్ముఁజేరె
భోగిమంటలకు గొబ్బున వేఁగి కాబోలు చెమరించు కొఱకచ్చు చివరఁజేరె.
శరదిందు కాంతిపాశముచేత కాఁబోలు అబలల కైశికలందుఁ బడియె.
ధర్మధేనువుఁ జూడఁదగలేక కాఁబోలు వాలమ్ము నంటి దెబ్బలకు నోచె.
కన్నె ముగ్గులలాగు సంక్రాంతి తేరి కడలిపోవుచుఁ గాఁబోలు కడలి దూఁకె
ఆర్గు రరులకు నడుమ నల్లాడు నన్ను చూచెఁ గాబోలు చేరె నాచుట్టు నిరులు.

16

హిమువర్షమునకుఁ గంపించిపోవుచునుందు నంబరాంతర తిమిరంబు నందు
తిమిరంబులో ప్రవాసముసేయు నా కంఠ మౌనమ్మునకు మౌనమూని యేడ్తు
శిశిర మౌనమునఁ జొచ్చిన నేను గళమెత్తి పాటమరింపని పాటఁ బొగులుచుందు
పాటమరించిన రాగమునుగాంచి గొంతెత్తి చీఁకటిమేనిచే సిగ్గుపడుదు
ఇటులె నాకుగాదులు వచ్చునిటులె పోవు భ్రమరమట్టులు పికనుట్లు రాగరేఖ
జీవితంబెల్ల కృతిగ నర్చించుచుందు ఏది నాకిఁక వెల్గు యీ యిరుల నడుమ.

17

సత్కార్యమునకు బిచ్చముతెత్తి యెగవేసి పాఁతఱన్ దిగఁబోయువాని వ్రేళ్లు
పగవట్టి పరపాదపథపాతముగ ముళ్ళ పల్లేరులఁ బోయువాని కాళ్లు
తనముక్తికై లోకమును గిఱ్ఱుమని త్రిప్పి తేనెమాటల నవ్వువాని బొమ్మ
ముడివడ్డ తన వెట్టి సడలించుకొనుటకై ప్రజగుండె వడలించు వాని యెమ్ము.

తినుచు క్షుత్పాశబంధముల్ త్రెంచుకొనుచు తిమిర భీభత్సరసవిలీనముగ నాడి
నరకదుందుభులోయన మొరయు నక్క కూఁతలను మెచ్చియేమొ తగ్గును వెలుంగు.

18

ఒకమాయ కనుమూసెనో నేను కరదివ్వె లేనిపాంథుని బోలెఁ గానఁబడుదు
ఒకయాసు ముసురయ్యెనో నేను మక్షికా వృతవత్సమును బోలె క్రిందుపడుదు
ఒకమోహముఱ్ఱాడెనో నేను నునుఁబట్టుఁ జిలుక వోలిక సుప్తి చెఱను బడుదు
ఒక బానిసనె యైతినో నేను బోయవా నింటిపుల్గును బోలె మంటఁబడుదు

నా వివేకపుఁదడియూఁక లేవెలుంగు రవల రాఁజి రగులుకొని రాగమోహ
తామసీఘటాంతరపుఁ జిత్తడుల నెల్ల నావిరులఁజేసి వెల్గులో నాపుటెపుడొ.

18

చదువెల్లఁ గసటు బూడిదవోయు జడత వోఁ గాఁఖాలు కాకిచేఁ గఱపఁబంచి
భువినెల్ల తనయాట బొమ్మగాఁ జేసికొం చూరేగు నిరుల సంభోధి ముంచి
తిమిరాద్రి శృంగభంగముగ నూఁదరవెట్టు పొగమబ్బుమంచు కొమ్ములకు మొత్తి
ముకురమ్ము నిల్పి పృథ్వికిఁ బరిష్కృతి సేయఁ బురుహూతుపురివైపు కరములెత్తి

రశ్మి తెరచాటువీడి నేత్రములు విరియఁ బఱుపఁ దచ్ఛ్వాస మొక యుషఃపవన మాత్మ
పత్రశయ్యాంతరమునందుఁ బవ్వళించు శిశుపు కనువిప్ప నాదాభిషిక్తుఁ జేతు.

**20**

కరసహస్రములున్నగద చించఁదరమౌను మునుచీఁకటి రచించుకొనిన కృతులు
ప్రత్యూషరాగవారాశి యుండినఁగద చెఱిపెద నిరుల కుంచెల వికృతులు
వర్ణప్రతోద శబ్దములున్నఁగద తోలఁగల నింద్రియాశ్వవర్గముల రథము
సంజపూచికలు హస్తమునఁబట్టినఁగద తుడిచెద గుండెలో దొరలు రజము

ఉదయనగ కిరణఝురము లురలినఁగద హృదయసైకత చిరచితా రిక్తసుప్త
శిథిల శీర్ణమనోరథ శిలల నెల్ల కలుపుకొందు నానంద సాగరమునందు.

21

ఎఱనెఱ్ఱఁబడువెల్గు — ఇరులూడ సమచక్ర పరివేషమటు చుట్టువాఱు వెల్గు
ఇరుగడల్ కోనువెల్గు — ఇరులేడ్వ కరకశా కంపనంబటు కాంతిగాఱు వెల్గు
గిరివాహినుల వెల్గు — ఇరువోడ దిక్పాల నిజభుజధ్వజమాడ నిల్చు వెల్గు
తరువెక్కి దిగువెల్గు — ఇరులూగ ఖగపక్ష తాళవృంతాలఁ గదల్చు వెల్గు

అడుగిడినదేమొ మదియందహంత నల్గు అంతరంగాన సంకల్ప మవతరించు
మొక్కవోవును కలుపులు బుద్ధియందు చిత్తమున నేదొ పరమార్థ చింత మొల్చు.

22

అదె తుషారధ్వజమ్మవరోహమగుచుండె ఆశాపతాకలల్లాడసాగె
ఇదె నిశాయవనిక వదిలి జాఱుచు నుండె పూర్ణప్రభాత నూపురము మ్రోగె
అదె తమోనిస్వన మ్మణఁగిపోవుచు నుండె శ్రుతిపీఠులందు నోంకృతులు సెలఁగె
ఇదె సుషుప్తిద్వారమిఁక మూయఁబడుచుండె సంతతానంద దర్శనము కలిగె
ఆత్మ శిశువున కమృతస్నానాభిషేక మెపుడు తలపెట్టఁబడెనో యెల్లపుడె పోదె
కానఁబడకుండ శత్రుసంఘాతమెల్ల కానఁబడియుండ కాంతి సంఘాత క్షితి.

23

సుడిగాలి కనులలోఁబడి గర్వమును జూప కామాంధకారమ్ము కదలిపోయె
పెనుముల్లు మెడమీఁదఁ గనుమూసి నిదురింప రాగాంధకారమ్ము సాగిపోయె
కోనకొండ గుండెలో గుసగుసల్ వో నేగె మోహాంధకార మేడ్వులఁ దపించి
పొగచిమ్ము సిగమీఁది కెగఁబ్రాకఁగా నేగె క్రోధాంధకార మూర్చ్వల నిగిడ్చి
ఇంతలై యంతలై వెల్గు లిగురుకొనఁగ మాధవ పదధ్వనులు లేచు మార్గమందు
కోకిలము నందుఁబోలె నా గొంతునందు నదము లెత్తెను ప్రణవప్రణాదలహరి.

24

భావరథ్యల యారభటి మొదలొక్కన రక్తధునిమీఁద వెలుఁగు వంతెనలు లేచె
గళరోదసికి నూహాగానమ్మొలయ నోష్ఠ కచ్ఛపి వెల్గు తీగలు నటించె
రక్తాబ్ధి క్రింద సిరాభుజంగములూఁగ ననిలభుక్తి వెలుంగుటలలు పంచె
మస్తిష్కమకుటంబు మణులింద్రియంబులు తళుకొత్త వెలుఁగుసొనలు రహించె
చిరతమఃపథయాత్రలోఁ జిక్కుపడెడు కనులఁ జిన్నారి వెలుఁగురేకలు వెలారె
అడుగు ముందుకుఁ బడసాగె నడుగునందు పడె నిరులు 'నేనెవ'రని నన్నడుగుకొంటి.

25

సందేహభరము దుస్సహము గాకుండుట కొనగూడె తలచుట్టుకొను వెలుంగు
ప్రశ్నసౌధము మోత పడకుండ నుత్తర ద్వారాన దర్శింపఁబడె వెలుంగు
సంసారఫలము నిస్సారమై చనకుండ నాత్మాంకురము పెంచినది వెలుంగు
దుఃఖకంటకలతల్ త్రోవలోఁ బడకుండ ఆలోకముల నిల్పినది వెలుంగు
భయము లేకుండ సలఁపుల బావుటాను మెడకు పైనిడుకొని వెల్గు మేడ పైకి
మెట్టుపై మెట్టుగా నెక్కి మీఁదు నూడ పదము లెత్తించినది — స్థితప్రజ్ఞ తోడ.

26

రోమకూపము లవరోహించి యెవ్వరో స్వేదపంకము లాగివేసినట్లు
నఖచంద్రరేఖపై నల్లఁగాఁ గట్టిన మచ్చ నెవ్వరో రూపుమాపినట్లు
పక్ష్మాంచలములు విప్పారఁగా నెవ్వరో అచ్చ కాటుక రేక నలఁదినట్లు
శ్రవణవేణుముఖమ్ము రవళింప నెవ్వరో అధరమ్మునకు గాలి నలమినట్లు.

మానసక్షేత్రములఁ ద్రవ్వి మానికముల నెవ్వరో తీసి దండగా గ్రువ్వినట్లు
భావలహరులు ప్రాక్తనభవము నుండి పెల్లగిలినట్లు తోపించె వెల్గు నాకు.

27

కష్టపాతాళ నిష్కృతిమరీతి యెఱుఁగక యేడ్చు నాచేయి పైకీడ్చినట్లు
భవసముద్రతరంగపాశబంధములందు ఈఁదు నన్నొడ్డ కెక్కించినట్లు
మోహఫేనపిపాస మూతి విచ్చెడు నన్ను శివజటాధునియందుఁ జేర్చినట్లు
పతనభీతిని భయంపడు నన్ను పురుషోత్తముని పదమ్మూనఁగా ననిపినట్లు.

త్రిగుణ సోపానముల నెక్కి తిరిగి దిగక బ్రహ్మ సారూప్య సౌధదీపముల వెలుఁగు
కనుఁగొనఁగ నేను భ్రూమధ్యమునకుఁ గనుల నెత్తుకొని నిల్చిచూడ కన్పించె నాకు.

28

సుఖదుఃఖభోగవస్తువు పోలె నున్న నా దేహమ్మునందు నా కిహ తీఱ
మిడుతవోలిక నున్న మృత్యువు నా దేహమున వ్రాలి నిజదేహమును దొఱంగ
ద్వారముల్ వలె నున్న తనురంధ్రములఁదూఱు తామసి తెలఁబోయి తలఁగి పోవ
కాళరాత్రిని పొంగు కడలి పోలిన మానసమ్ము ప్రత్యూషహర్షమ్ము నొంద

వచ్చు వెలుఁగుల లోపల విచ్చు నేను వెలుఁగు కంటెను వెలుఁగుకై వెదకు కొనఁగ
ఊహాలోకపు టంచుల నుండి చూడఁ జూడ నా నీడ నొక వెల్గుజాడ తోఁచె.

29

తెలిదమ్మి పూలదండలువోలె మెడవ్రేలు చెలువంపుఁజూపుగుంపులు తలెత్త
చిలుకరించిన మిఁగడల పెరుంగులువోలె నెలనవ్వు తెలిపువ్వు లెదురు సూడ
కలువపూమొగ్గరేకల కొలంకులు వోలె పులకించి కోటియంజలులు లేవ
తొలిమబ్బు నీట బారలుసాచు సెలయూటవలె శ్రుతుల్ విన శబ్దములు ధ్వనింప

దుఃఖవాసనాపాశనిర్ధూతశుద్ధమాత్మ పరమాత్మలో నైక్యమై వశింప
భాస్కరుని బోలె నొక వెల్గుబాట నాకు సచ్చిదానంద భావదర్శనము నిచ్చె.

30

ఆనందగీతములోని వర్ణములతో ఇంద్రియధనువు శోభించుదాఁక
ఆనందనాదములోని రాగములతో చిత్తవీణాతంత్రి చెలఁగుదాఁక
ఆనంద పుష్పములోని వాసనలతో భవలతావీథి యింపారుదాఁక
ఆనంద కావ్యములోని శబ్దములతో శ్రుతిశిలాహృదయమ్ము మ్రోగుదాఁక

భవములోఁజొచ్చు సుఖరసాభాసలట్లు ఎపుడెపుడు చీఁకటులు వచ్చు నపుడె యపుడె
విశ్వరూపమహఃపుటి విచ్చు వెలుఁగుఁ గోరి యానందసబ్రహ్మచారి నగుదు.



# ముసలమ్మ కట్ట

బత్తుల వెంకటరామిరెడ్డి

ఆంధ్రప్రదేశ్‌లోని అనంతపురం జిల్లాయందు దేవరకొండ అను చోట ఒక పెద్ద చెఱువు కలదు. దానిని విజయనగర పాలకుడైన బుక్కరాయల మంత్రి చిక్కప్ప అను నతడు త్రవ్వించి, దానికి ఇరువైపుల రెండు గ్రామములను కట్టించి ఒకదానికి తన రాజుపేర బుక్కరాయ సముద్ర మనియు, రెండవదానికి రాణిగారి పేర అనంతసాగర మనియు పేర్లుంచెననియు, నాటి అనంతసాగరమే నేటి అనంతపురమనియు జనుల వాడుక. ఆ చెఱువు కట్టక్రింద ఆ రెండు గ్రామాలకు మాగాణి కలదు. ఆ గ్రామాల ప్రజలు ఆ చెఱువు నీటితో రెండుకార్లు పైర్లు పండించుకొని సుఖంగా కాలం గడుపుతూ యుండేవారు.

ఒక యేడు శ్రావణమాసంలో వర్షాలు విపరీతముగా వచ్చి, వంకలు, వాగులు ఏకమై పారినవి. చెఱువు నిండి నురవలు వెదలునట్లు పారసాగినది. ఆ ఉరవడిచూచి ప్రజలకు చెఱువుకట్ట తెగునని భయము పుట్టింది. చూచుచుండగనే ఒకచోట చెఱువు కట్ట సందువిడిచింది. అందుండి నీరు విశేషముగా బయటికి వస్తున్నది. కనుక ఆ చోట కట్ట తెగునని ప్రజలు ఆందోళన పడసాగినారు. కట్టతెగిన మొదట గ్రామములో ఒక ఇల్లుకూడ మిగులకుండ ఊడ్చుకొని పోతుంది. అందువలన అందరూ విచారపడుచుండిరి. అంతలో ఆ గుంపులోనున్న ఒక చిన్న అమ్మాయికి పైనుండి "నేను గంగమ్మతల్లిని ! నాకు బలి కావలయును, మీలో ఒక ముత్తైదువను నాకిండు ; లేనిచో మీ వూరు దక్కదు" అంటూ అరవసాగింది. ఆ మాటలు విన్న ప్రజల విచారమునకు మేరలేదు. ప్రాణమున్న ప్రతివారికి తీపి. చూచి చూచి నిండు ప్రాణమును యెవరు పోగొట్టుకొందురు ?

ఆ గ్రామంలో బసిరెడ్డి అను రైతు ఉన్నాడు. అతని చిన్న కోడలు ముసలమ్మ చాలా ధర్మాత్మురాలు, న్యాయబుద్ధి, భగవద్భక్తి కలది. ఆమె ఆ జనముయొక్క దుఃఖమును చూచినది. తన ప్రాణములనిచ్చి గ్రామమును కాపాడవలెనని నిశ్చయించినది. తన ఉద్దేశమును అచటి ప్రజలకుచెప్పి వారి భయం పోగొట్టింది. ఆమె ధైర్యానికి ప్రజలంతా తెల్లబోయారు.

ముసలమ్మ వెంటనే ఇంటికివెళ్ళి స్నానముచేసి, చలువగుడ్డలు కట్టి, పసుపు కుంకుమ ధరించినది. తన ఉద్దేశమును తెలుసుకొని దుఃఖించుచున్న బంధుజనులకు నచ్చచెప్పినది. ఇంటిదేవునకు అత్త మామలకు, భర్తకు మ్రొక్కి వారి సెలవు తీసుకొన్నది. ఒక పళ్ళెమున టెంకాయ, పూలు, నిమ్మకాయలు, పసుపు, కుంకుమ, తాంబూలము తీసుకొని చెఱువు దగ్గరకు వెళ్ళింది. ఊరివారంతా కంట నీరు పెట్టుచు ఆమెవెంట వెళ్ళారు.

ముసలమ్మ గండిపడినచోట గంగాభవానిని పూజించి ఆ గండిలో కూర్చున్నది. చుట్టునున్న ప్రజలకు నమస్కరించి తన పైన మట్టి కప్పవలసినదిగా కోరింది. ఆమె కోరిక ననుసరించి ప్రజలందరు మన్ను, రాళ్లువేసి గండిపూడ్చి కట్టపెట్టినారు. అంతలో వానకూడ నిలిచిపోయింది. ప్రజలందరు ముసలమ్మను తలంచుకొనుచు కన్నీళ్లతో ఇండ్లకు వెళ్ళినారు.

ఆ గ్రామవాసు లామె జ్ఞాపకార్థము ఆ చెఱువుదగ్గర ముసలమ్మ బలియైనచోట ఒక కట్ట కట్టి "ముసలమ్మ కట్ట" అని నామకరణము చేసినారు. ఆనాటినుండి వారు ప్రతి సంవత్సరం పొలకరికి చెఱువునిండిన వెంటనే గొప్ప ఉత్సవముతో, మేళ తాళములతో ముసలమ్మకట్ట వద్దకు దానపుపండ్లు తీసుకొనివచ్చి, ఆమెను పూజించి, తరువాత వ్యవసాయ కార్యములకు పూనుకొను చుందురు. బుక్కరాయ సముద్రములోని చాలామంది ప్రజలు తమ బిడ్డలకు 'ముసలయ్య' 'ముసలమ్మ' అను పేర్లు పెట్టుకొని ముసలమ్మను జ్ఞాపకము చేసుకొను చుందురు.

ప్రజాక్షేమమునకై ప్రాణత్యాగము చేసిన ముసలమ్మ ధన్యజీవి. నాటికి నేటికేగాక యేనాటికైన ఆమె మనకు స్మరణీయురాలు. ★

# ఉగాది

"కమ్మిశెట్టి"

కాలం ప్రసవించిన మరోపాడు
కళ్లు విప్పుతోంది నేడు
నవ వసంతశైశవప్రాంగణాన
నవ్వులు పువ్వులొలికిస్తుంది చూడు——
వికసించే నవవత్సర
సుందర వాసంత విభాతం
పులకించిన ప్రకృతి ప్రత్యూషమున
పలికిస్తోంది మధుర సంగీతం——
శైశిర వృద్ధాప్యంతో కృశించిన
శార్వరి గుండెల్లో
మరణగీతం మ్రోగింది నిన్నటి
చివరి ఘడియల్లో——
మున్నూటా అరవై రోజులు సహచరించి
పూర్ణజీవితాన్ని వ్యాఖ్యానించి
మౌనంగా వెళ్ళిపోయిన శార్వరీ ప్రియతమా !
ఏనాటికీ నిన్ను మరచిపోలేను సుమా !
ఎందుకో నాలో ఈ ఉగాదివేళ
రేగుతోంది సంశయాల హిందోళ——
"ఏమున్నది ఇందులో వింత
ఈలోకపు తీరే ఇంత !"
అన్నట్లు మహర్షుల్లాగా
చూస్తున్నాయి నాకేసి జాలిగా
తెలిమబ్బుల నవ్వులతో
వినీల విశాలాంబరం——
ఫేనదరహాసాలతో
అగాధగభీరార్ణవం——

# స్వాదు వేదన

దాశరథి

[విఖ్యాత ఉరుదూ మహాకవి అసదుల్లాఖాన్ గాలిబ్ గజల్లకు తెలుగు అనువాదము.]

సాంధ్యకాల రక్తారుణచ్ఛటల గాంచ,
నీ వియోగాన కుమిలి చింతించు నాకు
పూలతోటల సైతము ముమ్మరముగ
వహ్ని కురియుట జ్ఞప్తికివచ్చె, సుదతి !

ఎన్నివిధముల సౌఖ్యములున్న గూడ
వలపువెజ్జీని తగ్గింప గలుగవయ్యె
పాన పాత్రపైగల నీలవర్ణమణులు
చిరుతపులి మచ్చలట్లు భీకరములయ్యె

నాడెపుడో పోయినట్టి ధనమ్ము తలచి
గర్వమును పొందెడు దరిద్రు కరణిగానె
నాడె మానిన ప్రణయప్రణముల పూర్వ
రక్తిలత్వమ్మునెంచి గర్వపడువాడ

వలపుపిచ్చియనెడు పానశాలావిశా
లతను గూర్చి ప్రశ్నలడుగబోకు,
దానితోడ పోల్చ ధారాధరపథంబు
చెత్తపారవైచు చిన్నిబుట్ట.

వాన చినుకుల మ్రింగగా వాగులోని
ప్రతి తరంగము మొసలియై వాయి విచ్చె
శుక్తిలోజేరి చినుకులు మౌక్తికమ్ము
లగుట కెన్నొ యాటంకము లావహించు.

వలను పన్నువారిపై వలపూనిటి
గనుక ఎగిరిపోవగలిగి కూడ
వలను చిక్కినాను బంధింప బడినాను
బందివోలె నెంతొకుందినాను.

ఆమె ఉంగరాల అలకలు వలపన్ని
నన్ను ఉచ్చుపెట్ట నున్నవోయి,
దైవమా ! మదీయ జీవిత స్వాతంత్ర్య
వైభవమ్ము భంగపడగనీకు.

మరలి సందేశహార ఉత్తరము తెచ్చు
వరకు వేరొక లేఖను వ్రాసి యుంతు,
పలయన నాకు తెలియును బాల యెట్టి
పాటి ప్రత్యుత్తరమ్మును పంపగలదొ.

ఉదరమేడిపించు హృదయమ్ము బాధించు
నెంతకని రుదింతు నేమిసేతు !
పిలుపడిన యెడల పెల యిచ్చి పిలిపించి
పద్ధువారల నియమించ దలతు.

అదిగొ ! ఆమెగూడ అనసాగినది నన్ను
"సిగ్గువిడిచె" ననుచు, "చెనటి" యనుచు——
ఇద్ది తెలిసియున్న ఇంతగా నాయిల్లు
గుల్లగుల్ల చేసికొనకపోదు.

త్రోవబోయెడి నూత్న పాంథుడను నేను,
పరుగులిడు ప్రతివానితో నురుక జూతు
మార్గదర్శకు డెవ్వడో ? మార్గమేదొ
యెరుగగాలేదు ? నే నింత వరకుగూడ.

దివ్వె వెలుగ గోరుదురు రాత్రి జనులెల్ల,
దానియంతట నదె దగ్ధమైన నేమి
సేయజాలుదు ? రట్లె నా చింత నన్నె
చంపగా మిత్రులేమి గావింపగలరు ?

★

# పత్రికా ప్రతినిధుల "ఆంధ్రదర్శన" పర్యటన

హైదరాబాదు, విజయవాడలలోని కొందరు పత్రికా ప్రతినిధులను 1961 ఫిబ్రవరి నెలారంభంలో ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని ముఖ్యమైన ప్రాజెక్టు స్థలాలకు, అభివృద్ధి ప్రాంతాలకు ఇతర దర్శనీయమైన స్థలాలకు రాష్ట్ర సమాచారశాఖవారు పర్యటనకు తీసుకొనివెళ్లారు. గత నెలలో రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేసిన ఒక నూతన పథకం క్రింద ఈ పర్యటన కార్యక్రమం ఏర్పాటు చేయబడింది. పాత్రికేయుల బృందం 1961 ఫిబ్రవరి 6 వ తేదీన హైదరాబాదునుంచి రైలులో బయలుదేరి విజయవాడ వెళ్లారు. అక్కడ రెండురోజుల పాటు వుండి కృష్ణా బరాజును, పారిశ్రామిక ఎస్టేటును, ఇంకా ఇతర పారిశ్రామిక సంస్థలను, అభివృద్ధి కేంద్రాలను సందర్శించారు. వారు గుడివాడకు వెళ్లి షుగర్ ఫ్యాక్టరీని, గన్నవరం వెళ్లి గ్లాసు కేంద్రాన్ని కూడా సందర్శించారు. తరువాత విశాఖపట్నం వెళ్లారు. అరకులోయ, మాచ్‌ఖండ్‌లను సందర్శించి ఫిబ్రవరి 14 వ తేదీన విమానంలో హైదరాబాదుకు వచ్చారు. విశాఖపట్నంలోని అనేక పారిశ్రామిక సంస్థలను అక్కడికి చుట్టుప్రక్కలవున్న గ్లాసు కేంద్రాలను వారు చూశారు. అరకు బహుళార్థసాధక ప్రాజెక్టు నిర్వాహణను, మాచ్‌ఖండ్ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టువద్ద జరుగుతున్న అభివృద్ధి పనులను వారు చూచారు.

రెండురోజుల విరామం తరువాత పాత్రికేయుల బృందం తిరిగి ఫిబ్రవరి 16 వ తేదీన ఎక్స్‌ప్రెస్ కోచ్‌లో బయలుదేరి నాగార్జున సాగర్ వెళ్లారు. తరువాత శ్రీశైలం జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు స్థలం, గిద్దలూరు, కర్నూలు, తుంగభద్ర ప్రాజెక్టులను సందర్శించి 20 వ తేదీన హైదరాబాదుకు చేరుకున్నారు.

ఈ పన్నెండురోజుల పర్యటనలో ఈ పత్రికా ప్రతినిధులు ఎన్నో కొత్తకొత్త విషయాలను తెలుసుకొనగలిగారు. ఇటువంటి పర్యటనలనే మరికొన్నింటిని ఏర్పాటు చేయటానికికూడా తలపెట్టబడినది. పాత్రికేయుల బృందం పర్యటనకు బయలుదేరనున్న సందర్భంలో, రాష్ట్ర ప్రణాళికా సమాచార శాఖల మంత్రి వారికి ఇచ్చిన సందేశంలో ఇలా అన్నారు:—

"గత సంవత్సరం సమాచార పౌరసంబంధాల శాఖ పునర్వ్యవస్థీకరణ గురించి నార్ల వెంకటేశ్వరరావు కమిటీ సూచించిన ముఖ్య సిఫార్సులపై తీసుకున్న నిర్ణయాలను వెల్లడించటమే గాక, ప్రభుత్వం మరికొన్ని నిర్ణయాలనుకూడా ప్రకటించింది. పత్రికలకు వార్తలు పంపేముందు ముఖ్యమయిన ప్రాజెక్టుల గురించి సమగ్రమయిన సమాచారం తెలియడానికిన్నీ, ప్రభుత్వ ఇబ్బందులను కూడా అక్కడ పరిస్థితులను చూసిన మూలకంగా అర్థం చేసుకుని సానుభూతితో వ్యవహరించడానికి వీలుగా ప్రధానమయిన ప్రాజెక్టులకు అప్పుడప్పుడు రాష్ట్రంలోని విలేఖరులను తీసుకెళ్లాలనేది. ఆ నిర్ణయాలలో ఒకటి. ఆ నిర్ణయాని కనుగుణంగా, తొలి జట్టు యీ రోజు బయలుదేరుతూండటం నాకు ఆనందంగా వున్నది. ప్రస్తుతానికి యీ పర్యటన స్థానికంగా పనిజేస్తున్న విలేఖరులకు మాత్రమే పరిమితం చేయడం సమంజసమని భావించటం జరిగింది. ముందుముందు ఇతర రాష్ట్రాల సంపాదకులకు, విలేఖరులకుకూడా ఇలాంటి అవకాశాలు కల్పించటం సాధ్యపడవచ్చు. ఈ తొలి పర్యటనలో హైదరాబాదు విలేఖరులు పన్నెండుమంది, విజయవాడ నుంచి నలుగురు తీసుకోబడినారు. మరికొద్దికాలం పోయాక ఇతర జిల్లాలలో పనిచేస్తున్న విలేఖరులకు ఇలాంటి పర్యటన ఏర్పాటు జేయాలని సంకల్పం. ఈ పర్యటన రెండు దశలలో ముగుస్తుంది. మొదట ఏడు దినాలలో విజయవాడ, విశాఖపట్నం, అరకు, మాచ్‌ఖండ్‌లు చూసివచ్చి, రెండురోజుల విశ్రాంతి తర్వాత, మరల నాగార్జున సాగరం, శ్రీశైలం, గిద్దలూరు, కర్నూలు, తుంగభద్ర ప్రాజెక్టులను ఐదు రోజులలో చూడటంతో ముగుస్తుంది. కొన్ని ప్రాజెక్టుల పని ముమ్మరంగా సాగుతూ, అప్పుడే వాటిమూలంగా ప్రజలు లాభం పొందుతున్నారు. మరికొన్ని ప్రాజెక్టుల పని ప్రాథమిక దశలలో వుండటం మీకు తెలిసిన విషయమే. ప్రాజెక్టులపై పని ఏవిధంగా జరుగుతోందీ ప్రత్యక్షంగా చూసి తెలుసుకునేందుకు విలేఖరులకు సాధ్యమైన సౌకర్యాలన్నీ సమకూర్చబడినాయి. ఎక్కడికక్కడ పూర్తి సమాచారం అందజేయవలసిందిగా అధికార్లను కోరటం జరిగింది. వీటితో పాటు, ఈ పర్యటనలో విలేఖరులు పారిశ్రామికంగానూ, వినోద యాత్రల కనువయిన ముఖ్యమైన ప్రాంతాలను కొన్నిటిని చూడ గలుగుతారు కూడా.

"ప్రయోజనకరమయిన పూర్తి సమాచారం లభ్యమవటంద్వారా యీ నూతన పథకం పత్రికా విలేఖరులకు ఎంతో మేలు చేకూర్చుతుందని నా భావన. ఈ బృందంవెంట వస్తున్న అధికారులు పర్యటన సాధ్యమైనంతవరకు ఇబ్బందులు లేకుండా కొనసాగేట్టు చూస్తారు. రాష్ట్రంలో ఇలాంటి ప్రయత్నం చేయడం ఇదే ప్రథమం గనుక పన్నెండు దినాల పర్యటనలో ఎక్కడయినా అనుకోని యిబ్బందులకు లోనయినప్పటికీ, అంతా మరిచి విలేఖరులు ప్రభుత్వంతో సహకరిస్తారని నా విశ్వాసం."





పత్రికా ప్రతినిధుల బృందం విశాఖపట్నంలో నౌకా నిర్మాణ కేంద్రాన్ని సందర్శించారు.



విజయవాడలో ఒక లేబరేటరీని పత్రికా ప్రతినిధులు చూస్తున్నప్పటి దృశ్యం.

నవభారత నిర్మాతలు



# ఇతోధికంగా ఫలసాయం

ఉత్తర ప్రదేశ్‌లోని కాన్పూర్ జిల్లా, మంచా గ్రామనివాసి రణధీర్ సింగ్ ఆ రాష్ట్రం ఆహారోత్పత్తి పోటీలలో వరుసగా రెండవతూరి ప్రథమ బహుమతి పొందాడు. 1958-59 సంవత్సరంలో ఎకరానికి 49 మణుగుల గోధుమను పండించగలిగాడు.

నవీన సాంద్ర వ్యవసాయ పద్ధతులు – అనేకసార్లు దుక్కిదున్నడం, రసాయనిక ఎరువులు, ఇతర ఎరువులు వాడడం, మేలిరకం విత్తనాలు చల్లడం, తగినంతగా నీరు కట్టడం మున్నగు పద్ధతులు – అవలంబించడంద్వారా రణధీర్ సింగ్ క్రమబద్ధంగా, ఇతోధికంగా ఫలసాయాన్ని తీయగలిగాడు.

అభ్యుదయ మార్గాలు అనుసరించే రణధీర్ సింగ్ వంటి రైతులు ఆహారోత్పత్తిని అధికతరం చేయడం ద్వారా నవభారత నిర్మాణానికి సహాయపడుతున్నారు.



## ప్రణాళిక ద్వారానే సంపద, శ్రేయస్సు

## ప్రణాళిక కోసం కృషి చేయండి- ప్రణాళిక కోసం పొదుపు చేయండి

DA 60/530



*తిరుపతికి భూటాన్ లామాల రాక:*— భూటాన్ దేశపు పన్నెండుమంది లామాల బృందం 1960 డిశెంబరు 31, 1961 జనవరి 1 వ తేదీలలో తిరుపతిని సందర్శించారు.



హైదరాబాదులో యీ యేడు జరిగిన పారిశ్రామిక ప్రదర్శనంలోని సమాచార పౌర సంబంధముల శాఖ శాలకు అలంకరణలో ప్రథమ బహుమతి లభించింది. సహకారానికి మరొక బహుమతికూడా లభించింది.



జాతీయపొదుపు ఉద్యమసహాయార్థం "కృష్ణలీల" నృత్యనాటికను హైదరాబాదులో 23-2-61 తేదిన ప్రదర్శించిన నాట్య బాలెట్ సెంటర్ (న్యూఢిల్లీ) డైరెక్టర్ శ్రీమతి లాల్‌గారికి ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి పుష్ప గుచ్ఛం బహూకరిస్తున్నారు.



ఊయల పెద్ద యశోద : "కృష్ణలీల" లో ఒక దృశ్యం.



సిక్కిం మహారాజాగారు నాగార్జున కొండవద్ద శిథిలాలను
క్రిందటి నెల దర్శించారు.



ఫిజినుండి వచ్చిన నలుగురు ప్రతినిధుల బృందం చార్మినార్ వద్ద.



బాలల నృత్యం : కృష్ణా జిల్లా, గన్నవరం బ్లాకులోని పాలుపాడు గ్రామంలో బాలల నృత్య ప్రదర్శనం.



ఈ సంవత్సరం రిపబ్లిక్ దినోత్సవాల సందర్భంలో ఢిల్లీలో నృత్య ప్రదర్శనలిచ్చిన ఆంధ్ర ప్రదేశ్ బృందం వారు ప్రధాన మంత్రిని కలుసు కున్నప్పుడు తీసిన చిత్రం.



బెలూన్ ప్రయోగం :- ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆటల స్టేడియం వద్ద, 1961 ఫిబ్రవరి 5 వ తేదిన తాతా ఫండమెంటల్ పరిశోధన సంస్థవారు భారత ప్రధాని సమక్షంలో బేలూన్ను ఆకాశంలోనికి ఎగరవేశారు.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}''$ డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావుపేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయే మొత్తమూ ప్రతినెల 8 వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండు డ్రాఫ్ట్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు-దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగుజాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన ఎంతస్థలంలో ఏ వైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడుభాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్
సమాచార పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్—1

# మేఘదూతాంధ్రీకృతులు -

# సంస్కృత కావ్యములు రచించిన ఆంధ్రులు

ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులు

కవికులగురు వగు కాళిదాస మహాకవి రచించిన కావ్యత్రయము, రూపకత్రయమును తెనుఁగునాట పాఠప్రవచనముల నెన్నియో శతాబ్దములనుండి విశేషవిఖ్యాతి నందినవి. రఘువంశ — కుమారసంభవ — మేఘసందేశములకు ఆంధ్రవిద్వచ్చూడామణి యగు మల్లినాథసూరి నిర్మించిన సంజీవినీవ్యాఖ్యలు దుర్వ్యాఖ్యావిషమూర్ఛిత లగు కాళిదాసీయకావ్యకన్యకలకు ప్రాణప్రతిష్ఠ చేసిన వని భారతవర్షమున నాంధ్రేతరపండితులు నంగీకరించి యున్నారు. కాళిదాసకృతరూపకత్రయమునకు కాటయవేముఁడు రచించిన కుమారగిరిరాజీయములును ప్రఖ్యాతములే.

ఇదంప్రథమముగా మేఘదూతమును ముద్రించిన మహానీయుఁడు విల్సన్ పండితుఁడు *(H. H. Wilson)*. ఈయన దీనిని తన యాంగ్లపద్యపరివర్తనముతోఁ జేర్చి, క్రీ. శ. 1813 వ వత్సరమున ముద్రించి, ప్రకటించెను. నాఁటినుండి నేఁటివఱకు మేఘదూతకు వందలకొలఁది ప్రచురణములు, వివిధ భాషానువాదములును బయలుదేరినవి. ఈయనువాదములలో నాంధ్రమున నున్నన్ని యనువాదము లింక నేభాషయందును లేవు. ఈ 148 సంవత్సరములలో మేఘదూత కాంధ్రమున బయలుదేరిన పరివర్తనములు రమారమి నలువదినూఁడు. ఆంధ్రులు మేఘదూతకు రచించిన వివిధభాషావ్యాఖ్యానములు మొత్తము నాలుగు.

1. నరహరిసరస్వతీతీర్థులు : నిర్మించిన 'విద్వజ్జనానురంజని'. ఈయన క్రీ. శ. 1242 న తెలుఁగునాట జన్మించెను. ఈయన మేఘదూతకే కాక కుమారసంభవ — కావ్య ప్రకాశములకుఁ గూడ సంస్కృతవ్యాఖ్యలు రచించెను. ఇం దేదియు నింకను సూర్యాలోకభాగ్యము నంద లేదు. ఈయన సన్యసించి పరమహంసపరివ్రాజకాచార్యుఁడై, కాశీనగరమున పై వ్యాఖ్యలు రచించెను.

2. కోలాచల మల్లినాథసూరి : 'సంజీవిని' యను నీతని వ్యాఖ్య ప్రఖ్యాతము. మహామహోపాధ్యాయుఁ డగునీయన కాళిదాసీయకావ్యత్రయమునకే కాక భారవి, మాఘము, నైషధము, భట్టికావ్యము, ఏకావళి మొదలగువానికి సంస్కృత వ్యాఖ్యలు రచించెను. ఈయనతనయుఁ డగుకుమారస్వామి విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణమునకు రత్నాపణ మనువ్యాఖ్య రచించెను. మల్లినాథునికాలము క్రీ.శ.1350-1414 ప్రాంతము.

3. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి : ఆంధ్రప్రతిపదటీకా తాత్పర్య—పదప్రయోజనములతో (కలారత్నాకరముద్రాక్షరశాల, మద్రాసు)—1902.

4. శ్రీ గంటి జోగిసోమయాజి: ఆంగ్లటీకానువాదాదులతో (వావిళ్ళ ప్రచురణము, మద్రాసు) *1930*. మేఘదూతకు రెండు శతాబ్దములనుండి పద్యగద్యగేయరూపమున వెలువడిన నాంధ్ర పరివర్తనములు నాకుఁ దెలిసినంతవఱకు 47. ఇందు, కొటికలపూఁడి వేంకటకృష్ణసోమయాజి (18 వ శతాబ్ది), నిర్మించిన పద్యానువాదమే మొట్టమొదటిది. ఇది యింకను ముద్రితము కాలేదు. తొలిసారిగా నచ్చుపడినయాంధ్రీకృతి శ్రీ వడ్డాది సుబ్బారాయఁడుగారిది. (క్రీ. 1884). అచ్చుపడినవానిలో కట్టకడపటిది శ్రీ మల్లాది లక్ష్మీపతిశాస్త్రిగారిది (అక్టోబరు 1960) 18 వ శతాబ్దినుండి 1960 వఱకు రచియింపఁబడిన, ముద్రింపఁ

బడిన మేఘసందేశాంధ్రీకృతుల సూచిక *(Bibliography)* ఏక ముఖముగా నెవ్వరును ప్రకటింప లేదు. గవేషణనిరతుల కిట్టి సూచిక లెంతయో యుపకరించును. కాలక్రమమున నా సూచిక యిట నొసఁగఁబడు చున్నది.

## 1. ఆంధ్ర పద్యానువాదములు - ముద్రితములు

1. వడ్డాది సుబ్బారాయఁడు (క్రీ. 1884)
2. కల్లూరి వేంకటరామశాస్త్రి (1885)
3. వత్సవాయి నీలాద్రిరాజు (1912)
4. అడవి సాంబశివరాయకవి శుద్ధాంధ్రానువాదము (1912)
5. శిష్టా నరసింహశాస్త్రి (1926)
6. గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్య (1929)
7. దీపాల పిచ్చయ్యశాస్త్రి (1931)
8. పూర్ణ ప్రజ్ఞాచార్యులు (పళ్లె...) (ద్విపద) (1931)
9. రాయప్రోలు వేంకటరామసోమయాజులు (1937)
10. భువనగిరి విజయరామకవి—గుంటూరు (1937)
11. మాడభూషి మఠం వేంకటాచార్యులు (1937)
12. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి—నెల్లూరు (1937)
13. భీమరాజు సత్యనారాయణ, యం. ఏ. (1939)
14. పదాల రామమూర్తి—గూడూరు (1941)
15. బంక్లె వేంకటసుబ్బయ్య (1948)
16. చింతగుంట సూర్యనారాయణరావు (1948)
17. భమిడిపాటి అయ్యప్పశాస్త్రి (1949)
18. శంఖవరం రాఘవాచార్యులు (సంపత్) (1950)
19. పోరనంది వేంకటరమణమూర్తి—పూర్వార్థము (యాత్రోపదేశము) (1950)
20. తాడూరి లక్ష్మీనరసింహారావు, తత్తనయుడు రామచంద్ర రావు (1951)
21. దామెర రాజగోపాలరావు (1952)
22. మన్నవ వేంకటరాధాకృష్ణశర్మ (1957)
23. దాకోజు లింగమూర్త్యాచార్యులు (1957)
24. గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యము (1958)
25. శ్రీపాద శ్రీరామమూర్తి (1959)
26. శ్రీస్వామి ఆత్మానందగిరి (1960)
27. మల్లాది లక్ష్మీపతిశాస్త్రి (1960)

*ఈ క్రిందివి ముద్రణకాలము తెలియనివి*

28. లోకనాథకవి
29. చర్ల గణపతిశాస్త్రి (1940 ?)
30. వేమూరి వేంకటేశ్వరశర్మ (19....)
31. పంగనామముల రామచంద్రరావు ('మబ్బుకూయి' అను పేరు) (19 )

## 2. ఆంధ్రపద్యానువాదములు (అముద్రితములు)

32. కొటికలపూఁడి వేంకటకృష్ణసోమయాజి (1790)
33. ముతుకుమిల్లి నృసింహకవి
34. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి (19...)
35. జనమంచి వేంకటరామయ్య
36. సోమంచి సూర్యనారాయణశర్మ
37. రావూరి దొరస్వామిశర్మ
38. వెలగలేటి వెంకటార్యుఁడు.

## 3. గేయానువాదములు

39. అనంతపంతుల రామలింగస్వామి (1924 ప్రాంతముల ఆంధ్రపత్రికా సారస్వతానుబంధమున ముద్రితము.)
40. త్రిపురాన సూర్యప్రసాదరావు (1940)

## 4. గద్యానువాదములు

41. వేదము వేంకటరాయశాస్త్రి (1902)
42. వావిళ్లవారిప్రతిలోని గద్యానువాదము (1911)
43. కొలకుల నారాయణరావు (1954)

*ఆంధ్రులు రచించిన సంస్కృత దూతకావ్యములు*

౧. కీరసందేశము : కర్త - శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, హైద్రాబాద్ (1959 క్రీ.)
౨. కీరసందేశము : శ్రీ గరికిపాటి లక్ష్మీకాంతయ్య. హైద్రాబాదు (1952)
౩. ఘనవృత్తము : కర్త - కోరాడ రామచంద్రశాస్త్రి (తొలి ముద్రణము) (1908 క్రీ.శ.)

౪. మనోదూత : తైలఙ్గవ్రజనాథుఁడు (1916)

౫. మానస సందేశము. వింజమూరి వీరరాఘవా
చార్యులు (1902)

౬. యశోల్లాసము : కస్తూరి కృష్ణమూర్తిశాస్త్రి (అముద్రిత)

౭. శుక సందేశము : దేవులపల్లి నరసింహశాస్త్రి (అముద్రిత)

౮. హంస సందేశము : వామనభట్టబాణుఁడు, కలకత్తా (1941)

౯. హంస సందేశము : వారణాసి ధర్మసూరి (లుప్తము)

పై వానిలో నష్టప్రాయ మగు ధర్మసూరికృత - హంస సందేశము (ప్రాకృతము) అముద్రితము లగు యశోల్లాస - శుకసందేశములను గూర్చి యిట ప్రసంగింపఁ బడును.

1. ధర్మసూరి : హంససందేశము - (ప్రాకృతము) † ఈ విద్వత్కవి మహామహోపాధ్యాయుడు, షడ్దర్శనీపారదర్శి, ఆలంకారికశిరోమణి, నరాంకితముగ 'ప్రతాపరుద్రయశోభూషణము'ను నిర్మించిన అగస్త్య - విద్యానాథుని నిరసించి శ్రీరామచంద్రచరణసారస - చంచరీకుఁ డగుధర్మసూరి రామచంద్రయశోఘనసారసురభికృత మగు 'సాహిత్యరత్నాకరము' అను నుత్తమసాహిత్యగ్రంథమును రచించి ధన్యుఁ డయ్యెను. ఈయన రచించిన యితరకృతులు.

1. కంసవధ.
2. కృష్ణస్తుతి.
3. నరకాసురవిజయ
4. బాలభాగవతము.
5. రవిశతకము.
6. హంససందేశము

వ్యాయోగము†(ముద్రితము, 1864)

పై వానిలో నరకాసురవిజయము తప్ప నిక్కిన వన్నియు కాలగర్భమున నంతరించినవి. ఉన్నన్నకల్పము లగువీనియందలి శ్లోకములు మాత్రము కొన్ని సాహిత్యరత్నాకరమున నుల్లేఖించుకొనఁ బడెను. లేనిచో నీగ్రంథములపేళ్లు కూడ మనకు తెలిసెడివే కావు. హంససందేశమునుండి యీక్రింది, ప్రాకృత పద్య మొక్కటి మాత్రము జాగరావస్థ కుదాహరణముగా 'సాహిత్య – రత్నాకరము'న నొసఁగఁబడెను.

"జాగరో యథా వా, మమైవ ప్రాకృతభాషా
విరచితే హంససందేశే—

ప్రాకృతగాథ 'జాఅం సీఆణఅణజుఅళం
లోహిఅం జాఅరాఅ
కిం వా తమ్మం మఅణదహణజ్జాళజాలాహిఁదా వా,
చిత్తారద్ధే సురఅవిహవ చుంబణాణ పపప
రత్తం కిం వా రఘువఇముహే వీడిఆరాఅజోఆ"

సంస్కృతచ్ఛాయ - (మందాక్రాంతము)

'జాతం సీతానయనయుగళం లోహితం జాగరా ద్వా
కిం వా తామ్రం మదనదహనజ్వాలజాలాభితాపాత్,
చిత్తారబ్ధే సురతవిభవే చుంబనానాం ప్రభేదే
కిం వా రక్తం రఘుపతిముఖే వీటికారాగయోగాత్.'

తన యిష్టదైవ మగు శ్రీరాముఁడు జానకీదేవికి హంసచే సందేశమును పంపుటయే యిందలి యితివృత్తముగాఁ గన్పట్టును. వేదాంతదేశికుల హంససందేశము నందలివస్తువు కూడ నిట్టిదే. హంససందేశము (హంసదూత) అనునీక్రింది సంస్కృతకావ్యముల నిట పేర్కొనఁ దగును.

1. హంసదూత : రూపగోస్వామి.
2. హంసదూత : కవీంద్రాచార్యసరస్వతి.
3. హంససందేశము : వేదాంతదేశికులు.
4. హంససందేశము : వామనభట్టబాణుఁడు.
5. హంససందేశము : కవినామరహితము.
6. హంససందేశము : రఘునాథదాసుఁడు.

క్రీ. శ. 1290—1325 ప్రాంతముల జీవించిన విద్యానాథుని ధర్మసూరి పేర్కొనుటచే నాతనికంటె నీతఁడు చిన్నవాఁడో, నవీనుఁడో కావచ్చును. క్రీ.శ. 1430—50 ప్రాంతముల విలసిల్లిన గౌరనచేఁ బేర్కొనఁబడిన సాహిత్యరత్నాకరము ధర్మసూరి

† ధర్మసూరినిగూర్చి విశేషము లీక్రిందివ్యాసములందు కన నగును :

(1) *Dharmasuri - His Date and works :* By E. V. V. Raghavacharya *(New Indian Antiquary* - Vol. II. No. 7 for Oct. 1939 (Bombay.)

(2) ఈ. వే. వీ. రాఘవాచార్యులు : "సాహిత్యరత్నాకరము - నౌకామందరములు" (ఆంధ్రసాహిత్య - పరిషత్ - పత్త్రిక - సంపుటి 17, సంచిక 6; పు. 291 - 306 - కాకినాడ. (1929).

†నరకాసుర విజయమును, సాహిత్యరత్నాకరమును - సంస్కృత ఎకాడెమీ గ్రంథమాలలో (ఉస్మానియా-యూనివర్సిటీ హైదరాబాద్) త్వరలో, నాగరిలిపిలో ముద్రింపఁబడ నున్నవి.

రచించినదే యగుచో నీతఁడు క్రీ.శ. 1325–1400 ప్రాంతముల నుండినవాఁ డని చెప్ప నగును.

2. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి †– యశోల్లాసము : అభినవ కాళిదాస బిరుదాలంకృతుఁ డగు నీ కవి ఆంధ్రముననే కాక సంస్కృతమునను ప్రౌఢవిద్వత్కవి; నేఁటి తూర్పుగోదావరి మండలమునకు చెందినవాఁడు. సాహిత్యముననే కాక సంగీత మునను, వసుచరిత్ర రచయితయగు భట్టుమూర్తివలె, నిష్ణా తుఁడు. ఆయనవలెనే ఆశుకవిత్వమునందును విశేషప్రావీణ్యము కలవాఁడు. ఈయన జననము క్రీ. 1790 ప్రాంతము. ఈయన రామచంద్రపురము, కాళహస్తి. మాదుగులసంస్థానములయం దాస్థానకవిగా వివిధకాలములయందు సమ్మానింపఁబడెను. జగ్గమ్మపేట, పిఠాపురసంస్థానములయందును ఈయన సత్క రింపఁబడెను. ఈయనతనయుఁ డగుసర్వశాస్త్రియు కవియై, అమరుకము నాంధ్రీకరించెను. ఘనవృత్త మనుసంస్కృత మాతకావ్యమునే కాక, ఆంధ్రగీర్వాణముల ననేక కావ్యముల రచించిన కోరాడ రామచంద్రశాస్త్రి కృష్ణమూర్తిశాస్త్రి శిష్యుఁడే.

యశోల్లాసము : కాళిదాసుని మేఘదూతకు ప్రతిధ్వని వంటిది యశోల్లాసము. ఇందు రెండుసర్గలు గలవు. ఒకా నొకరసికుఁడు విరహవిధురుఁడై తనప్రాణప్రియకు మేఘునిచే ప్రణయసందేశమును పంపుట, యిందలివస్తువు. అముద్రిత మగుదీనిప్రతి అసూర్యంపశ్యయై చెన్నపురియందు ప్రభుత్వము వారిప్రాచ్యలిఖితగ్రంథాలయమున తపస్సు చేయుచున్నది. అందలిశ్లోకములు మచ్చునకు కొన్ని—

శ్లో. 'యక్షస్త్వేవం విరహవివరం యాచతో వాచ మస్య
శ్రావం శ్రావం శ్రమహృతిమతి ర్దైవతో దేవతాత్మా,
సానుక్రోశ స్సపది స ఘన స్సమ్య గాలోచ్య కార్యం
నిర్యాయాగా న్నిజపథగతో మారుతప్రేరితోఽగాత్. 1

స్వాఙ్గాసఙ్గక్షణపరిచితభ్రమ్యదీరాగ్రనేమిః
స్థానే స్వర్ణధ్వజయుజి దివి వ్యోమయానప్రతానే,
సద్యఃప్రోద్యత్స్తనితముఖరో విద్యుదుద్యోతిపక్షో
దుర్లక్షోఽభూదపినిపుణధీఃసర్గిణాంస్వర్గిణాం సః 2

విద్యుత్వ్యానప్యనుచరమరుత్ప్రేర్యమాణోఽర్యమాద్వ
ప్రత్యాఖ్యానప్రథిమభవనీభూతభూజాగ్రకూటమ్,
స్వస్త్రీపీడాక్షణనినయిపాస్పన్దనస్కన్ధఘోటం
క్రీడత్ఖేటం పునరపి కృతీ ప్రాప తం చిత్రకూటమ్. 3

కాళీదత్తాధికతమధియః కాళిదాసస్య వాక్యే
శ్లాఘపాత్రే సకలవిదుషాం మేఘసన్దేశకావ్యే,
కర్తుఃస్ఫూర్తేః సరసవచసః కృష్ణమూర్తే రిహాభూత్
యశోల్లాసాహ్వయయుజి కృతావాదిమః సర్గ ఏషః.' 4

గద్యము : 'ఇతి శ్రీమద్వాసిష్ఠగోత్రస్య, శిష్టుకులపవిత్రస్య, సర్వ శాస్త్రిపుత్త్రస్య, సకలకవికులమిత్రస్య, శ్రీమదభినవకాళి దాస బిరుదసముజ్జ్వలత్స్ఫూర్తేః కృష్ణమూర్తేః కృతౌ యశోల్లాసే మహాకావ్యే ప్రథమ స్సర్గః సంపూర్ణః'

కావ్యోపసంహారము :

'ఏవం దైవాత్ పునరధిగతా మీప్సితార్థాఽపి(భి ?) పూర్ణాం
పూర్వాతీతప్రచురవిభవాభోగినీం భోగలక్ష్మీమ్,
వధ్వా సాకం చిర మనుభవన్ యా(వా ?)సవశ్రీ స్తథా సః
ప్రాసాదం స్వం సురగిరిసదృగ్భాస మాసాద్య రేజే.' 5

కృష్ణమూర్తిశాస్త్రి రచనలు :—

I సంస్కృతము : 1. అశ్వశాస్త్రము
2. కంకణబంధరామాయణము
3. నీలశైలనాథీయము
4. మదనాభ్యుదయము (భాణము)
5. యశోల్లాసము (కావ్యము)†

† చూ :- (1) శ్రీకం. వీరేశలింగముపంతులు: 'ఆంధ్రకవులచరిత్రము'-3వ భాగము, పు.229–233; చింతామణిప్రెస్, రాజమహేంద్రవరము-(1914).

2. శ్రీ బులుసు వేంకట రమణయ్య : 'ఆంధ్రకవి సప్తశతి' పు. 40-42 మద్రాసు. 1956.

3. శ్రీ మహామహోపాధ్యాయ మల్లాది సూర్యనారాయణశాస్త్రి : 'సంస్కృత కవిజీవితము'- పు. 633-637; ప్రథమ ముద్రణము. శ్రీ చింతామణి ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము. (1950), వేంకటరామ కంపెనీ (విజయవాడ) ప్రచురణము.

† 'యశోల్లాసము'నకు హవిర్యాజి యగు సీతారామపండితుని వ్యాఖ్య కలదఁట. (చూ. - మల్లాది సూ. నా. శాస్త్రిగారి 'సంస్కృతకవి జీవితము'- పు. 636 (క్రీ. 1950.)

6. వల్లపీపల్లవోల్లాసము (భాణము)
7. హరికారికావళి (ఆంధ్రభాషా వ్యాకరణము)

II ఆంధ్రము :
1. దండకములు
2. నాటకదీపము
3. పంచతంత్రము
4. మాలికారచనలు
5. వాయుపుత్రశతకము
6. వేంకటాచలమాహాత్మ్యము
7. సర్వకామదాపరిణయము
8. స్త్రీనీతిశాస్త్రము
9. స్తోత్రములు
10. 'వసుచరిత్ర' వ్యాఖ్యానము

మదనాభ్యుదయము : అముద్రిత మగునీకవిరచించిన 'మదనాభ్యుదయ' మనుభాణము* — అసమగ్రము చెన్నపురిలో ప్రాచ్యలిఖితపుస్తకాలయమునఁ గలదు. ఈ వ్రాఁతప్రతినుండి కొన్నిశ్లోకములు :

శ్లో. శ్రీమద్యామునతీరశాద్వలతలే గోపాలికాం చాలయ-
న్నేకాం సైకతసీమ్ని తద్వ దపరాం దూరే
ముహుః ఖేలయన్,
సజ్కేతోక్తలతాని కేతనగతా మన్యాం రతే లాలయన్
యోఽభూ ద్వల్లవధామ్ని పల్లవవరో దేయాత్ స
వోఽత్యుత్సవమ్. 1

ఈషన్మీలితభావలోలనయనం హేలావివృత్తాననం
చేలాకర్షణజాతపానుచలనం చేతోభవోద్యోతనమ్,
ప్రారమ్భావసరోచ్చలత్ప్రియతనం ప్రాదుర్భవత్కామనం
మోదం వో విదధాతు మోహజననం ముగ్ధాఙ్గనాలిఙ్గనమ్ 2

ధీర స్సూరసమాహ్వయో వరమతి ర్వాశిష్ఠవంశేఽజని
స్తేయాం స్తస్య సుతః శ్రుతాధ్వని కనద్ధీః సర్వశాస్త్రీ సుధీః,
తస్యాత్రోఽమ్బుజభూసతీస్తనయుగస్తన్యాప్తి ధన్యాత్మవాక్
స్ఫూర్తి స్సంప్రతి కృష్ణమూర్తి రుదయత్కీర్తిః కృతీవర్తతే. 3

శృఙ్గాదివిభ్రమకృదిమ్బ్రుచిబిమాలా-
సఙ్గాజహాత్క్రమలగన్ధసుగన్ధివణాః,
అఙ్గారక్ష్మప్తతిలకాళికపాలిశాలీ
శృఙ్గారమౌళి రసపాయ ముపైతి కోఽయమ్.

పై శ్లోకములలోని మూఁడవదానిని బట్టి కృష్ణమూర్తిశాస్త్రి, సూరశాస్త్రిపౌత్త్రుఁ డనియు, సర్వశాస్త్రిపుత్త్రుఁ డనియు మాత్రము తెలియు చున్నది; కాని, ఆయనతల్లిపే రందు పేర్కొనఁబడలేదు. అట్టియెడ, పైని సూచింపఁ బడినవివరణాత్మక త్రైవార్షికలిఖితగ్రంథసూచికలో (పు. 2073) కృష్ణమూర్తిశాస్త్రి జననిపేరు ['అంబుజభూ (= లక్ష్మి')] లక్ష్మి యని వ్రాయఁబడెను. ఇది సరి కాదు. పై మూఁడవ శ్లోకమునందలి మూఁడవ పాదమునకు అంబుజమునుండి పుట్టిన బ్రహ్మయొక్క సతి యగుసరస్వతీస్తనద్వంద్వము (అనఁగా, సంగీత సాహిత్యములు) నందలి స్తన్యమును పాన మొనరించుటచే ధన్యమైనవాక్స్ఫురణ గల కృష్ణమూర్తి అని భావము. సంగీత సాహిత్యములు సరస్వతీస్తనద్వంద్వ మను సంప్రదాయము ప్రసిద్ధము. 'సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్' అని ప్రాచీనోక్తి. సంగీతసాహిత్యములందు ప్రౌఢవిద్వాంసుఁ డగుకృష్ణమూర్తిశాస్త్రి తా నారెండిటియందు దిట్ట ననియే పైపాదమునఁ జెప్పుకొనిన భావము. తరువాత నుల్లేఖింపఁ బడు 'కంకణబంధము' నందలి శ్లోకమును బట్టి ('గౌరీ-సర్వజ్ఞయోః పిత్రోః') కృష్ణమూర్తిశాస్త్రి జనని గౌరి, జనకుఁడు సర్వజ్ఞుఁడు (= సర్వశాస్త్రి) అని తెలియు చున్నది.

వల్లపీపల్లవోల్లాసము†

అముద్రిత మగునీయనవల్లపీపల్లవోల్లాస మనుభాణము — వ్రాఁతప్రతి — చెన్నపురిలో ప్రాచ్యలిఖితగ్రంథాలయమున

* *A Triennial Catalogue of Manuscripts :* (1913-1916 A. D.) — Vol. II Part 1. Sanskrit-C. (R. No 1467; PP. 2073—74)—1917.

† "విద్వత్కవిరాజమనోరంజక - సంగీతసాహిత్యకవిత్వచతురు" లగు మాడభూషి నరసింహాచార్యులవారు రచించిన "వల్లవీపల్లవోల్లాస" మను నాంధ్రప్రబంధ మొకటి కలదు. ఈయనతనయుఁడే విద్వానభినవ పండితరాజ వేంకటాచార్యులు ('భరతాభ్యుదయ' కర్త)

నాద్యంతరహితముగ నున్నది. ఈభాగము నందలిపద్యములు కొన్ని:

1. శ్లో. .... .... మోదం ముహుః,
కుర్వన్తః ప్రతిగాత్రభాగిభరితా స్వేదామ్బునా కుమ్భినీమ్,
తన్వన్త స్తతకుఙ్కుమాఙ్కురతలా మేతే విప్రత్తేజనాః
పశ్యన్తః కృతదన్తశబ్దముఖలాన్ భ్రామ్యన్తి తాన్యుఙ్గన్తస్తథా

2. దాసా విప్రర్తినయనాఞ్చల సంప్రవృత్త —
బాష్పామ్బుబిన్దువృషలీజన దత్తచిత్తాః,
తత్తత్స్వరాసు జనతాభినుతి ప్రవీణా
గాయన్తి కీర్తి దుపరిప్రసృతాన్మదాస్తాః.

3. ఉదగ్రజనతాదృతేః సవిధ మేత్య నీచాః శ్వకం
ప్రక్షిప్తకరసంపుటాః భువి భటావలోకోత్సుకాః
స్వజానుయుగళోపరి ప్రణిహితాననాః స్వంభ్రమ—
స్త్యపోహ్య తత తస్తతో ఝటితి సన్నిషణ్ణా అపి.

†కంకణబంధరామాయణము (స్వవిరచితవ్యాఖ్యతో):

చిత్రబంధకవిత్వప్రచురమగు నీ కంకణబంధము నెండకన్నులుంగక, చెన్నపురమున ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున, తాళీదళసంపుటములలో నజ్ఞాతవాసము చేయుచున్నది. ఇందలి శ్లోకములు మచ్చునకు కొన్ని యిట చూపఁబడుచున్నవి.

'వాగ్దేవతాతరుణసత్కరుణా గురు(ః)పాద్య -
విద్యానవద్యతరహృద్యకవిత్వశాలీ,
వాసిష్ఠవంశజనని ర్మను కృష్ణమూర్తిః
వ్యాఖ్యాం కరోమి నిజకంకణబన్ధముఖ్యామ్. 1

గౌరీసర్వజ్ఞయోః పిత్రోః పదపాథోరుహే హృదా,
నిరంతరాయమిష్టాప్త్యై నిరన్తర మహం భజే. 2

వనుకంకణబన్ధ - కృతిః కృతినా -
మపి నో సుకరా యది వా కవిభిః,
కతిభి ర్ఘటితా స్తి తథాపి కథా -
క్రమసంగ్రథితా న చ కాస్తి భువి. 3

శ్రీరామదివ్యచరితం ఖలు నవ్యకాతు —
ధారాప్రవర్ష ణవిధానకలిత ప్రహర్షమ్,
హర్షం వహాన్ న్నహ మకార్ష మమర్షశూన్యే
సారజ్ఞ సంపదధినం కణమేపి సారమ్. 4

చతుష్షష్ట్యర్ధసంబద్ధో బద్ధో ద్వాత్రింశదక్షరః.
సతాం ముదే విజయతాం నితాన్తమతిదుష్కరః 5

ప్రాచేతసాదిగవి — రాజవిరాజమాన —
వాక్కేళి — సిన్ధుంతిసంగతిబన్ధురస్య.
శ్రీరామకీర్తిభర — భవ్యపయఃపయోధేః
స్సేయం కృతి ర్భవతి కంకణబద్ధ ఏవ' 6

కంకణబంధచమత్కృతిని తెలిసికొనఁ దలఁచినపాఠకులీక్రిందిగ్రంథములను పరిశీలింపఁదగును.

1. డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులవారి 'లౌకిక సంస్కృతవాఙ్మయచరిత్ర' —

పుటలు: 195; 806—08; (1937)

2. శ్రీ మల్లాది సూ. నా. శాస్త్రి: 'సంస్కృతకవిజీవితము' (పుటలు: 636—'37)— 1950 — యమకచిత్రబంధకవిత్వము లందు రసపుష్టి మృగ్య మని విశ్వనాథకవిరాజాగులమతము. ఉత్తమకవిత్వమున కిది గండ్లపెట్టు. కవిప్రజ్ఞాప్రకాశనమునకే యీకవిత యుపయోగించును.

## III. దేవులపల్లి వేంకటనరసింహశాస్త్రి: శుకసందేశము—

ఈయన తూర్పుగోదావరిమండలము నందలి మండపేటలో నుండెడివారు. రమారమి 10 పండ్లక్రిందట, అశీతసప్తతివర్ష వయస్కు లగు వీరు స్వర్గస్థు లైరి. ఈయనతోఁ బ్రత్యక్షపరిచయభాగ్యము నాకు లభించినది. ఆంధ్రగీర్వాణసాహిత్యము లందు దృఢవ్యుత్పన్ను లగు వీరికి రెండుభాషలయందును చక్కనికవితాకౌశల మలవడినది. వీరిరచనలలో ముద్రితములు

1. అచ్చాంధ్ర-నిరోష్ఠ్య-నిర్గద్య-సారంగధరచరిత్ర (క్రీ. 1898)

2. వసంతవిలాసభాణము. (1910)

3. మిత్రభాషితము. (1930)

సంస్కృతసాహిత్యగ్రంథములయందు మహాశిఖరములవంటి మూఁడిటిలో నొకటి యగు మమ్మటుని కావ్యప్రకాశమునకు వీరు విపులవ్యాఖ్యతోడి ఆంధ్రానువాదమును రచించిరి. సంస్కృతసాహిత్యసాగరమును మథించి, వడసినయమూల్య

† *A Triennial Cata of Mss.* (Vol. III - Part 1 - Sanskrit - A; 1916–1919) R. No. 2116; PP. 2874–'76 (1922).

విషయరత్నరాశి యెంతయో యిందు నిక్షేపింపఁబడెనని, ముద్రణమున నిది 7, 8 వందల పుటలగ్రంథ మగు ననియు, దీనిని తామే త్వరలో ముద్రింపనుంటి మనియు, వారే యిరువదియేండ్లక్రిందట నాతోఁ జెప్పి యుండిరి; శుకసందేశమును సంస్కృతటీకతో నాగరలిపిలో ముద్రింపఁ దలచినట్లును వారు నుడివిరి. కాని, యీ రెంటిని ముద్రింపకపూర్వమే వా రస్తమించుట శోచనీయము. ఆయన కుమారునితో నీ గ్రంథములఁ గూర్చి, తన్ముద్రణమును గూర్చియుఁ బ్రసంగించితిని గాని, యది యరణ్యరోదనమే య య్యెను. సాహిత్యాభిరుచి లేని తనయులు గలవిద్వత్కవుల గ్రంథముల దుర్గతి యిట్లే యుండును. ఒకరాజమహిషి సింహాచలమునుండి చెన్నపురియం దున్న న్యాయవాది (వకీలు) కడకు ఒకానొక చిలుకచే సందేశ మంపుట శుకసందేశము నందలి యితివృత్తము. ఇందు రెండు సర్గలు, 179 మందాక్రాంతావృత్తములు కలవు.

ఎన్నడో 30 ఏండ్లక్రిందట నాకు లభించిన యీక్రిందినాల్గు శ్లోకములను బట్టియే యీకావ్యకన్య యెుకప్పుడు జీవించి యున్నట్లు భావింప నగును

'కతి కవయః, కతి కృతయః కతి లుప్తాః కతి చరన్తి, కతి శిథిలాః'

అని నీలకంఠవిజయకృత్యాదిని విద్వత్కవి నీలకంఠదీక్షితు లుద్ఘోషించినట్లు, ఎందఱు కవులు విలసిల్లిరో, అందెందఱు విస్మృతులో; ఎన్ని కావ్యము లుదయించినవో; అందెన్ని పాఠప్రవచనమున జీవించి, సంచరించుచున్నవో, ఎన్ని జీర్ణప్రాయములై విస్మృతి నందినవో, ఎన్ని ఎన్ని యుత్పన్నమ్ములైనవో, యెవరు చెప్పఁగలరు?

శుకసందేశము నందలికొన్ని మచ్చుశ్లోకములు :

1. శ్లో. 'కాచి న్నోమ్మేచాతరుసురుచిరే సింహశైలస్య కూటే
ప్రాజ్ఞా రాజ్ఞీ వసతి మకరోద్ దూరదేశప్రచారమ్,
రూపాజీవారచిత కుటిల ద్యూతపీనస్వరాజ్యం
కాంతం చింతాకలుషహృదయా చింతయంతీ నిశాంతమ్.—
(1 స. ౧౫)

2. శైలే లీలానరమృగపతేః క్వచిత్ తత్ర సౌనౌ
పాంసుక్రీడాప్రవణవయసం పుత్త్రి మంకే వహంతీ,
తత్తన్మాయావచనరచనోపక్రమైః ఖేలయంతీ
కీరం స్వైరం స్వయ ముపగతం రాజపత్నీ దదర్శ (1. ౧౭)

3. తత్రైవ ప్రాగ్జలనిధితటప్రాంత భాగాయసాధ్వ —
ప్రాసాద్యుద్ధూమ్యాశకటపటలీముఖ్యసంస్థానకూటః,
తంత్రీవార్తాసదన సదనస్తోమవిశ్రామసీమే
తత్త్వద్యన్త్రాకలననిలయా దృష్టరమ్యా విభాంతి. (I, ౩౮)

4. ఘీంకారోద్యన్మదకరిఘటాః కిన్ను క్షితిప్రదాత్రీ
స్ఫూర్జద్గర్జానినదకలితా నీలకాదంబినీ వా,
హృద్యైర్వా ద్వైరనుగతవతీ జంగమా సౌధమాలా
కిం వేత్యుచ్చై ర్జవనశకటో దృశ్యతే దూరతో హి.

ఇతివృత్తములు భిన్నములైనను శుక(లేక, కీర)సందేశ మనుపేరు గలయితరసంస్కృతకావ్యము లిట సూచింపఁబడును :

1. కీరదూతము : కర్త— రామగోపాలకవి. (అముద్రితము)
2. కీరసందేశము : శిరోమణి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు.

సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి (ఆంధ్ర) కీరసందేశమునకు వారిదే సంస్కృతీకరణము (1959).

3. కీరసందేశము : శ్రీసన్నిధానంవారి (ఆంధ్ర) కీరసందేశమునకే మొదటి సంస్కృతానువాదము (1952)— శ్రీ గరికిపాటి లక్ష్మీకాంతయ్య
4. శుకదూత : యాదవచంద్రవిద్యారత్నకవి (అముద్రితము).
5. శుకసందేశము : లక్ష్మీదాసకవి (1884)
6. ,, కరింగివల్లి నంబూద్రి ( )
7. ,, రంగాచార్యకవి ( )
8. ,, మహాదేవకవి (తంజావూరు)



# ప్రథమాంజలి

దిగుమర్తి సీతారామస్వామి

కలముం బట్టిన దాదిగా కవుల శ్లాఘాపద్యముల్ కుప్పతి
ప్పలుగా వ్రాసితిఁ గాని గౌరవధురా ప్రాగ్భారలక్ష్యంబుగా
నిలువం గల్గిన యాంధ్ర నవ్యకవితానిర్మాత శ్రీనన్నపా
ర్యలసత్ భారతిఁ బ్రస్తుతించు నెడ వ్యర్థాయాసమున్పొంచెడిన్.

తెలుగులకైన పుణ్యములు తేకువ నిల్పిన తెల్గుగడ్డపై
వెలసిన వైదికార్యుఋషి — వించిన పద్యము లెల్ల ఋక్కులై
నిలిచిన నేమియబ్బురము! నేరిచి కూరిచి దేశభాషలన్
దెలుగును లెస్సఁ జేసె — ఋణనిర్భరు లాంధ్రులు భట్టవాణికిన్

నుతమతి నవిరళ జపహో
మతత్పరుఁడుగాన తెల్గుమాటల కార్షో
న్నతి సంఘటింప సంస్కృత
మతి లలితముగాఁగ నన్నపార్యుఁడు పాడెన్

నన్నయగారి పద్యములు నాలుకనాడిన మీద నెంత తి
క్కన్నలుఁ దేలి పోదురనఁగా నది శబ్దరహస్య విజ్ఞ సం
పన్నత సంహితారచన బంధురమైన జగద్ధితార్థ — కా
దన్నను గ్రంథపూర్తికి శతాబ్దము లేటికిఁబట్టె నిస్పృహన్?

విశ్వశ్రేయముకోసమై రచన గావింపంగ స్వస్థాన భా
షైశ్వర్యంబు రసప్రలుబ్ధతయు జాత్యాధార సంస్కార యో
గ్యశ్వశ్రేయస చిహ్నలంచుఁ దెలుపంగా నాయకత్వంబునన్
శశ్వత్కీర్తి నినున్ వరించుటయు నాశ్చర్యంబె భట్టారకా?

శ్రీకారము చుట్టఁగ నీ
వాకారితుఁడ వయినప్పు డాంధ్రావని శ్రీ
ప్రాకామ్య నిత్యనందన
మై కన్పించినది నీకు నక్షరపూజల్ !!!

# పారిశ్రామిక విశేషాలు

## ( 1961 జనవరి )

*భారీ విద్యుత్పరికరాలు*

భారీ విద్యుత్పరికరాల ఉత్పత్తికి స్థాపించదలిచిన రెండవ ఫ్యాక్టరీని నెలకొల్పడానికై అనువైన స్థలాన్ని నిర్ణయించే నిమిత్తం భారతప్రభుత్వంచే నియమించబడిన కమిటీవారు 1961 జనవరిలో హైద్రాబాదుకు రెండవ పర్యాయం వచ్చారు. హైద్రాబాదు సమీపంలో రామచంద్రాపురం వద్దనున్న స్థలానికి సంబంధించిన పూర్తి వివరాలు ఈ కమిటీకి అందజేయబడినవి.

*గాజువస్తువుల ఉత్పత్తికి సమీకృత ప్రాజెక్టు*

హైద్రాబాదుకు దరిదాపులలోనూ, రాష్ట్రంలోని కొన్ని ఇతర చోట్లలోను గాజువస్తువుల తయారీకి ఉపయోగించే ప్రధానమైన ముడిపాదార్థాలు సమృద్ధిగా లభిస్తుండటంవల్ల రాష్ట్రంలో ఒక గాజువస్తువుల ఉత్పత్తి సంస్థను స్థాపించి ఈ ముడి పదార్థాలను పూర్తిగా వినియోగంలోనికి తేవడానికి కొంతకాలంనుంచి రాష్ట్రప్రభుత్వం యోచిస్తున్నది. ఈ సందర్భంగా రాష్ట్రప్రభుత్వం ఒక పథకాన్ని సిద్ధంచేసి కేంద్రం ఆమోదానికి పంపించింది. ఇద్దరు విదేశనిపుణులుకూడా త్వరలో హైద్రాబాదుకు రానున్నారు.

*ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషను*

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషనును, రాష్ట్రప్రణాళికా శాఖామంత్రి 1961 జనవరి 27వ తేదీన ప్రారంభించారు. అదేరోజున డైరెక్టర్ల బోర్డు తొలిసమావేశం కూడా జరిగింది.

*ఆంధ్రప్రదేశ్ లఘుపరిశ్రమల అభివృద్ధి కార్పొరేషను*

రాష్ట్రంలో చిన్నతరహా పారిశ్రామిక యూనిట్లను నెలకొల్పి, నిర్వహించడానికై, ప్రారంభంలో ఒక కోటి రూపాయల పెట్టుబడితో లఘుపరిశ్రమల అభివృద్ధి కార్పొరేషనొక దానిని స్థాపించడానికి రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది. వచ్చే నెల రోజులలో బహుశా ఈసంస్థ పని ప్రారంభిస్తుంది.

*పారిశ్రామిక సలహాసంఘం*

భారీ పరిశ్రమల స్థాయీ సలహాసంఘం సమావేశం 1961 జనవరి 28వ తేదీన ముఖ్యమంత్రి అధ్యక్షతన జరిగింది. ఈ సంఘం తాలూకు సబ్‌కమిటీ రూపొందించిన అనేక పథకాలను ఈ సమావేశంలో పరిశీలించారు.

*ప్రభుత్వ సెరమిక్ ఫ్యాక్టరీ, బ్లాకుగాజు యంత్రాగారము*

గూడూరులోని ప్రభుత్వ సెరమిక్ ఫ్యాక్టరీనీ, ప్రభుత్వ బ్లాకు గాజుయంత్రాగారాన్ని ఒకే జాయింట్ స్టాక్ కంపెనీ క్రింద మార్చి, భారత కంపెనీల చట్టంక్రింద రిజిష్టరుచేయించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ విధంగా ఏర్పడే కంపెనీలో ప్రభుత్వం కనీసం 51 శాతం వాటాలు వుంచుకుంటుంది. మిగిలిన వాటాలను అవసరమైతే ప్రజలు కొనుక్కోడానికి అవకాశం ఇవ్వబడుతుంది.

*ప్రభుత్వ ముద్రణశాల పునర్వ్యవస్థీకరణ*

ప్రభుత్వ ముద్రణ శాలలో రెండవ షిఫ్టు పనిని ప్రవేశపెట్టడానికి సంబంధించిన ఒక పథకాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. దీనితో ఈ ముద్రణశాలలో ఏటా ఏడు లేక ఎనిమిది లక్షల రూపాయలు విలువచేసే పని అదనంగా జరగడానికి వీలు గలుగుతుంది. ప్రభుత్వ ముద్రణశాల పనిపరిమాణాన్ని హెచ్చించడానికి ఒక బోనసుపథకాన్నికూడా ప్రభుత్వం మంజూరు చేసింది.

*లఘుపరిశ్రమలకు సహాయం*

రాష్ట్ర పరిశ్రమలశాఖ 1960వ సంవత్సరంలో రాష్ట్రంలోని లఘుపరిశ్రమల యూనిట్లు పెట్టుకున్న దరఖాస్తులలో నూటాపద్దెనిమిదింటిని జాతీయ లఘుపరిశ్రమల కార్పొరేషనుకు పంపిస్తూ, వాటికి అద్దె కొనుగోలు పద్ధతిపై యంత్ర పరికరాలు మొదలైన సామగ్రిని సరఫరా చేయడానికి సిఫార్సు

చేసింది. వీటిలో 61 దరఖాస్తులను కార్పొరేషను ఆమోదించింది. ఈ మొత్తం దరఖాస్తుదార్లకు యంత్రపరికరాలు తదితర సామగ్రి సరఫరా చేయడానికి రు. 29.39 లక్షలు ఖర్చవుతుంది. ఇప్పటి వరకు 29 మంది దరఖాస్తు దార్లకు రు. 2.30 లక్షలు ఖరీదు చేసే యంత్రపరికరాలు సప్లయి చేయబడినవి.

రు. 5 లక్షలకు మించని పెట్టుబడి ధనంతో నడుస్తున్న పారిశ్రామిక యూనిట్లకు ఈ సౌకర్యం పొందడానికి అవకాశం వుంటుంది.

*చక్కెర పరిశ్రమ*

నిజామాబాదు సహకార చక్కెర ఫ్యాక్టరీకి యంత్రాల కొనుగోలుకు ఏర్పాట్లు పూర్తయినవి. రు. 84 లక్షలు విలువ చేసేయంత్ర పరికరాలను ఈ ఫ్యాక్టరీకి కొంటున్నారు. రోజుకు 1,000 మొదలు 1,500 టన్నుల చెరకును పిండేశక్తి ఈ ఫ్యాక్టరీకి వుంటుంది. 1962-63 ఋతువులో బహుశా ఇది పని ప్రారంభిస్తుంది.

*నిజాం చక్కెర ఫ్యాక్టరీ*

ప్రభుత్వ యాజమాన్యంక్రింద నడుస్తున్న నిజాం చక్కెర ఫ్యాక్టరీ నిర్వహణ చాలా సంతృప్తికరంగావుంది. 1959-60 వ సంవత్సరంలో ఈఫ్యాక్టరీకి రు. 63 లక్షల ఆదాయం లభించింది.

*సింగరేణి కాలరీస్*

దక్షిణ గోదావరి బొగ్గు క్షేత్రాలలో రామగుండం సమీపాన 1961 జనవరి 9వ తేదీన కొత్తగా ఒక గనిని త్రవ్వారు. ఇక్కడ ఏటా 15 మొదలు 20 లక్షల టన్నుల బొగ్గు లభించవచ్చుని అంచనా. ఈ ప్రాంతంలో 16 కోట్ల టన్నుల బొగ్గు లభించవచ్చునని అంచనా వేశారు. ఈ ప్రదేశంలో గనులు బాగా అభివృద్ధి పొందినపుడు ఇక్కడ ఆరు మొదలు ఎనిమిది వేలమంది పనివారలకు ఉపాధి లభించడమేగాకుండా ఎడారిగా వున్న ఈ ప్రదేశమంతాకూడా ఆధునిక పారిశ్రామిక నగరంగా అభివృద్ధిచెందగలదు.

దేశంలోని ప్రధాన బొగ్గు ఉత్పత్తి కేంద్రాలలో ఒకటైన సింగరేణి కాలరీస్‌లో 1960 వ సంవత్సరంలో 15.05 లక్షల టన్నుల బొగ్గు ఉత్పత్తి జరిగింది. ప్రభుత్వ యాజమాన్యాన నడుస్తున్న ఈ సంస్థలో 25,000 మంది పనిచేస్తున్నారు.

*ప్రాగాటూల్స్ కార్పొరేషను*

ప్రాగాటూల్స్ కార్పొరేషను విస్తరణ కార్యక్రమంక్రింద డ్రిల్ పరికరాల ఉత్పత్తికి ఒక యూనిటు తెరవబడింది. ఇంగ్లాండుకు చెందిన మెస్సెర్స్ కిర్నే అండ్ ట్రేకర్ అనే సంస్థ సహకారంతో ఈ కార్పొరేషను ప్రపంచప్రసిద్ధమైన సి. వి. ఎ. డ్రిల్ పరికరాలను ఉత్పత్తిచేస్తుంది. విస్తరణ కార్యక్రమం క్రింద ప్రాగాటూల్స్ కార్పొరేషను హాలీఫాక్స్‌లోని మెస్సెర్స్ ఎఫ్. ప్రాట్ అండ్ కంపెనీ అనే సంస్థతోనూ, మరో విదేశ సంస్థలోను సాంకేతిక విషయాలలో సహకారానికి ఒప్పందం కుదుర్చుకుంది. ఈ సంస్థకు చెందిన ఇద్దరు సాంకేతిక నిపుణులు ఇక్కడికి వచ్చారు. దీని విస్తరణ కార్యక్రమం యావత్తు రెండు దశలలో చేపట్టబడుతుంది. ఇందుకు రు. 160 లక్షలు ఖర్చు కావచ్చని అంచనా.

*కడప జిల్లాలో అస్బెస్టాస్ ఫ్యాక్టరీ*

కడప జిల్లాలో అస్బెస్టాస్ ఫ్యాక్టరీ నొకదానిని స్థాపించే విషయమై పరిశీలన జరుగుతున్నది. ఈ పథకానికి సుమారు 8 కోట్ల రూపాయలు ఖర్చుకాగలవు.

*నూతన పరిశ్రమలకు లైసెన్సుల మంజూరీ*

రాష్ట్రంలో ఇనుప గొట్టాల ఉత్పత్తిని చేపట్టడానికి మరో రెండు సంస్థలకు భారతప్రభుత్వం అనుమతి ఇచ్చింది. వీటిలో ఒకటి కృష్ణాజిల్లా గుడివాడలోను, రెండవది విశాఖపట్నం లోను స్థాపించ బడతాయి.

రాష్ట్రంలో డెటొనేటర్సు, ఫ్యూజుపౌడర్సను తయారు చేయడానికి ఒక ప్రైవేటు సంస్థకు లైసెన్సు ఇవ్వబడినది.



# వసంత ఋతువు

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

ఆద్యంతములు లేనియట్టి కాలమ్ము నుగాదితో మొదలుగాఁ గలుగు ఋతువు
వాసంత నవరాత్ర వర్ధిత కల్యాణ రమణీయ సుషమ వెలార్చు ఋతువు
ఫలపుష్పనిచయ సంభావనా గరిమ భూసురకోటిఁ బరితృప్తిఁ బఱచు ఋతువు
పూర్ణిమా స్నానాత్త పుణ్యోపలబ్ధికై అంజలో మొదటి మేటైన ఋతువు

నాతిశీతల నాత్యుష్ణతాతి రమ్యమగుచు మ్రోడులు చిగురించు సొగసు లొలికి
సకలజన హితమైన వసంత ఋతువు వచ్చె నాకకోటిదౌ శతపత్ర శోభ.

కనువిందు నగుచుఁ బూచిన దశోకసుమమ్ము రమణీ మణీ పాదలాక్ష వోలె
మది నింపుచునుఁ బూచినది కర్ణికారమ్ము సొంపైన చెవికమ్మ కెంపు వోలె
చెన్నుగా విరియఁ బూచెను పలాశసుమమ్ము ఖండితాపాంగ వీక్షణము వోలె
చెలువమ్ము లొలికి పూచిన దెఱ్ఱగోరింట జేవురించిన చేడె చెక్కిలి వలె

అది ఋతురాజు విశ్వవిఖ్యాతకీర్తి దర్పకుని కైన ప్రాణమిత్రము వసంతు
డధిక తేజస్వి మిగుల సహాయ పడగ తుంట విలుతుడు పెద్ద యోధుడుగ నిలచె

మధు లిహమ్మున కిష్టమైన మానిననేమి కమనీయముగ చంపకమ్ము పూచె
మధు వృక్షమునుఁ బోలి మనిన మానిననేమి రెమ్మరెమ్మను వేపకొమ్మ పూచె
కమలమ్మునకుఁ బోలికయిన మానిననేమి యుల్లమ్ములలరించి మల్లె పూచె
హ్లాదగీతమ్ము దోహద మైన కాకున్న గుమ్ముగా నా వ్రేంకణమ్ము పూచె

షడృతువు లందు నిది విశేషత గడించి పుష్పమయ శోభసిరులెగ బోసెనంచు
ఆదిఋతు వైభవమ్ముఁ బెల్లాది పలికె కొమ్మ కొమ్మనుఁ జేరి పుంస్కోకిలమ్ము.

చలితగ్గి చిఱుచెమ్మటలు పోయ కామినుల్ కోలకులన్ లెస్సగా జలకమాడి
తఱచు న త్తరువుచే సురభీకృతమైన వలిపెంపు చెంగావి వలువఁదాల్చి
కమ్మతావుల నీను గంధచర్చనుఁ జేయ చెదురుగా లోని కంచెల సడల్చి
విరిపీవనల తోడ విసరగా రగిలిన మధుర తాపమ్ముతో మనసు చెదరి

పికము రెట్టించి కూయుకూతకును బెదరి మదము రెచ్చిన తుమ్మెద రొదల కదిరి
మనసు దిగులైన నుద్యానవనములందు వేచియుందురు రాకకున్ బ్రియుల కొఱకు.

పూవు పూవును ముట్టిపోయె మిళిందుండు దక్షిణ నాయకోద్ధతి వహించి
చివురుఁ జివురు గిల్లి చిదిమె మావి, పికమ్ము నాజూకు తిండి విన్నాణ మట్లు
తరుణుల కనుల నిద్దుర మైక మొకకొంత దర్పకోద్ధతికి సద్ధమ్ము పెట్టె
ధవళిమమ్మై మఱి తనువులు కార్శ్యమై బుడిబుడిగా పోకముడి సడల్చె

రమణ గాలులు పుష్పసౌరభము నించె చెలువములు నోచు హాయి నించెను పగళ్ళు
మంచు బిందులు కొంచెమ్ము మసలు కొనని వెన్నెలు కాచెఁ గన్నుల విందులగుచు.

ఉల్లమ్ములలరింప నొకనారి మల్లియల్ కీలుగంటునఁ గొన్ని కీలుఁ గొలిపె
ప్రమదమ్ము నిండార ప్రమదామణియొకర్తు పింపిణీలో రచింపించికొనియె
అందమ్ము నుడులుగా సుందరీమణియోర్తు చొళ్ళెమ్ములోఁ బెట్టిచుట్టు కొనియె
తెలివి పెంపెసలార ద్విజట అందు నొకర్తు తీర్పుగా పూల వంతెననుఁ గట్టె

ఎచటఁ జూచిన మల్లియలే యెసంగ పంచ బాణుడు తొల్లింటి బాణములకు
తప్పె గుఱియించు వదలి నిర్దయత, నంత మల్లియలె పూని సంధించి విల్లునెత్తె.



జీవిత చరిత్రలు పఠించినందువల్ల, మనిషి తన వ్యక్తిగత జీవితసమస్యలను విశాలమయిన దూర దృష్టితో పరికించ గలుగుతాడు. అనేక జీవితచరిత్రలు చదివిన మానవుడు కొన్నితరాల పాటు జీవించాడు. తన కెదురయ్యే ప్రతి సమస్యను సులభంగా అర్థంజేసుకో గలిగేట్లు చేస్తుంది జీవితచరిత్ర, జీవితంలో సాధించిన విజయాలకు అతను ఉబ్బి తబ్బిబ్బవడు, అలాగే అపజయాలకు క్రుంగిపోడు కూడా, ఐశ్వర్యాన్ని అమితంగా అంచనా వేయటాన్ని లేదా దౌర్భాగ్యాన్ని అతిగా చెప్పుకోవటాన్ని అతని జీవితంలో తరచు చూస్తూనే వస్తున్నాడు.

*హారీ ఎమర్సన్ ఫాస్డిక్*

నాటిక:

# మహిళాభ్యుదయం

కొంపల్లి మల్లిఖార్జునరావు

పాత్రలు:

సుగుణ : ముఖ్యసేవిక
లక్ష్మి : గ్రామసేవిక
రామి : సేవిక
కామేశం : గ్రామస్తుడు
పార్వతి : కామేశం భార్య
రమ : కామేశం చెల్లెలు
సుశీల, శోభాదేవి, రాజమ్మ } గ్రామీణస్త్రీలు

సుగుణ, లక్ష్మి, రామి ఒకగ్రామానికి టూరు బయలు దేరుతారు. గ్రామానికి దూరంగానే ఒక పాడుబడ్డ బావి వుంది. వారు అక్కడికి వచ్చేసరికి మూలుగు వినిపిస్తుంది.

సుగుణ : (మూలుగు విని) లక్ష్మీ! ఎక్కడో మూలుగు విన్పిస్తోందికదూ!

లక్ష్మి : (చెవియొగ్గివిని) ఆ! అవునమ్మా! (అని నాలుగుపైపులా చూచి) అరె! ఎవ్వరూ కనిపించరూ!

సుగు : (బావివైపునడిచి చూచి) లక్ష్మీ! లక్ష్మీ! ఆ మూలుగు యీ బావిలోనుండే! పాపం! ఎవరో కాలుజారి పడినట్లున్నారు.

లక్ష్మి : (బావిలోకిచూచి) అయ్యో! ఎలాగండీ! ఆడమనిషిలా వుంది. ఏలా తీయడం! యీ ప్రాంతాల్లో నరవాసనైనా వున్నట్టు లేదు.

సుగు : ఊరుకూడా చాలా దూరంలో వున్నట్టుంది.

లక్ష్మి : అవునమ్మా!

సుగు : రామీ! రామీ!

రామి : (గబగబ వస్తుంది)

సుగు : త్వరగా ఆ బ్యాగ్ యిలా పట్టుకురా!

రామి : ఏమిటమ్మగోరూ! ఏమయింది.

సుగు : ఏమీ లేదు. యిందులో ఎవరో పడ్డారు. నా చీరలు రెండు తీసి జతచేసి ముడికట్టు....తీస్తాం....ఏంలక్ష్మీ....

లక్ష్మి : మంచి ఆలోచనమ్మా!

(రెండు చీరలు ముడికట్టి ఒకకొన బావిలోకి వేసి మరొక కొనను ముగ్గురూ పట్టుకుంటారు.)

సుగు : ఏమండీ! ఆ చీరకొన నడుముకు గట్టిగా కట్టుకొని పట్టుకోండి!

(ముగ్గురూకలిసి పైకి తీస్తారు. సేదతీరుస్తారు)

సుగు : యీ చీర కట్టుకోండమ్మా! మీరిలా కూర్చోండి....రామీ! కాస్త తలతుడూ....

పార్వతి : పరవాలేదు. నేనే తుడుచుకుంటాను. మీ కెందు కంత శ్రమ.

సుగు : శ్రమేమిటమ్మా! యిది మన ధర్మమేగదూ! ఒకరు ఆపదలో వున్నప్పుడు ఆదుకోవడం అనేది స్త్రీకి ఉగ్గుతోవచ్చిన అలవాట్లే గదమ్మా! (కాస్తఆగి)....మీదీవూరేనామ్మా!

పార్వతి : (తలపంచుకుని) అవును.

లక్ష్మి ; యీవూరేకదా! యిక్కడ పాడుబడ్డ బావి వుందని తెలిసి యిలా ఎందుకొచ్చారు. పైగా యీ బావికి బావికట్టుకూడా లేదుకదా!

రామి : యీయాళ నిద్దుర లేచినోల చాల మంచిదయిం దమ్మో

గోరూ ! లేకుంటే పానం పోవాల్సినమాటగాదూ !

పార్వ : ఈ మొండి ప్రాణాలు యిలాంటివాటికే పోతాయా ! అందుకుకూడా ఎంతనోమో నోచుకొని వుండాలి. యింకా బ్రతికి ఎన్ని బాధలు అనుభవించి కృంగి కృశించిపోవాలో !

సుగుణ : అదేమిటమ్మా అలాఅంటారూ ! పుట్టిన ప్రతిప్రాణీ గిట్టకుండా వుంటుందా ! చా వనేది మన యిష్టాయిష్టాలమీద వుందా చెప్పండి. ఆయుఃప్రమాణం పూర్తయితే ఒక్క క్షణ మైనా బ్రతకాలన్నా బ్రతకలేం ! కాని వృధాప్రయాస పడినంత మాత్రాన చావు వస్తుందా పిచ్చితల్లీ !

రామి : అయితే తమరు యిష్టపడే యిందులో దూకారన్నమాట... ఎంత దైన్యం...ఎంత దైన్యం...

సుగు : 'ఆత్మహత్య మహా పాతకం' అంటారమ్మా.

పార్వ : నిజమే ! బ్రతికి రోజూ యీ మహాబాధలు అనుభవించే కన్నా చచ్చి ఆ యమబాధలు పడటం అంత కష్టం కాదేమో !

సుగు : అందరూ అలాగే అనుకుంటారు విచక్షణాజ్ఞానాన్ని మరిచి....కాని చచ్చి సాధించేదేముంది చెప్పండి ?

పార్వ : బ్రతికి ఏం అనుభవిస్తున్నామండీ ! అంతులేని బాధలతో హృదయం చీకిపోవడంతప్ప.

సుగు : కష్టాలనేవి మానవులను ఆవహించుకోక చెట్టుపుట్టలను అంటుకుంటాయా ! సంసారం అన్నతర్వాత ఎన్నో కష్టాలు సుఖాలు వస్తుంటాయి, పోతుంటాయి ఆటుపోటుల్లా. అంతే కానీ ఏ ఒక్కరి దగ్గరా కష్టాలుగానీ సుఖాలుగానీ పీటేసుకొని కూర్చోవు....స్త్రీ ఓర్పు సహనాలకు ఆలయం. ఆలాంటివారితో నిరాశా నిస్పృహలు, ఆవేశాలు అంకురిస్తే సమాజానికే ముప్పు కాదూ !

(రమ గబగబ పరిగెత్తుకొస్తుంది)

రమ : ఏమే పారూ ! (నిర్ఘాంతపోయి) నే ననుకున్నంత పని చేసావు, ఎంత ధైర్యం....ఎంత సాహసం. పద ! నీకోరకు అందరూ వెతుకుతున్నారు. (సుగుణకేసిచూచి) అమ్మా ! మీరెవరో దైవంలా వచ్చి ఆదుకున్నారు. లేకుంటే పండంటి సంసారానికి ఎంతగతి పట్టివుండేది.

సుగు : ఎంతమాటన్నారు ! యిదీ గొప్ప సహాయమేనా ! మనం మనం సహాయపడకపోతే మరెవరు ఆదుకుంటారు చెప్పండి!

రమ : మీరు ఎక్కడికి వెళ్తున్నారో తెలుసుకోవచ్చామ్మా :

సుగు : మేమూ యీ వూరికే !

రమ : ఆ ! మా వూరికే ! యింకేం పదండి పోదాం....లేవే పారూ ! (అంటూ చెయ్యి పట్టుకుంటుంది.)

(పార్వతి యింటిదగ్గరకు అందరూ వస్తారు. గుమ్మం దగ్గరకు రాగానే పార్వతి బిడ్డ ఒకడు పరిగెత్తుకొస్తాడు)

బిడ్డ : (పరిగెత్తుకొచ్చి కాళ్ళకు చుట్టుకొని) అమ్మా !.... అమ్మా!....

పార్వ : (గట్టిగా ఎత్తి కౌగిలించుకొని) పా....పా !....

రమ : ఏమే పారూ నీ దెంత కఠిన హృదయం కాకపోతే యింత పసికూనల్ని వదలి వెళ్ళిపోతే వాళ్ళగతే మవుతుం దనుకున్నావ్? చెప్పు ! క్షణం సేపు తల్లి కనుమరుగవుతే నిలువలేని పసి కూనలు వీరు. అలాంటి వాళ్ళను వదలి పోయేందుకు నీ మన స్సెలా వొప్పుకుందో !

సుగు : అవునమ్మా ! తల్లిలేని బిడ్డల గతి బహుశా ఆ వాయు దేవుడికే తెలుసేమో ఎక్కువగా.

రమ : మంచిమాటన్నారు. ఏదో సంసారాల్లో పేచీలు వచ్చా యంటే కలకాలం బంధాలు, బంధుత్వాలు త్రెంచుకొని పోతారా! ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డల్ని చూస్తుంటే వాళ్ళ నొదిలి ఎలా పోవా లనిపిస్తుంది చెప్పు ! ఎంత రాతిగుండె అయితేనో గానీ !

పార్వ : అవును నాది రాతిగుండె.

సుగు : చదువు సంస్కారాలు కలిగిన దానివి నువ్వే యీలాంటి పనులు చేస్తే, అమాయకులు, మూర్ఖుల విషయం ఏలా ఆలో చించాలో చెప్పండి.

(పార్వతి రెండో బిడ్డ తల్లిని చూచి ఆనందంతో)

2 వ బిడ్డ : (ఆనందంతో) నాన్నా....నాన్నా ! యిదుగో అమ్మ !

రమ : చూచావుటే పారూ ! ఆ పిచ్చివెధవలకు ఎంత ఆనందమో! క్షణం సేపు కనుమరుగు అవుతే నిలువలేని యీ పిల్లల గతి ఏం కావా లనుకున్నావ్ చెప్పు ! నీపాటికినువ్వు నువ్వు సుఖంగా పోతే తర్వాత వారి సంగతి నాకెందుకనే భావనేగా! యీ గంటసేపట్లో వాళ్ళ ముఖాలెలా దిగులుపడి పోయాయో చూడు.

(పార్వతి భర్త కామేశం వస్తాడు)

కామేశం : ఏం చస్తానన్నావ్ ?....మరలా తిరిగి వచ్చావేం ?

రమ : ఊరుకోం డన్నయ్యా, ఏమిటా మాటలు.

కామేశం : ఎంత పరువు మాలిన పని ? (కోపంగా) మరలా ఏ ముఖం పెట్టుకొని వూళ్ళో తలెత్తుక తిరగాలి..........ఎంత అప్రతిష్ట....

రమ : ఇదుగో అన్నయ్యా ! మీకే చెప్పడం. యిక వూరుకోండి. అసలు అదే కుమిలికుమిలి చస్తూంటే.... యింకా....

కామేశం : ఎందుకు కుమిలికుమిలి చావడం ! తిన్న దరక్కనా !

రమ : అవునన్నయ్యా !. తినితిని అరక్కనే.

సుగు : బాబూ ! సంఘంలో పరువుప్రతిష్టలు సంపాదించడంతో పురుషుల పాత్ర ఎంత వుందో అంతే బాధ్యతలు స్త్రీకీ వున్నాయి. కానీ పురుషుడు వీధిలో తిరుగుతున్నందున తనే సర్వస్వం అని, స్త్రీ వంటయింట్లో వుంది గాబట్టి దేంతో సంబంధం లేదనుకోవడం పొరబాటు. కానీ ఒక సంసారంలో పురుషుని బాధ్యతకన్నా స్త్రీ బాధ్యతే ఎక్కువంటే నమ్ముతారా, డబ్బు సంపాదించేవరకే సామాన్యంగా పురుషులు బాధ్యత వహిస్తారు. వహించాలికూడా !....ఆ డబ్బు సంపాదించడంతోనే సమస్య లన్నీ సమసిపోవుగా....చెప్పండి ! ఆ తెచ్చినదాన్తో తన సంసంసార నౌకను నడపాల్సిన బాధ్యత స్త్రీ పైనే వుంటుంది. చాలినా చాలకపోయినా యిక తనదే బాధ్యత — చాలదంటే భర్త ఆగ్రహానికి ఆహూతై పోవాల్సి వస్తుంది ఒకోక్క సమయాన.

కామే : అలాఅని ఆమెను సంపాదించి తెమ్మని పోరు పెడుతున్నారా !.

సుగు : అలా సంపాదించడానికి స్త్రీకి అభిజాత్యం ఏమీ పోదు బాబూ ! స్త్రీ ఎంత సుకుమారో అంత కష్టజీవికూడా ! కాని సంఘపు చూపులోని కలుషత్వం నశించినరోజున స్త్రీలుకూడా ముందుకొచ్చి సంపాదిస్తారుకూడా ! తమ సంపాదనతో తమ సంసారాలను స్వర్గతుల్యంగా మార్చుకోగల శక్తికూడా స్త్రీకి వుంది. ఈనాడుకూడా ఎందరో వుద్యోగాలు చేస్తున్న స్త్రీలున్నారు. ప్రొద్దునే లేచి యింటిపనంతా చేసి భర్తకు, పిల్లలకు భోజనంపెట్టి తను భోంచేసి పగలంతా ఆఫీసులో చాకిరిచేసి మరలా సాయంత్రం తన గృహచర్యలలో నిమగ్నులై పిల్లల చదువులపై శ్రద్ధ చూపడమేగాక, భర్త ఆనందాల్లో సహకరించే యిల్లాండ్రు లేరంటారా ! పిల్లలు చేసే మారాముకు తండ్రులు విసుక్కుంటారు. యింట్లో పోదని చీకటి పడేవరకు వీధిలోనే గడిపి పిల్లలు నిద్రపోయే సమయానికి యింటికొచ్చి హాయిగా సుఖపడే జీవు లెంతమం దున్నారో తెలుసాబాబూ ! కాని ఎంత మారాం చేసినా, ఎంత ప్రాణం విసికించినా తల్లి పిల్లల్ని వదులుకుంటుందా చెప్పండి ! పురుషుల్లో ఓర్పు సహనాలనేవి పూర్తిగా లేవని చెప్పను. కాని వీటికి స్త్రీ ఆలయం. ఎన్ని కష్టాలనైనా, ఎన్ని బాధలనైనా ఓర్పుతో ఓర్చుకొని అన్నింటినీ దిగమ్రింగి జీర్ణించుకునేశక్తి ఒక్క స్త్రీకే వుంది బాబూ ! అలాంటిస్త్రీలు ఆత్మహత్యలకు పూనుకుంటున్నారంటే నిజంగా వారి శక్తికి అతీతమైన బాధలు వాళ్ళను ఆవహిస్తేనే తప్ప అలాంటి ఆలోచనలు కలుగవు.

రమ : ఆవునమ్మా ! మీరు చెప్పిందంతా నిజమే. దీనికంతా కారణం మాన్నయ్యే.

పార్వ : (గట్టిగా) రమా !

రమ : ఏం ? నేను చెప్పేది అబద్ధమా !

పార్వతి : అబద్ధమయినా, నిజమయినా అవి మా సంసారపు గొడవలు. వాటితో ఎవ్వరికీ ఏం సంబంధం లేదు.

రమ : సంబంధం లేదని నువ్వనుకోవచ్చు. కాని సమయం వచ్చింతర్వాత వెల్లడించాల్సిన బాధ్యత మాపైన వుందిగాబట్టి చెప్తున్నాను. తప్పా ?

విరామం

కామేశం : (తలుపుకొడుతూ) పార్వతీ....పార్వతీ....

పార్వతి : (లోపలనుండి) వస్తున్నానండీ.... (అంటూ తలుపు తీస్తుంది)

కామే : పార్వతీ ! ఒక్క విషయం చెప్పాలనుంది. నువ్వేమీ అనుకోకుంటే....

పార్వ : చెప్పండి. అనుమాన మెందుకు.

కామే : ఏమీలేదు ! వెంటనే వెయ్యిరూపాయలు కావాలి.

పార్వ : (ఆశ్చర్యంతో) ఆ....వెయ్యిరూపాయలా ! నాతో పరాచకాలాడుతున్నారా ! మీకు తెలియకుండా యింట్లో ఎక్కడున్నయో చెప్పండి !

కామే : ఏలాగైనాసరే నాకు కావాలి.

పార్వ : పోనీ అమ్ముదామంటే వున్నవన్నీ ముందే అయిపోయినయి గదా ! మీరు అన్నీ తెలిసి నన్ను పరీక్షిస్తున్నారా !

కామే : పరీక్షకాదు. నీకు తెచ్చియివ్వగల సామర్థ్యం వుందనే అడుగుతున్నాను.

పార్వ : అదేమిటండీ ! నాకు ఎలా వస్తాయి చెప్పండి !

కామే : ఎలాఏమిటి ! పుట్టింటికి వెళ్తే...ఉ...ఉ...ఉ... (అంటూ నవ్వుతాడు)

పార్వ : (ఆశ్చర్యంగా అర్థోక్తిలో) ఆ...యింకా పుట్టింటికే ! యిప్పటికే నాలుగుసార్లు పోయి తెచ్చాను...యీమారు మరలా ఎలా అడగాలి చెప్పండి.

కామే : ఎలా ఏమిటి. పూర్వం ఎలా అడిగావో అలాగే అడిగి పట్టుకురా !

పార్వ : క్షమించండి ! యీమారు నావల్లకాదు. వారితో మీరు సంబంధాలు ఏనాడో త్రెంచుకున్నారుగా ! కనీసం క్షేమ సమాచారాలకుకూడా నోచుకోలేదు. అయినా దయతలచి యిన్నాళ్ళు యిచ్చారు. యింకా తడవ తడవకు అడిగినా వారికి చులక నవుతుంది. పైగా నానా రకాలుగా అంటారు....వద్దు....

కామే : ఎందుకంటారు బిడ్డనిచ్చినప్పుడు ?

పార్వ : బిడ్డనిచ్చేవరకేగాని చచ్చేవరకు పెట్టాల్సిన బాధ్యత వారి కెందుకుంటుంది చెప్పండి.

కామే : యిదుగో ! యీ అధిక ప్రసంగం అనవసరం. ఎలాగైనా వెళ్లి వెయ్యి రూపాయలు పట్టుకొచ్చి యివ్వాల్సిందే !

పార్వ : క్షమించండి ! నావల్లకాదు. మీరు ఏం చేసినా సహిస్తాను. కానీ, ఆత్మను చంపుకొని యాచించి మాటలు పడలేను.

కామే : యిదుగో పార్వతీ ! మర్యాదగా చెప్తున్నాను. విని బయలు దేరి వెళ్లి చెస్తావా ! లేదా !....(గట్టిగా అరుస్తాడు)

పార్వ : క్షమించండి....నేను పోను....నన్ను బాధపెట్టకండి !

కామే : ఊ !....(అంటూ కొడ్తాడు)

పార్వ : అబ్బా....అంటూ (అంటూ క్రిందకు ఒరుగుతుంది.)

రమ : (గబగబ పరుగెత్తుకొస్తుంది. పార్వతిని పట్టుకొని).... ఏమిటన్నయ్యా ! నువ్వు మనిషివా ! పశువ్వా ! నిండు చూలాల్ని అలా కొడ్తా వెందుకు ? నీది కసాయివాని కన్నా కఠినమైన జన్మ !

కామే : (కోపంతో) రమా ! నువ్వెళ్ళు !....

రమ : వెళ్ళకుంటే ఏం చేస్తావ్ ? నీ ప్రతాపమంతా ఆడవాళ్ళ పైనేగా చూపేది !

కామే : రమా ! (అరుస్తాడు).

రమ : ఏం ? ఏం చేస్తావ్ ?....పాపం !...పార్వతి గొప్ప ఇంట్లో పుట్టింది....క్రింద నడిస్తే అరిగిపోతుం దన్నట్లుగా పెరిగింది.... చివరకు కసాయివాని చేతిలో పడింది....యిక బలిదానానికి కూడా సిద్ధమే ఆమె జీవితం....(కాస్త ఆగి) పారూ ! పారూ !

పార్వ : (మెల్లిగా) ఊ....

కామే : ఇదుగో ! రేపు సాయంకాలం లోగా తెచ్చి యివ్వకపోతే నీ యిష్టం....(అంటూ వెళ్లిపోతాడు.)

రమ : ఎంత క్రూరుడు....

పార్వ : (లేచి) రమా !....బండివే శయినట్లుంది. వెళ్తాను.... వారికోసం చీమునెత్తురును, ఆత్మను చంపుకొని యాచిస్తాను, మాటలంటే పడతాను....కావలిసింది డబ్బు....డబ్బు తేలేక పోతే యిక అంతే !....కానీ....బాబుదే నాకు పట్టుకున్న దిగులు....(కన్నీళ్ళు పెట్టుకుంటుంది)

రమ : ఛీ !....పిచ్చిదానా ! ఏమిటా మాటలు ?....అంతా తల రాత....ఎవరి నను కోని ఏం లాభం చెప్పు !. 'పూజకొలది పురుషుడు, దానంకొద్ది బిడ్డలు లభిస్తారు స్త్రీకి.' నీ పూజ యిలా వుంది....

పార్వ : వస్తా !.

రమ : మంచిది....జాగ్రత్తగా వెళ్లిరా....

విరామం

పార్వతి పుట్టినిల్లు....చీకట్లోవచ్చి పార్వతి తలుపు తడ్తుంది.

పార్వతి తండ్రి తలుపుతీస్తు !....

పా. తం : (తలుపు తీస్తు) ఎవరక్కడ ?....

పార్వ : నేనే....(మెల్లగా) నా....న్నా !....

పా. తం : (దగ్గరగా వచ్చి) ఆ....నువ్వామ్మా !....వంటరిగా వచ్చేసావా యీ అర్ధరాత్రిలో.... ఎంత కఠినుడు తను ?.... ఏమిటీవేషం తల్లీ ?....లోపలకు పద !....ఎప్పుడు రెండు మెతుకులు తిన్నావో !....

విరామం

(భోజనాలయిం తర్వాత)

పా. తం : ఎంత నిర్దయుడు తల్లీ అతను...దూరపు కొండలు నునుపని, చెప్పిన మాటలనుబట్టి యిచ్చిచేసి....నిన్నిలా యమ యాతనలకు గురిచేసాను....

పార్వ : ఊరుకోండి నాన్నా !....నాకేమి బాధలేదు....హాయిగానే వున్నాను.

పా. తం: ఉ....ఉ....ఉ....(నీరసంగా నవ్వుతాడు) ఎంత పిచ్చి తల్లివి నువ్వు! రోగం అంకురించినా, పేదరికం పట్టుతున్నా దాచిపెట్టినా దాగేవికావు తల్లీ!....ముఖంలో విస్పష్టంగా స్ఫురిస్తూనే వుంటాయి!...నువ్వు పుట్టింతర్వాతే యీ యింటి అంతస్తు పెరిగింది....నువ్వు లక్ష్మిలా వుద్భవించావని వుప్పొంగి పోయాము....నీ అదృష్టంవలననే యింత ఆస్తి పరుడు వరుడయ్యాడని యిచ్చివేసాను...కాలు క్రిందపెట్టి ఎరుగని నీకు యీ రోజు ఎంత దుస్థితి పట్టింది తల్లీ!

పార్వ: నాన్నా! ఎందుకు మీరలా బాధపడుతారు....నాకు వచ్చిన అసౌఖ్య మేమీలేదు.

పా. తం: బాధెందుకేమిటి తల్లీ! ఆ నాటి నా బిడ్డ పార్వతి ముఖంచూచి యీ నాటి యీ దీనస్థితిచూస్తే హృదయం ఏలాంటి యమయాతన పడుతుందో నీకేం తెలుస్తుంది తల్లీ! చిన్ననాటి నుండి అంతులేని ఆదరాభిమానాలతో పెరిగావు.... అన్ని అంశలతో అలరాలిన నీ జీవితంలో అన్నానికే అనుమాన మయిన క్షణాలు ఆసన్నమయినాయి. ఎలా పస్తులతో బాధపడున్నావో తల్లీ!

పార్వ: నాన్నా!....యిదివరకు మిమ్మల్ని ఏది కావాలన్నా అడిగి....నిరాకరిస్తే పీడించయినా చివరకు పొందగల్గేదాన్ని అందరి బిడ్డల్లా!....కానీ....యీనాడు మిమ్మల్ని యాచించాల్సిన గతితో యీ గుమ్మం దగ్గరకు వచ్చాను.

పా. తం: అమ్మా! ఏమిటా మాటలు!....నీకు యాచించాల్సిన అవుసరం ఏముంది తల్లీ!....తప్పు అలా అనకు!

పార్వ: అవును నాన్నా!....వివాహంనాడు వారు అడిగినదంతా యిచ్చారు వారి మనోతృప్తిగా!....అంతటితో ఆగితే వారి గౌరవము, మర్యాద అత్త మామల యింట్లో చిరస్థాయిగానే వుంటాయి.... కానీ తడవ తడవకు వేలకు వేలిచ్చి సహాయం చెయ్యడంకూడా వారికి కష్టమేకదా నాన్నా!....

పా. తం: పోనీ తల్లీ!.... జరిగిందేదో జరిగిపోయింది! కానీ యిప్పటికన్నా...

పార్వ: (అర్థోక్తిలోనే) ఇప్పుటి కేమిటి నాన్నా!....యిప్పటికీ రేపటికీ ఆలాంటి పరిస్థితుల్లోనే వుంటే....

పా. తం: అబ్బా...యిలా డొంక తిరుగుడుగా మాట్లాడితే యీ ముసలాడికేం అర్థమవుతుందితల్లీ!....చెప్పేది సూటిగాచెప్తే....

పార్వ: ఇంకా సూటిగా చెప్పేందుకు మనసు యాతనపడుతుంది నానా!....

పా. తం: నా దగ్గర నీకెందుకు బాధ తల్లీ!....ఏం కావాలో చెప్పు?

పార్వ: ఏమీలేదు నానా!...(కాస్తఆగి సంకోచిస్తూ) మరలా.... మీ అల్లుడికి రేపు సాయంకాలంలోగా....వెయ్యి రూపాయలు కావాలట.

పా. తం: ఆ!...వెయ్యి రూపాయలే!...యిక్కడేమున్నా వారి సొత్తుందా? లేకుంటే ప్రోగులు పోసుకొని వున్నానా! వేలకు వేలిచ్చి నా పనయిపోయింది....యిక నా వల్లకాదు తల్లీ! నాకు వెనకాల పెళ్లికెదిగిన పిల్లలున్నారు....వాళ్లందరి విషయాలతో మనస్సు చీకిపోతుంటే పైగా యీ దానాలూ, ధర్మాలునా.... అమ్మాయి!....యీ కాలంలో కానీ సంపాదించడం ఎంత కష్టమో సంపాదించేవాడికే తెలుస్తుంది....ఏదో వూరక తిని దొరికినంతవరకు అల్లాటప్పాయిగా ఖర్చుపెట్టేవారికేం తెలుస్తుంది....చెప్పు!...ఎప్పుడో ఒకమారు ...రెండు మారు లయితే సరే. తాటిచెట్టెక్కించేవాడి కెంతదూరం ఆదరువు చూపగలుగుతాం చెప్పు?....పైగా యింట్లో ఏ శుభకార్యానికి ఆహ్వానించినా లంచం యిస్తేనేగానీ రారు....వారి కోర్కెలన్నీ నెరవేర్చాలి....చివరకు వారివారి బిడ్డల బారసాలలకు కూడా మామగారు లంచం యిస్తేనేగానీ పీటలమీద కూర్చోనంటారు. ఎవర్ని వుద్ధరించడం తల్లీ! ఎన్నింటికని వుదారంగా వుంటాం ఓర్చుకొని....ఇన్నాళ్లంటే ఏదో బాగా సంపాదించగలిగాను గాబట్టి యివ్వగలిగాను అడగంగానే... యీనాడు నా ఒంట్లో ఓపిక నశించింది. కాళ్లకాటికి చాచుకొని కూర్చున్నాను. యీలాంటి పరిస్థితుల్లో పిల్లల పెళ్లితో...

పార్వ: నాన్నా! యివన్నీ నాకుమాత్రం తెలియదంటారా! యీ బాధలన్నీ నే నెరగనివా! కానీ....ఆ మొండిమనిషి పట్టుకు ఏం చెయ్యాలో తోచక దిక్కులేని దాన్నిగా యిక దరిదాపు తోచక యిలా వచ్చాను. యాచించేందుకు....

పా. తం: అ....మ్మా!...

పార్వ: అవును నాన్నా!...బిడ్డను ఒకరి చేతికి అర్పించిన తర్వాత తల్లిదండ్రులకు ఆ బిడ్డకు యిలా పెట్టాల్సిన అవుసరం ఏముంది చెప్పండి!

పా. తం: అమ్మా! నువ్వా నన్నే అంటున్నావా!

పార్వ : కాదునాన్నా ! నేను ఎవ్వర్నీ అనడంలేదు. లోకపు మర్యాదలనే అంటున్నాను. నిజంగా వారు కోరిందంతా అణా పైసలతో ముట్టచెప్పిం తర్వాతకూడా యిలా తడవతడవకు యివ్వాల్సిన అవసరమేముంది. నాలాంటి అదృష్టహీనురాం డ్రెందరున్నారో యీ ప్రపంచంలో...!

పా. తం : అమ్మా ! నా దొక్కమాట వింటావా తల్లీ !

పార్వ : ఏమిటినాన్నా ! చెప్పండి.

పా. తం : ఏమీలేదుతల్లీ ! అతనికి జీవితంలో కష్టసుఖాలంటే ఏమిటో యింతవరకు అర్థం చేసుకునే విచక్షణాజ్ఞానమే అంకు రించలేదు. నీకెందుకు నువ్వు, నీ పిల్లలతో యిక్కడే వుండు. అతనంతట అతనికి తెలిసివచ్చి సంపాదిస్తున్నప్పుడు అక్క డకు వెళ్లొచ్చు.

పార్వ : అదేమిటి నాన్నా !

పా. తం : ఏం తల్లీ ! చూడూ ! నువ్వు యింత గొప్పయింట్లో పుట్టి...ఎన్ని అంశలతోనో పెరిగి యీనాటి యీ బాధలేమిటి చెప్పు తల్లీ....నువ్వలావుంటే మాకు ఎలా వుంటుందో ఆలో చించావా ! లోకంకూడా ఎలా నిందిస్తుందో చూడు. నిజంగా మన వంశ మర్యాదలు అన్నీ అతని మూలంగా మంటగలిసి పోతున్నయి...ఎలా తలెత్తుక తిరగడం...ఫలానావాళ్ళఅల్లుడు జూదరి, త్రాగుబోతు యింకా నానారకాలు అంటూంటే.... కడుపు తరుక్కుపోతూంది.

పార్వ : నాన్నా వారితో బంధుత్వం కోరే ముందే అన్నీ విచారిం చాలిగానీ యీనాడు విచారిస్తే లాభం ఏముంది చెప్పండి ! ఈ రోజు ఆయన ఎన్నిఅలవాట్లకు గురిఅయినా, బంధుత్వాలు త్రెంపు కున్నా ఆయన మీ అల్లుడు. మీరు ఆయనకు మామగారు.... కాదంటారా చెప్పండి !

పా. తం : ఊ ! యిలాంటి వాళ్ళను అల్లుడనటానికి నోరుకూడా రావడంలేదు. కానీ విధీ కర్మా అని అనుకోవాల్సి వస్తుంది.

పార్వ : నాన్నా ! మీకు నోరు రాకపోవచ్చు! కాని కట్టుకున్నదాన్ని, జీవితాంతంవరకు ఆయన అండనే ఆశ్రయించుకొని వుండ వలసిన నాకు ఆయనపై విరక్తెలా కలుగుతుంది చెప్పండి ! మీకు ఎలా అన్నా సరిపోతుంది. కాని నా గతి నా బిడ్డల గతి ఏమవుతుంది నాన్నా ! స్త్రీకి భర్త దయ్యంగా పరిణమించినా దైవంగానే పరిగ్రహించాల్సి వస్తుంది. కాకుంటే ఆమె జీవితం అంతటితో ఆగిపోవలసి వస్తుంది. నాన్నా యిక మీరు ఆయ న్నేమీ అనవద్దు....క్షమించండి....ఆయన్ను వదలి పుట్టింటి బలం చూచుకొని వచ్చినా కొన్నాళ్ళే ఆ గౌరవ మర్యాదలు, ఆదరాభిమానాలు. తర్వాత ఆమెగతి అడకత్తెరలో పోక చెక్కలా అవుతుంది. అలిగి వచ్చినందుకు భర్త దగ్గరకు పోలేదు. పుట్టింట ఎత్తిపొడుపులతో నిలవలేదు. లోకం పరి హాసానికి గుమ్మం దిగలేదు....నాన్నా !....స్త్రీ జీవితంలో ప్రతి అధ్యాయంకూడా ఒక చరమాంకంలాంటిదే. మీరు తల్లిలేని లోటు లేకుండా పెంచారు. ఎంతో శ్రమపడ్డారు. నా మేలుకోరే గొప్పింటి సంబంధం వెదికి వివాహం చేశారు. కాని నా నోసటివ్రాలుకు ఒకరు కర్తేమిటి చెప్పండి. యీ ప్రపంచంలో మీరుతప్ప నా కెవ్వరూ ఆదరువు లేనందునే యాచించేందుకు వచ్చాను. యిచ్చినా సంతోషంగానే వెళ్తాను....యివ్వకపోయినా విచారమేమీ లేదు. నా తలరాతకు ఒకర్నని లాభం ఏముంది. చెప్పండి !

పా. తం : అమ్మా ! ఎంత మాటన్నావు తల్లీ !

పార్వ : అవును నాన్నా ! నొసటిగీత చెరిగిన వారి ఆయుర్దాయం ఎంత చెప్పండి ! కాని యీ పిల్లల్ని చూస్తూ....(ఏడుస్తుంది).

పా. తం : అమ్మా అంతపని చేస్తావా ! యింక వూరుకోతల్లీ... వెయ్యి రూపాయ లిస్తాను...తీసుకెళ్ళి యివ్వు కానీ అమ్మా ! అంత మొండిపను లెప్పటికీ చేసి యీ ముసలాడి హృదయానికి మరీ చిచ్చుపెట్టకు తల్లీ! యిప్పటికే అనుభవిస్తున్నవన్నీ చాలు.

* * *

రమ : చూచారండీ ! ప్రతిసారీ యీలాంటి మాటలు తిని ఆత్మను చంపుకొని యాచించి తెచ్చింది...నిజంగా వారికి యివ్వాల్సిన అవుసరం ఏముంది చెంప్పండి ? వారు మంచివారు. పరువు, ప్రతిష్టలకు వెరిచి కని, పెంచి, పెద్దచేసిన మమకారంకొద్ది యిస్తున్నారేగానీ అల్లుడన్న గౌరవం, మర్యాద చూచి యిస్తు న్నారా ! అలా కూతురి ముఖం చూచి ఎన్నాళ్ళివ్వగల్గుతారు చెప్పండి. ఈనాడు కూడా యీలాంటి పరిస్థితే దాపురించింది.... ఆత్మాభిమానంగల్ల ఏ ఆడది మరలా యాచనతో బయలుదేరు తుంది. కాలదన్నినా నువ్వే దిక్కని ఎన్నాళ్లు వెంటబడతారు. ఆత్మను చంపుకొని యాచించకపోతే యిక బ్రతుకేలేదు యిలాంటిచోట్ల...బ్రతికయినా ఆ యిల్లాలు సుఖపడిందీ లేదు... అందుకే యీ సాహసకార్యానికి పూనుకొంది.

సుగుణ : బాబుగారూ! సామాన్యంగా స్త్రీ ఆత్మహత్యకైనా తెగిస్తుందేగానీ ఆత్మాభిమానాన్ని గోల్పోయేందుకు అంగీకరించదు. కష్టా లనేవి ప్రతివాళ్లకు వస్తుంటాయి. వాటిని ఎదుర్కొనేందుకు దంపతులిద్దరూ కృషిచెయ్యాలిగానీ ఒకర్ని పీడించి, నానామాటలుపడి ఆ దొరికిన తృణమో పణమో ఎన్నాళ్లు సుఖంగా గడుపో గలుగుతాం చెప్పండి! నేను పరాయిదాన్ని.... ముక్కు ముఖం తెలియనిది యిలా నిందిస్తుందని అనుకోకండి బాబూ! మీ సోదరిలానే భావించి క్షమించండి మీ మనస్సుకేదయినా బాధగొల్పితే!

రమ : మీరు పల్కింది అక్షరాలా నిజం అమ్మా!

సుగు : మీరు గొప్ప వంశంలో, అగర్భ శ్రీమంతుల యింట్లో పుట్టవచ్చు, పెరగవచ్చు. కానీ, కాలం కలిసిరానప్పుడు సచ్ఛరిత్రులుకూడా అనాథులౌతారు. మనో నిశ్చయం, బుద్ధిబలం వున్నన్నినాళ్లు ఏలాంటి బాధలలోనైనా ఒకర్ని యాచించ నవసరంలేదు. ఎవరి పొట్ట వాళ్ళు నింపుకోవచ్చుకానీ ఆ రెండు ఉడిగిపోతేనే మానవునిలో దౌర్బల్యం కల్గుతుంది. అదే చివర కతన్ని నామరూపాల్లేకుండా చేస్తుంది బాబూ! చిన్నదాన్ని చెప్తున్నందుకు ఆగ్రహించకండి.

కామే : (విసుగ్గా) ఏమిటమ్మా యీ మెట్టవేదాంతం? యింతకీ ఎవరు నువ్వు?

సుగు : (ప్రశాంతంగానే) ఎవరయితేనేం! కానీ....మానవునిలో కరుణ దయాదాక్షిణ్యా లనేవి నశిస్తే యిక ఏది చెప్పినా మెట్టవేదాంతంలాగానే అనిపిస్తుంది బాబూ!

కామే : అబ్బ! ఏమిటీ గొడవ?

రమ : అన్నయ్యా!

సుగు : నువ్వూరుకో రమా!

రమ : ఆవేశంలో అహంకారం తప్ప అభిమానం, ఆదరణా అనేవి తెలియవు సుగుణగారూ!

సుగు : అన్నయ్యకన్నా నువ్వే ఆవేశపడుతున్నావేమో! ఆలోచించు.

రమ : నేనా!

సుగు : అవును. అగ్నికి వాయువులా అన్నయ్య ఆవేశానికి నీ కోపాగ్నితో మరికొంత ధూమం వేస్తున్నావ్?

రమ : ఆయన పనులు చూస్తే అందరికీ ఆవేశమేకాదు. అసహ్యం కూడా కల్గుతుంది.

పార్వ : రమా!

రమ : వదినా! యిందులో నీజోక్యం అక్కరలేదు. నేను ఆయన్ని చెల్లెలి తాహత్తులో అనే అధికారం వుంది.

పార్వ : అలాంటి విషయాలేమన్నా వుంటే నాముందనవద్దు.

రమ : అయితే యింకేం! ప్రక్కగదిలోకి వెళ్లిపోండి!

సుగు : అమ్మా! రమా! అన్నయ్య ఆవేశంకన్నా నీ ఆవేశమే మించిపోతూంది.

రమ : (ఆవేశంతో) ఊ! చూడండి సుగుణా! అలివిమాలిన ఆస్తి చేతికిచ్చి పోయారు మీ తల్లి దండ్రులు...కానీ సంపాదన లేకపోయినా హాయిగా కాలుమీద కాలువేసి తిన్నా రెండు జన్మలు గడిచిపోతయి...కానీ....నానావిధాలా నాశనంచేసాడు ...వళ్ళు పైతెలీకుండా ఖర్చుపెట్టాడు. యీనాడు భార్య పుట్టింటి వాళ్ళను పీడించి తినడం మరిగాడు. సంఘంలో, యిరుగుపొరుగుల మధ్యలో యింతకన్నా ఏం అవమానం కావాలి. చెప్పండి! లోకం ఏలానిందిస్తూందో నిలిచి వింటే ప్రేగులు తరుక్కుపోతయి. అలాంటి పనులన్నీ చేసింది కాక పైగా భార్యను యమయాతనలు పెట్టడం.... చివరకు భార్యను రక్షించి తన సంసారాన్ని కాపాడారన్న విశ్వాసంకూడా లేకుండా మిమ్మల్ని కూడా విసుక్కోవడం. యివేగా సాంప్రదాయాలు జెప్పండి!

సుగు : రమా! ఆవేశం అనేది సారామత్తులా తాత్కాలికం. ఆ మత్తు వదలింతర్వాత అన్నీ సక్రమంగా వస్తయి.

రమ : మీరెంత పిచ్చివారు సుగుణా! మీ అన్నయ్యలో ఆ మత్తు వదలితే యింకోమత్తు ఆవేశిస్తుంది. తెలుసా!

కామె : (కోపంగా) ర...మా!

రమ : ఏమన్నయ్యా! నేనంటూండేది అబద్ధమెంలేదే! అబద్ధముంటే క్షమించం డన్నయ్యా!

సుగు : రమా! నువ్వు పల్కింది నిజమైనా పెద్దా చిన్నా అనే తారతమ్యం...

రమ : ఊ: (విసుగ్గా) తారతమ్యం....తల నరిసినంత మాత్రానే పెద్దరికం రాదు సుగుణా!

సుగు : నిజమే! చూడండిబాబూ! యీనాడు యింట్లో అందరూ

బాధపడుతున్నారంటే కేవలం మీరుచేసే పనులకే కాదు.....
లోకం అంటూ ఒక టుంది....మనం తిన్నా తినకపోయినా లోకందృష్టిలో గౌరవంగా మెలగడం....లోకంచే గౌరవం పొందడం ముఖ్యం బాబూ ! నిజంగా మీ ఆస్తి మీరు నాశనం చేసుకున్నారు....దానివల్ల ఎవ్వరికీ ఏబాధాలేదు. కానీ యీనాడు మీరు సంసారం గడపక భార్యను హింసించి పుట్టింటినుంచి తెప్పించుకుంటున్నారంటే యితరులకు దృష్టిలో ఎంత చిన్న చూపో ఆలోచించండి. సమాన స్థాయిలో వియ్యాన్ని పొంది కూడా వారిని యాచించి, పీడించి విసికించి తెచ్చి కులాసగా ఖర్చు పెట్టుకుంటున్నారంటే వారివద్దగర మీ పరువుప్రతిష్ఠల విలువ ఎంత చెప్పండి ! మీరంటే వారు ఎంత చులకనగా చూస్తారు.

కామే : ఆ ! (కాస్త విచలితుడై)....యింతకీ మీరెవరు !

సుగు : (ప్రశాంతంగా) ఎవరయితేనేం బాబూ ! మీ సోదరిలాంటి దాన్ని ఏమైనా తప్పులుంటే క్షమించండి. మిమ్మల్ని న్యూన పరిచేందుకు రాలేదు. కాని యీనాటి పరిస్థితుల్ని గ్రామాలలో చూసేందుకు...చీకటికోణాల్లో చిక్కుకొని యిల్లే వైకుంఠం అని ఆవల ప్రపంచానికి సంబంధంలేక, కనీసం తోటివారి స్థితి గతులనుకూడా తెలుసుకోవాలని యిచ్ఛగించని అబల లెందరో వున్నారు. వారందర్నీ కలుసుకుందామని వచ్చాను. చూడండి బాబూ ! ఒక్క విషయం....వివాహం అయిన తొలిరోజుల్లో అనురాగంకొద్దీ అర్ధాంగికి అంతులేని ఆశలుగొల్పి ఎన్నో వాగ్దానాలిస్తారు. కాని జీవిత దుర్భర పరిస్థితులమూలంగా ఆ వాగ్దానాలకు విలువ యివ్వలేకపోతారు. అలా అని ఏ సంసారిక స్త్రీకికూడా తన వాగ్దానాలను చెల్లించమని ఆశించనైనా ఆశించదు. కారణం, సంసార పరిస్థితులే ! ఆ యజమాని పోషణక్రింద ముసలి తల్లిదండ్రులు, భార్యా, గంపెడు సంతానం వుంటారు. అతను సంపాదించే నాల్గురాళ్ళు భార్యచేతులోనే వుంచుతాడు తృప్తిగా ! కాని వాటితో ఏంచెయ్యాలో నన్న సంశయం, అసంతృప్తి భార్యలో వెంటాడుతాయి. దానిపైనే ఆ సంసారంలో కోపాలు, కలహాలు, కలతలు ప్రారంభ మవుతాయి. యిలాంటి పరిస్థితుల్లో ఆ సంసారాల్ని ఎవరు ఆదుకుంటారు ? ఎలా ఆదుకుంటారు ? ఎన్నాళ్ళు ఆదుకుంటారు ? చెప్పండి. ఒకరోజుతో తీరిపోయే సమస్యకాదు. యిలాంటి సమస్య జటిలంగానే తయారవుతుంది. చివరకు ఆ సంసారపు నౌకను యీదలేక, ఆలోచించి, ఆలోచించి చివరకు పిచ్చిపట్టిపోతుంది ఆ యజమానులకు.

రమ : నిజమేనమ్మా ! మీరుచెప్పినట్లుగా వున్న సంసారాలను ఎన్ని చూస్తున్నాం మనం. కానీ యిలాంటి సమస్యల్ని ఎదుర్కోవడం దుస్సాధ్యమె !

సుగు : (నవ్వుచూ) దుస్సాధ్య మేమిటండీ ! మానవులు తలుచుకోవాలేగాని దుస్సాధ్యాలు సాధ్యాలే అవుతాయి. ఈ ఆధునిక ప్రపంచంలో మానవుని శక్తికి మించిపోయేదేమీ లేదు. ధైర్యము, పట్టుదల, సహభావం వుంటే చాలు. అన్నీ సమకూరుతాయి. ముఖ్యంగా పై భావనలన్నీ భార్యాభర్తల మధ్యలో అవసరం. ఇద్దరిలో అన్యోన్యత, సహభావన, సహకారం వుంటే యింత యిక్కట్టు పడాల్సిన అవసరం లేదమ్మా !

రమ : సుగుణగారూ ! నిజంగా మీ మాటలు మూర్ఖుల్నికూడా మార్చివేస్తయమ్మా

సుగు : సంతోషం తల్లీ ! నా జీవితంలో ఒక్కర్ని మార్చగల్గినా ధన్యురాలనవుతాను...కానీ అలా చెయ్యాల్సిన బాధ్యత విద్యుక్తధర్మమే నాది...

కామే : నిజమేనమ్మా !....సుగుణా !....రమ చెప్పింది అక్షరాలా నిజం....మీ మాటలు నా అజ్ఞాన నేత్రానికి అంధత్వం కల్పించాయి తల్లీ !

సుగు : నిజంగా అంటున్నారా బాబూ !

కామే : నిజమేనమ్మా ! (భార్యకేసి చూస్తూ) పారూ !....మనస్సులో ఏమీ వుంచుకోకు.

పార్వ : అంతమాట అనకండి. నాకేమీ బాధలేదు.

రమ : తల్లీ ! భవానీ ! మా అన్న ఎప్పుడూ యిలాంటి బుద్ధితో వుండేలా దీవించు తల్లీ !...మా వదినకు మాత్రం బావిలో పడాలని ఆశ మాత్రం కల్గించకు....(అంటూ నవ్వుతుంది.)

పార్వ : ఛీ... ఊరుకో !

రమ : ఏం ? మరలా...

కామే : యింక భయం లేదమ్మా ! చెల్లాయి....పారూ ! యీ రోజు వీరు యిక్కడే మన అతిథులుగా వుంటారు. త్వరగా భోజనం ఏర్పాట్లు చెయ్యి...అమ్మా రమా ! నువ్వుకూడా వదినకు కాస్త సహాయంచెయ్యి పాపం చేసుకోలేని స్థితిలో వుంది.

రమ : అలాగే అన్నయ్యా! అయినా యీ పాపం పూర్వం ఎక్కడికి పోయిందో ?

కామే : యిక అలా అని ఎత్తిపొడవకు తల్లీ !

రమ : సరే చూస్తాగా ! పదవమ్మా వదినా !

సుగు : మీరేం అభ్యంతరం చెప్పకుంటే నేను వంటలో మీకు తోడ్పడతాను.

కామే : మీరా ! వద్దు తల్లీ. చదువుకున్న వాళ్లు.

సుగు : మీ రాభావనలు తీసుకరాకండి !

పార్వ : మీకెందు కంత శ్రమ; మీరు కాస్త విశ్రాంతి తీసుకోండి. నేను యిప్పుడే పనంతా పూర్తిచేసి పిలుస్తాను.

సుగు : ఎంత మాటన్నారు. నిజంగా లేవలేనివారు మీరు. నన్ను కూర్చోబెట్టి చెయ్యడమా ! ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు. మీరలా పీట పైని కూర్చోండి. మీ సలహాలతో నేను, రమా వంట చేస్తాం! మీరిందులో అభ్యంతరం చెప్పకండి బాబూ !

కామే : సరే. మీ యిష్టం తల్లీ ! మీ ముచ్చట్లకు నే నడ్డురావడం ఎందుకు !

(సశేషం)

---

# ప్రభుత్వ నిర్ణయాలు

తెలంగాణా ఉద్యోగుల ఫిర్యాదుల విచారణసంఘం సమర్పించిన నివేదికను రాష్ట్రప్రభుత్వం ఆమోదించింది. రాష్ట్రాల పునర్నిర్మాణం సందర్భంగానూ, పూర్వహైదరాబాదు రాష్ట్రపు ఉద్యోగులకు ఇవ్వబడిన రక్షణలకు విరుద్ధంగా ఒకవేళ ఏమైనా చర్యలు తీసుకొనడం జరిగితే ఆ విషయంలోను ప్రభుత్వోద్యోగులు చేసిన ఫిర్యాదులను పరిశీలించే నిమిత్తం ఈ సంఘం నియమించబడింది.

ఈ సంఘం వారు 37 పర్యాయాలు సమావేశమై తమకు వచ్చిన 3,978 ఫిర్యాదులను పరిశీలించారు. వాటిలో 657 ఫిర్యాదులను, అవి సంఘం పరిశీలనాంశాలలో చేరవు కాబట్టి, రాష్ట్రాల పునర్నిర్మాణచట్టం క్రింద భారతప్రభుత్వంచేత నియమించబడిన సంఘాలకు నివేదించడం జరిగింది. సర్వీసుల ఏకీకరణ, సమిష్టి సీనియారిటీ లిస్టుల తయారీకి సంబంధించిన వ్యవహారాలను ఈ సంఘాలు చూస్తున్నాయి.

ఉపాధ్యాయులకు సంబంధించిన 2,814 ఫిర్యాదులను ఈ సంఘం పరిశీలించింది. ప్రభుత్వాధికార్లు నిబంధనావళికి తప్పుడు వ్యాఖ్యానాలు ఇవ్వడంవల్ల ఉత్పన్నమైన ఫిర్యాదులివి.

ఇతర శాఖలకు సంబంధించిన ఫిర్యాదుల సంఖ్య 1,164. వాటిలో 507 ఫిర్యాదుల విషయంలో ఆమోదానికి సిఫార్సులు చేయబడినాయి. ఇప్పటివరకు ప్రభుత్వం 452 ఫిర్యాదులను ఆమోదించింది. రెండింటిని నిరాకరించింది. మిగతా 53 విషయంలో ఇంకా నిర్ణయం తీసుకోవలసివుంది. నివేదికను సమర్పించిన తరువాత ఈ సంఘం రద్దు పరచబడింది.

బేగంపేటవద్ద నూరు ఎకరాల స్థలంలో రు. 2 కోట్ల వ్యయంతో నూతన సచివాలయభవనాన్ని నిర్మించడానికి తలపెట్టబడినది. మూడు అంతస్తులుగా నిర్మింపబడే ఈ భవనంలో కొన్ని గదులకు ఎయిర్ కండిషన్ సౌకర్యం వుంటుంది. ఈ మూడు అంతస్తులు కాక పైన మరో రెండు అంతస్తులను నిర్మించడానికి అనువుగా ఈ భవనం పునాదులను త్రవ్వుతారు. ఇక్కడ విశ్రాంతి గదులు, క్యాంటీన్లు మొదలైన వాటిని నిర్మించడానికికూడా తలపెట్టబడింది. ఈ నిర్మాణాలకు ఈ సంవత్సరపు బడ్జెటులో రు. 20 లక్షల మొత్తం కేటాయించబడింది. నగరాభివృద్ధి సంస్థ నిర్మాణాన్ని చేపట్టుతుంది. భవనాల నిర్మాణం పూర్తికావడానికి బహుశా నాలుగు సంవత్సరాలు పట్టవచ్చు.

ఈ సంవత్సరం నవంబరు, డిశెంబరు నెలలలో క్రొత్తఢిల్లీలో జరుగనున్న భారత పారిశ్రామిక ప్రదర్శనంలో మన రాష్ట్రం కూడా పాల్గొంటుంది.

# మధులక్ష్మి

జొన్నలగడ్డ మృత్యుంజయరావు

తిగ్మదీధితి సముఁడు మతిక్రమించి
ధనదగుప్తాశఁ గూడ నుద్యతుఁడు గాఁగఁ,
దాపనిశ్శ్వసన మ్మన దక్షిణాశ
ముఖమునఁ గంధవహమును బొలయఁ జేసె.

2

పై దలుల రణన్నూపుర
పాదాహతిఁ బడ కశోకపాదపమును దా
బోదియ మొదలుగ నలరుల
తోఁ దలిరులతో నెసంగెఁ దోడ్తో నంతన్.

3

సుమశరుఁడన్ నిషంగికి నిషువ్రజకారి మధుండు పల్లవో
ద్గమ రమణీయపత్త్రమహితంబగు నూతనచూత కంకప
త్త్రము పరిపూర్ణతం గనఁగఁ దత్క్షణ మవ్విలుకాని పేరి వ
ర్ణములని తోఁచురీతి భ్రమరమ్ముల నిల్వఁగఁ జేసె దానిపై.

4

కర్ణికార మెంత వర్ణోజ్జ్వలం బయ్యు
గంధరహిత మగుటఁ గలఁచు నెడఁద
విశ్వసృట్ప్రవృత్తి విముఖమౌఁ దఱచుగా
వస్తుగుణ సమగ్ర భావవిధిని.

5

విరియకుంట బాలవిధు భంగి వంకలై
యమిత లోహితములు నయి పలాశ
ములు దలిర్చె మధుని బొంది వనస్థలు
లందు నవ నఖక్షతాళి యట్లు.

6

లగ్న మధుప కజ్జల రచనా చిత్రమౌ
తిలకమును ముఖానఁ దీర్చి దిద్ది,
మావి చిగురు మోవి మధులక్ష్మి బాలార్క
లలిత రాగమున నలంకరించె.

7

అడవులఁ బ్రేంకనవుం బువుఁ
బోడి కనులం బడి కలంప, మొఱమొఱ సవడిం
బడుచుండ నెండుటాకులు,
కడుఁ బొగరున గాలి కెదురుగాఁ జను లేడుల్.

8

మావి చివురుల మేయుటఁ దూవరంపు
జెలుఁగు గల పుంస్పిక మ్మింపు గులుకఁ గూయు;
నదియె మానవతీమానహరణ దక్షు
మైన సుమబాణు నానతి యనఁగఁ దోఁచు.

9

హిమము దొలంగుట వైశ
ద్యమునం బెదవులును, ముఖము లా పాండురతం
గోమ రొప్పఁగఁ గింపురుష
ప్రమదలకుం జెమట వొడమెఁ బత్త్రరచనలన్.

10

స్థాణు వనములోని తపసులు తదకాల
మాధవ ప్రవృత్తి మదిఁ గనంగ
నొదవు మదన వికృతు లదిమికొని యెట్టెట్టొ
హృదయములను నిగ్రహించుకొనిరి.

11

అమ్మదనుండు త్ర్యంబకవనాంతరసీమకుఁ దా లతాంత చా
పమ్ము నధిజ్యమౌ నటులు వర్తిలఁ జేసి రతిద్వితీయుఁడై
యిమ్ముల నేఁగుదేర, వెలయించెను స్థావర జంగమ స్వరూ
పమ్ములు ద్వంద్వముల్ క్రియలఁ బారము ముట్టిన ప్రేమభావముల్.

12

భ్రమరిఁ గూడిమాఁడి ప్రసవైక పాత్రమ్ము
నందు నళికుమారుఁ డానె మధువు;
శృంగమునను గీఱెఁ గృష్ణసారము దాని
సొంగసి కన్నుదోయి మొగుప మృగిని.

13

కమల రేణుగంధి గండూష జలమిచ్చెఁ
గూర్మి మీఱఁ గరిణి కుంజరమున;
కర్ధభుక్త బిసము నందిచ్చి చక్రాంగ
మాదరించె మిథుల నాత్మ సఖిని.

14

వేసటలేక కిన్నరుఁడు స్వేదపయఃకణజాలకించిదు
చ్ఛ్వసితపత్త్రిరేఖమును బంధురగంధమధుద్రుమప్రసూ
నాసవపానఘూర్ణితదృగంబుజశోభితమున్ ప్రియాస ము
ద్భాసి ముఖమ్ము ముద్దుగొనెఁ బాటకుఁ బాటకు నంతరమ్మునన్

15

ప్రసవ గుచ్ఛకుచము, ప్రస్ఫురత్కిసలోష్ఠ
మగు లతావధూజనాళి వలన
విటపి వరచయమ్ము వినమిత శాఖా భు
జోపగూహనముల నొంది యొప్పె.



# "తీవ్రతర జిల్లా వ్యవసాయ కార్యక్రమం"

పెరుగుతున్న దేశ జనాభా అవసరాలకు అనుగుణంగా భారత దేశం తన వ్యవసాయోత్పత్తిని పెంపొందించుకోవలసి వుంది. కాబట్టి అధికాహారోత్పత్తిని సాధించడానికి మన దేశంలో అనేక పథకాలు అమలుపరచ బడుతున్నాయి. వీటివల్ల మన ఆహారపరిస్థితి కొంతవరకు చక్కబడిందికూడా. ఇప్పుడు దేశంలో ఆహారధాన్యాల ఉత్పత్తి పెరిగిపోయిందనడంలో ఎంత మాత్రం సందేహం లేదు. మొదటి పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలకు అధికతర ప్రాముఖ్యతనిచ్చి, వ్యవసాయోత్పత్తి పెరుగుదలకు విశేష కృషి జరుపబడింది. పోతే రెండవ ప్రణాళికలో పరిశ్రమల అభివృద్ధికి ప్రాముఖ్యత ఇచ్చినా వ్యవసాయాభివృద్ధి పథకాలకుకూడా తగినంత ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. మూడవ ప్రణాళికా కాలం ముగింపు నాటికి పెరిగిన దేశ జనాభా అవసరాలను పూర్తిగా తీర్చడానికి మన దేశంలో 11 కోట్ల టన్నుల ఆహార ధాన్యాలను పండించవలసి వుంటుంది.

వ్యవసాయోత్పత్తిని శీఘ్రగతిని పెంపొందించడానికి భారత దేశం బృహత్పథకాలను తక్షణమే చేపట్టవలసిన, ఆవశ్యకతను గూర్చి వ్యవసాయ శాస్త్ర నిపుణులు ఎప్పటికప్పుడు నొక్కి చెబుతూ వున్నారు. ఈ విధంగా సిఫార్సులు చేసిన వారిలో ఫోర్డు ఫౌండేషను తాలూకు వ్యవసాయోత్పత్తి విషయాల బృందం కూడా ఒకటి గరిష్ఠ ఉత్పత్తి జరగడానికి అవకాశం వున్న ప్రాంతాలలో వ్యవసాయోత్పత్తిని ఇతోధికంగా సాధించడానికి అయిదు సంవత్సరాలపాటు ప్రయోగచర్యలు తైకొనడానికిసంబంధించిన ఈ బృందం సిఫార్సుచేసింది. ఈ సిఫార్సు ననుసరించి భారత ప్రభుత్వం 1959 అక్టోబరు నెలలో ఒక ముసాయిదా పథకాన్ని రూపొందించింది. నిర్ణీత ప్రదేశాలలో వ్యవసాయోత్పత్తిని తీవ్రతరం చేయడానికి ఉద్దేశింపబడిన ఈ కార్యక్రమాన్ని "ప్యాకేజ్ పథకం" అని పిలుస్తున్నారు.

సమీకృత కార్యక్రమం :

వ్యవసాయోత్పత్తిలో సత్వరాభివృద్ధిని సాధించడమనేది, వ్యవసాయ ప్రాంతాలలో ముఖ్యంగా, సారవంతమైన భూములు వుండి. నీటి పారుదలకు నమ్మకమైన వనరులు వుండి, ప్రకృతి దుశ్చర్యల తాకిడి తక్కువగా వుండి, సహకార సంఘాలు మొదలైన ఇతర గ్రామీణ సంస్థలను శీఘ్రగతిని పటిష్ఠం చేయడానికి అవకాశాలు వున్నటువంటి ప్రదేశాలలో మేలురకం విత్తనాల గింజలు. ఎరువులను సరఫరా చేయడం, మొక్కల సంరక్షణ చర్యలు తీసుకోవడం, సులభవాయిదా పద్ధతిపై రైతులకు పరపతి సౌకర్యాలు కల్పించడం వంటి అంశాలపైన ఆధారపడి వున్నది. నిర్ణీత ప్రదేశాలలో అధికాహారోత్పత్తి సాధనలో సత్వర ఫలితాలను పొందడానికి అనువుగా కృషిని తీవ్రతరం చేసి ఏకోన్ముఖంగా సమీకరించడానికి ఉద్దేశించిన ఈ కార్యక్రమానికి "తీవ్రతర జిల్లా వ్యవసాయ కార్యక్రమం" అన్ని పేరు పెట్టబడినది. దీనిని "సాంద్ర వ్యవసాయ కార్యక్రమం" అనికూడా అంటున్నారు. మన రాష్ట్రంలో ఈ పథకాన్ని అమలుపరచడానికి అనువైన ప్రాంతంగా పశ్చిమ గోదావరి జిల్లాను రాష్ట్ర ప్రభుత్వం ఎన్నికచేసింది. ఎందుకంటే కేంద్ర ప్రభుత్వం తెలిపిన ప్రకారం ఈ పథకాన్ని అమలుపరచడానికి కావలసిన వసతులన్నీకూడా ఇక్కడ అందుబాటులో వున్నాయి.

ఈ పథకం క్రింద. నిర్ణీత గడువు లోపుగా అంటే అయిదవ సంవత్సరం ముగింపులోగా ఉత్పత్తి స్థాయిని నూటికి సుమారు 50 వంతులవరకు పెంచడానికి ఉద్దేశింపబడినది.

"సాంద్ర వ్యవసాయ కార్యక్రమం" క్రింద జరుగు పనులలో ముఖ్యమైనవి ఇవి :

1. వ్యవసాయ క్షేత్రాల ఉత్పత్తి ప్రణాళికల ద్వారా



"సాంద్ర" వ్యవసాయ పథకానికి ఏలూరులో 1960 డిశెంబరు 23వ తేదిన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. చిత్రంలో ప్రేక్షకులను చూడవచ్చు.

రైతుల అవసరాలను గూర్చి తెలుసుకొనడం. వివిధ రైతుల భూఖండాలకు విడి విడిగా ఇటువంటి ప్రణాళికలను తయారు చేస్తారు.

2. మేలురకం విత్తనాల గింజలు, ఎరువులు మొదలైన వాటిని సరఫరా చేయడం పరపతి సౌకర్యాలు కల్పించడం.

3. ధాన్యం నిల్వలకు సదుపాయాలు కల్పించటం.

4. శాస్త్రీయ ప్రమాణాలను నిర్వహించటం.

5. బంచ్-మార్కు సర్వే, ఇవాల్యుయేషన్.

6. స్థానికపనులకార్యక్రమాలు-డ్రెయినేజి వగైరా.

7. భూసారతనిఖిసౌకర్యాలు.

8. ఆధునిక వ్యవసాయ పనిముట్ల తయారీ.

వ్యవసాయోత్పత్తికి అనువైన మార్గాలేమిటో చాలవరకు తెలిసివున్నప్పటికిన్నీ, అనుకూల ప్రాంతాలలోనయినా ప్రస్తుతం వాటిని, తగువిధంగా ఆచరించటం జరుగుటలేదు. ఇప్పుడీ కార్యక్రమం క్రింద, అందుకు కావలసిన సౌకర్యాలన్నీ సమకూర్చ ప్రయత్నం చేయబడుతుంది.

ఉత్పత్తి పథకాలు రూపొందించుకోవటంలోనూ, వీటిని నిర్వహించటంలోనూ రైతులకు తోడ్పడేందుకై అదనపు సిబ్బందిని నియమించటంద్వారా వ్యవసాయ, సహకారశాఖల సిబ్బందిని అవసరాల కనుగుణంగా పెంచటం జరుగుతుంది. ఆ రకంగా తయారుచేసిన పథకాలు ఒక్కొక్క రైతుకు కావలసిన అవసరాలను సూచిస్తాయి. విత్తనాలు, ఎరువులు, పనిముట్లు, తెగుళ్లకు మందులు వంటి అత్యవసర వస్తువులు తగు మొత్తాలలో తరుణంలో సప్లయిచేయాలని నిర్ణయించబడింది.

సహకార సంఘాలకు అధికసహాయం

ఎడ్ల బండ్లకు అందుబాటులో వున్న దూరంలో మార్కెటు సదుపాయాలు, సప్లయిలు సమకూర్చడానికి గిడ్డంగుల సంఖ్య పెంచబడుతుంది. ఈ పథకం క్రింద రుణాలు ఇవ్వడానికీ, ధాన్యం అమ్మకానికీ పొందిక పర్పాటుజేస్తారు. అత్యవసర వస్తువుల కొనుగోలుకై రైతులందరికీ సకాలంలో తగినంత అప్పులు అందుబాటులో వుంచడానికిగాను సహకార సంఘాలకు ఇచ్చే ఆర్థిక సహాయం హెచ్చించటం జరుగగలదు. అలాగే పండించిన ధాన్యాన్ని సక్రమమైన విధంగా అమ్మకంచేసి, రైతులకు న్యాయమైన ధర గిట్టుబాటు అయ్యేట్లు చూడటంకూడా సాధ్య

పడుతుంది. ఒక ఉత్పత్తి పథకంతో ఈ కార్యక్రమంలో పాల్గొనే రైతులందరూ ఋణాలు పొందటానికి అర్హులు.

శాస్త్రీయ పద్ధతులను ప్రదర్శించటం ద్వారా ఉత్తమమైన సాగువిధానాలలో రైతులకు ఇతోధికంగా విద్య గరపాలని కూడ ఈ కార్యక్రమంక్రింద తలంచబడింది.

ఈ నిర్ణీత జిల్లాలో ప్రస్తుత ఉత్పత్తిస్థాయిని పరీక్షించే ఒక సమగ్ర పరిశీలన ముందు చేపట్టబడుతుంది. ఆ పరిశీలన వల్ల ఉత్పత్తి పథకాలు రూపొందించుకోడానికే గాక, ఎప్పటికప్పుడు సాధించిన అభివృద్ధిని పంటకోతల ప్రయోగాలద్వారా గణనకు తీసుకోడానికికూడా అవకాశం చిక్కుతుంది. అలా చేయడం మూలంగా కార్యక్రమం ద్వారా తామెంత లాభం పొందిందీ రైతులు గుర్తించ వీలవుతుంది.

ఈ పథకంక్రింద డ్రైనేజి, వార్తా సౌకర్యాలు మొదలైన స్థానిక పనుల కార్యక్రమాలను చేపట్టడానికి అవకాశం కల్పించబడింది. రైతులు వినియోగించే ఆధునిక వ్యవసాయ పరికరాల తయారీకి, మరమ్మత్తుకు వర్కుషాపును స్థాపించే ప్రతిపాదన కూడా యీ కార్యక్రమంలో చేరివున్నది. ఈ జిల్లాలోనే భూసార పరిశీలనా కేంద్రం ఒకటి స్థాపించాలని నిర్ణయించబడింది. భూమిసారాన్ని బట్టి ఏ పొలానికి సరకమైన ఎరువు వాడాలో నిర్ణయించ సాధ్యపడుతుంది.

దీన్నిబట్టి, మేలైన విత్తనాలు, అన్నిరకాల ఎరువుల వాడకంతోనూ, ఉత్తమ సాగు పద్ధతుల అనుసరణ, నీటిపారుదల సౌకర్యాలను వీలైనంతమేర ఉపయోగించుకోవటం ద్వారాను ఆధునిక వ్యవసాయ పరికరాలను సంపూర్ణంగా వినియోగించుకోవటం ద్వారానూ మొత్తం ప్రాంతాన్ని సస్యశ్యామలం గావించడానికి ఈ కార్యక్రమంక్రింద తీవ్రంగా కృషి జరుగుతుందని సుస్పష్టమవుతున్నది. ఈ కృషి ఫలించినపుడు అధికోత్పత్తి దానంతట అదే లభిస్తుంది.

### ఆంధ్రప్రదేశ్‌లో

రాష్ట్రంలో 1960-61 రాబీ సీజను నుండి యీ పథకం పశ్చిమ గోదావరి జిల్లాలో ప్రవేశపెట్టబడింది. ఈ జిల్లా విభాగింప బడిన 25 మండలాలకుగాను ప్రస్తుతం పనిచేస్తున్న 20 మండలాలలో యీ పథకం అమలుపరచబడుతున్నది. తతిమ్మా 5 మండలాలుకూడా రూపొందటంతో అక్కడకూడా యీ



పంట కోత తరువాత ....

పథకం విస్తరింపజేయబడుతుంది. ఈ పథకంక్రింద వరి, చెఱకు, అరటి, మిరప పంటలకు మాత్రమే సదుపాయాలు లభిస్తాయి.

పశ్చిమ గోదావరి జిల్లాలోని 25 మండలాలకు ఐదేండ్లపాటు సాగే యీ కార్యక్రమం మొత్తం వ్యయం రు. 94 లక్షలని అంచనా. ఋణం క్రింద ఇచ్చే మొత్తం ఇందులో చేరలేదు. ఈ పథకం వ్యయాన్ని ఫోర్డుసంస్థ, కేంద్రప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వాలు భరిస్తాయి.

వనరులన్నింటినీ జిల్లాలోని రైతుల అధీనంలో వుంచినందు వల్ల ఉత్పత్తిస్థాయి ఏ విధంగా పెరిగేదీ ఇక పరిశీలిద్దాం. వరి పంట ప్రపంచంలోకెల్లా అత్యధికంగా పండించిన ఘనత స్పెయిన్ దేశానికి దక్కుతుంది. అక్కడ ఎకరాకు 5139 పౌనులు పండించారు. ఎకరాకు ఇటలీలో 4615 పౌనులు, జపానులో 4198 పౌనులు, చైనాలో 2424 పౌనులు పండింది. ఈ అంకెలతో పోల్చిచూస్తే భారతదేశంలో సగటు ఉత్పత్తి పై దేశాల ఉత్పత్తిలో 25 నుంచి 50 శాతం మాత్రమేనని వెల్ల డవుతోంది. ఆంధ్రప్రదేశ్‌లోని పంటల పోటీలలో 1957-58 సంవత్సరాన శ్రీకాకుళం జిల్లాలో పండిన 10380 పౌనులు మన సగటు అధికోత్పత్తిగా తేలింది. ఎకరాకు పశ్చిమగోదా వరిజిల్లా సగటు ఉత్పత్తి 1830 పౌనులున్నూ, మారుటేరులోని వ్యవసాయ పరిశోధనా కేంద్రం సగటు ఉత్పత్తి 2820పౌనులున్నూ భారతదేశ సగటు ఉత్పత్తి అయిన 1236 పౌనులతో పోల్చితే ఎక్కువన్నది సువ్యక్తం. 1957-58 పంటలపోటీలో ఎక్కువగా (8000 పౌనులు) పండింది యీ జిల్లాలోనే కనుక అధికోత్పత్తికి ఇక్కడ అవకాశాలు మెండు అని స్పష్టంగా గ్రహించవచ్చు. అందుచేత, యీ పథకం క్రింద ఎన్నుకున్న వరి, చెఱకు, అరటి, మిరప వంటి ముఖ్యమైన పంటల ఉత్పత్తిస్థాయిని తగినంత మేర పెంచటం సాధ్యమే. ఈ పథకం చివరి సంవత్సరం అంటే ఐదో యేడు ఆఖరున 50 శాతం హెచ్చింపు సులభంగా సాధించ వచ్చునని ఆశించబడుతోంది.

పథకం విజయం ఎక్కువగా రైతులందించే సహకారంపై ఆధారపడి వున్నది. పశ్చిమ గోదావరి జిల్లా ప్రజలు యీ సదవకాశాన్ని సద్వినియోగ పరుచుకుని దేశం ఐశ్వర్యవంతం గావడానికి మార్గాన్ని ఇతరులకు చూపుతారని ఆశించబడుతోంది.

"జీవితం సానవంటిది. జీవితాన్ని పిండిచేయడం లేక జీవితానికి వన్నె తేవడం అనేది మనిషి తత్వం మీద ఆధారపడి వుంది."

* * *

సమయం మించిపోయేవరకూ చాలామంది గ్రహించలేని సత్యం ఏమిటంటే, నీ వెంతగా దుఃఖానికి దూరంగా వుండాలని ప్రయత్నిస్తావో, అది నీకంత చేరువ చేరుతుందనేది. ఎందుకంటే బాధకు లోనవ్వల్సి వస్తుందనే భయంవల్లనే, అతిస్వల్ప విషయాలు కూడా నిన్ను పీడించడం మొదలెడతాయి.

— థామస్ మార్టన్

# నవవర్ష పదాంజలి

'రామకృష్ణ భరద్వాజ'

ఆంధ్ర జనపాళి ననయమ్మునతులరాఁగ
సంపదల ముంచితేల్చి, స్వస్థానయాన
యత్న సిద్ధమౌ శార్వరి! అందుకొనుమ!
వినుత సంతృప్త హృదయాల వీడుకోలు. 1

ఒక ఋతురేఖ — అనూహ్యమధురసార్ద్రవాంఛాకుసుమబంధపదముగాఁగ,
ఒక వేఁడి పోఁడిమి — ఉగ్రపాపాశనవ్యగ్రమౌమృత్యుగహ్వరము గాఁగ,
ఒక నీటిబిందు వనుపమసంసారయాత్రాతృషితామృత ధారగాఁగ,
ఒక శీతవాతమనూనప్రణయకోపభామాపతుల రాయబారి గాఁగ,
ఏఁటికేఁడాది శుభదమై ఏటికిపుడు కాలు కదిపెదు శార్వరీ! కడుపులోన
మమ్ము విడి యేగు బాధార్తి మసలెనేమొ — వేఁడి నిట్టూర్పు గాడ్పుగా వీవఁదొడఁగె 2

ఐనఁ గానిమ్ము — నీ చోటు లధికసుఖము
లిచ్చునట్టివి కావచ్చు నింతకంటె,
ఆంధ్ర జనవాక్కు తథ్యమై అమరుఁగానఁ
బోయిరమ్ము — శుభమ్ములు పొందు నిన్ను. 3

జీవమ్మయి - రసపదరా
జీవమ్మయి - సరళభావసిద్ధ్యవిరతసం
జీవమ్మయి - ప్రియభాషం
రావమ్మయి వఱలుగతిని రక్తిని జనుమా 4

ఓ గమనప్రభావజనితోన్నతహర్ష జనాంజలిప్లవా!
స్వాగత పుణ్యదీక్ష నిరువంకల నాంధ్రజనుల్ నిబద్ధ హృ
ద్వేగ పరిప్లుతాంగులయి వేఁచిరి - వారి యభీష్ట భావ సం
యోగమనోజ్ఞహారతుల ఉజ్జ్వల దీప్తుల నాదరింపుమా! 5

నీ పవన ప్రవాహ కమనీయ పరిమళ సస్యపుంజని
క్షేపము లందగింపవలె క్షేత్రములందు సతంబు - సర్వ ది
గ్వ్యాపిత సౌమ్యతాగరిమ గావలె నీ చరితమ్ము - గణ్య సం
స్థాపిత పుణ్యసంగతి సుధారుఁడవై చరియింపఁ గావలెన్ 6

భారతదేశమందు నెఱవాఱెను వత్సర పూర్వదిక్కు - మైఁ
జేరిన మాంద్యము న్వదలి చేతనుఁ డిప్పుడ యౌనరుండు సం
ధ్యారుణ బింబమై యెసఁగు త్వద్గుణ తత్త్వమెఱుంగఁ డింకఁ ద
త్సార పథప్రవేశమునఁ జంద్రుఁడ వౌదువొ - సూర్యుఁడౌదువో ! 7

ఒక్కొక వత్సరమ్మునకు నొక్కొక మెట్టు నమర్చి - భావిలోఁ
జక్కని భాగ్యశిల్పముల సౌధము నిల్పఁదలంచి మించు మా
మక్కువ కానుకూల్యపరమాప్తిని శక్తిని గూర్చి దేశపున్
టెక్కు ప్రణాళికల్ విజయ వీధులఁ దీరెడు నట్లొనర్పుమా ! 8

'ఇల - ముమ్మూర్తుల దివ్యతేజమున వర్తిల్లున్ సదా' యన్న ప్రాఁ
బలుకున్ సత్యమెఱుంగఁ జేయుటకు నాఁ ప్రారంభమై, రెండు మూ
ర్తులఁ బంచాబ్ద వరప్రణాళికలు నారోపించె - నింకన్ భవ
ద్విలసత్పాలనమందు నీశ్వర శుభాప్తిన్ నాందిఁ బల్కింపుమా ! 9

దరహాస మాత్రాన - ధరణి వణకఁజేయు నీతిబాధల జాతి భీతినంద,
బొమముడి కలిమిచే - 'భూమి నాదే'యన్న ఆశా సువాసమ్ము నాశమంద,
అఱమోడ్పు చూపుచే - నధికచికీర్షలౌ సాహసోపేతు లుత్సాహమంద,
నిడుద చేనిల్పుచే - నిఖిల సుఖార్థులౌ బుద్ధిజీవులు చిత్తశుద్ధి నంద,

నిట్టి విన్యాస కౌశల మెఱిఁగి నీవు నిత్యకల్యాణ విలసిత నిధులఁ బెఱుఁగ
నిన్నుఁ బదికాలములపాటు నెన్నుకొనఁగఁ బాలనము సేయు మోప్లవవత్సరంబ ! 10



# రాష్ట్ర బడ్జెటు 1961-62

ఆంధ్రప్రదేశ్‌లో భారీ పరిశ్రమల అభివృద్ధికి రాష్ట్రప్రభుత్వం లోగడ స్థాపించిన పారిశ్రామికాభివృద్ధి సంస్థతో పాటు, లఘుపరిశ్రమల అభివృద్ధిసంస్థ, ఖనిజాభివృద్ధి సంస్థ అనే మరో రెండు సంస్థలను ఒక్కొక్కదానికి రు. 50 లక్షల ప్రారంభ పెట్టుబడితో ప్రభుత్వం స్థాపించ నుద్దేశించిందని ఆర్థిక శాఖా మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, 1961 ఫిబ్రవరి 20 వ తేదీన ఉభయ శాసన సభలలో బడ్జెటు అంచనాలను ప్రతిపాదిస్తూ అన్నారు.

ఈ బడ్జెటు అంచనాల ప్రకారం రెవిన్యూఖాతాలో ఆదాయం రు. 85.13 కోట్లు కాగా వ్యయం రు. 87.63 కోట్లు. ఈ అంచనాలలో పెట్టుబడి ఖాతాక్రింద రు. 1.44 కోట్ల లోటుతో రు. 33.11 కోట్ల ఆదాయాన్నీ, రు. 34.55 కోట్ల వ్యయాన్ని చూపించారు. క్రిందటేడు వలెనే ఈ ఏడాది కూడా కొత్తగా పన్ను విధింపు ప్రతిపాదనలను వేటినీ చేయలేదు. తృతీయ పంచవర్ష ప్రణాళిక మొదటి సంవత్సరం బడ్జెటులో కొత్తపన్నులను వేటినీ చేర్చనప్పటికీ రు. 305 కోట్లు రాష్ట్ర ప్రణాళికకు, వచ్చే నాలుగు సంవత్సరాలలో రు. 38 కోట్లను పన్నులద్వారా సమకూర్చుకోవలసివున్నది. అందుకు ప్రవేశ పెట్టే పన్ను విధానాలు ఎలావుండేదీ ఊహించడానికి ఇది సమయం కాదని ఆర్థిక మంత్రి అన్నారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రభుత్వాదాయం, వ్యయం, ప్రజల నుండి పొందిన ఋణాల మొత్తాలలో విపరీతమైన పెరుగుదల వచ్చినదని చెబుతూ ఈ కాలం (1956-60)లో ఆదాయం రు. 40.43 కోట్లనుంచి రు. 87.80 కోట్లకు పెరగగా వ్యయం రు. 47.42 కోట్లనుంచి రు. 86.12 కోట్లకు పెరిగినదనీ అదేవిధంగా ప్రజల వద్దనుండి పొందిన ఋణం మొత్తం రు. 108.46 కోట్ల నుంచి రు. 2046.3 కోట్లకు హెచ్చిందని శ్రీ బ్రహ్మానందరెడ్డి అన్నారు. పెక్కు ఇబ్బందులు కలిగినప్పటికీ రాష్ట్రస్వతీయ ప్రణాళిక ప్రధాన లక్ష్యాలన్నీకూడా సాధింపబడినాయని ఆయన అన్నారు.

ముఖ్యాంశాలు :

ఈ బడ్జెటులోని కొన్ని ముఖ్యాంశాలు ఇవి : (1) ఉస్మానియా, ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలకు, అవి ఇప్పటి శాఖలను నిర్వహించుకొనడానికీ, ద్వితీయ ప్రణాళికలో చేపట్టిన అభివృద్ధి పథకాలను కొనసాగించడానికి, వాటి ఆర్థిక వనతులు స్థిరపడడానికి వీలుగా బ్లాక్ గ్రాంటు రు. 40 లక్షలకు పెంచబడింది. ఈ గ్రాంట్ల పరిమితి అయిదేళ్ల తరువాత సమీక్షింపబడుతుంది.

2. తెలంగాణాలోని 9 జిల్లా పరిషత్తులకు, ఆంధ్రలోని 2 జిల్లా పరిషత్తులకు ఒక్కొక్కదానికి ఆఫీసు కట్టడాల నిమిత్తం రు 3 లక్షలు ఇవ్వాలని ఉద్దేశింపబడింది.

3. మన రాష్ట్రంలోను, ఇతర రాష్ట్రాలలోను గల తెలుగు సంస్థలకు, వాటి కార్యకలాపాల నిర్వహణకుగాను ఆర్థిక సహాయం చెయ్యడానికి రు. 2.25 లక్షలు కేటాయించబడినవి. ప్రభుత్వం ఏర్పాటుచేసిన సాహిత్య, సంగీత నాటక, లలిత కళా ఎకాడమీలకు రు. 1 లక్ష 25 వేల వరకు గ్రాంటు హెచ్చించబడినది.

4. మునిసిపల్ టోల్ పన్నులను రద్దుపరిచి, అందువల్ల మునిసిపాలిటీలకు ఆదాయంలోవచ్చే లోటుకు పరిహారంచెల్లించడానికి బడ్జెటులో రు. 16 లక్షలు కేటాయించబడినవి.

5. హరిజనులు, వెనుకబడిన వర్గాలు వగైరాల సముద్ధరణకు మామూలుగా బడ్జెటులో జరిగే కేటాయింపుకు అదనంగా ఈ ఏడాది బడ్జెటులో రు. 20 లక్షల ప్రత్యేక కేటాయింపు జరిగింది. ఇది హరిజనుల గృహనిర్మాణ పథకాలకు, వెనుక

బడిన వర్గాలకు, ఆర్థికంగా వెనుకబడివున్న విద్యార్థులకు విద్యావసతులను కల్పించడానికి వినియోగం అవుతుంది.

6. డెభ్భై సంవత్సరాలు అంతకు పై బడిన వయస్సు కలిగి జీవనోపాధి సదుపాయములు లేని బీదలకు వార్ధక్య పింఛనులు మంజూరుచేసే నిమిత్తం ఈ బడ్జెటులో రు. 3 లక్షలు కేటాయించ బడినది. ఈ సదుపాయమువల్ల చాలా వరకు వారికష్టాలు తొలిగిపోగలవని ఆశించబడుతున్నది.

7. నిర్ణీత అభివృద్ధి పథకాలకు వినియోగించడానికై వచ్చే సంవత్సరం హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషనుకు గ్రాంటు ఇవ్వడానికి రు. 10 లక్షల మొత్తం కేటాయించబడినది. స్థానిక సంస్థలకు చేసే ఋణసహాయ పథకంక్రింద ఈ కార్పొరేషనుకు ఇదివరకే రు. 9 లక్షలు కేటాయించబడినాయి.

8. పంచదార, చెరకు ప్రాంతాల్లో రోడ్లు నిర్మాణపు కేటా యింపుకూడా 1961-62 వ సంవత్సరంలో రు. 20 లక్షల నుంచి రు. 30 లక్షలకు పెంచబడింది.

9. జిల్లా ప్రాంతాలలో థియేటర్ల నిర్మాణానికి ఒక లక్ష రూపాయలు కేటాయించబడినవి.

10. హైద్రాబాదు, సికింద్రాబాదు జంటనగరాలలో నిరు ద్యోగ నివారణ పథకాలకుగాను ఈ ఏడాది బడ్జెటులో రు. 10 లక్షలు కేటాయించబడినవి.

11. ఆర్థిక సహాయం లేక, సాంకేతిక, వృత్తివిద్యా కళా శాలల్లో చదువు కొనసాగించలేని విద్యార్థులకు విద్యాఋణా లను మంజూరు చేయడానికిగాను 1961-62 బడ్జెటులో ప్రత్యే కంగా రు. 4 లక్షలు కేటాయించబడినవి.

12. కడప, కర్నూలు, అనంతపురములలోని ప్రభుత్వ కళా శాలల్లో అదనపు కట్టడాలకు, హాస్టళ్లు మొదలైనవాటి నిర్మా ణానికి రు. 3 లక్షలు కేటాయించబడినవి.

*సాధనా సదుపాయాలు :*

గత సంవత్సరం రాష్ట్ర సాధనా సదుపాయాల పరిస్థితి ఏమంత సంతృప్తికరంగా లేదనీ, రిజర్వు బ్యాంకు అడ్వాన్సులపై ఆధారపడవలసి వచ్చిందనీ, అంతేగాకుండా ద్వితీయ ప్రణా ళిక ఆఖరు సంవత్సరం వ్యయాన్ని రు. 40 కోట్లనుంచి రు. 47 కోట్లకు పెంచవలసి వచ్చిందని ఆర్థిక మంత్రి అన్నారు.

"ఈ పరిస్థితివల్ల మనకు కొంత ఆందోళన కలిగిన సంగతి వాస్తవమే. రిజర్వుబ్యాంకుకూ, ఢిల్లీలోని మన మిత్రులకు కూడా కొంత ఇబ్బంది కలిగింది. అయితే ద్వితీయ పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా అమలు జరుపుకున్న రాష్ట్రాలమధ్య ఇందువల్ల మనకు ఉన్నతాసనం లభించింది. ఇది మనం గర్వించ వలసిన విషయం" అని అయన అన్నారు.

*కేంద్ర ఋణాలు :*

మూడవ ఆర్థిక సంఘం దృష్టికి రాష్ట్రప్రభుత్వం మరో రెండు ముఖ్య విషయాలను తేదలచిందని మంత్రి అన్నారు.

కేంద్రం ఋణాలపైన ముఖ్యంగా నాగార్జునసాగర్ వంటి నీటిపారుదల ప్రాజెక్టుల వాటిపైన వడ్డీరేటు తగ్గింపు, సులభ వాయిదాలలో ఋణాలు తిరిగి చెల్లింపును గురించినది మొదటి అంశం. తక్కువ జీతాల ఉద్యోగులకు ఇస్తున్న పెంపు కరువుభత్యాన్ని ముమ్ముందుకూడా అలాగే చెల్లించడానికి వీలుగా కేంద్రం సహాయాన్ని కొనసాగించడానికి సంబంధించి నది రాష్ట్రం చేయదలచిన రెండవ అభ్యర్థన.

ఆంధ్రప్రదేశ్ లో కేంద్రప్రభుత్వపు ప్రాజెక్టులను తగినంతగా నెలకొల్పడంలో కేంద్రం వహిస్తున్న ఉపేక్షాభావం పట్ల రాష్ట్రంలో ఎంతో నిస్పృహ ఏర్పడిందని ఆర్థికమంత్రి అన్నారు. ఈ అస్తవ్యస్త పరిస్థితి కనీసం తృతీయ ప్రణాళికా కాలంలో నైనా చక్కబడగలదని తాము ఆశిస్తున్నామనీ రాష్ట్ర అభ్యర్థ నను మన్నించి కేంద్రప్రభుత్వం ఇక్కడ భారీవిద్యుత్పరికరాల పరిశ్రమ కేంద్రం, చిన్న ఉక్కుయంత్రాగారం లాంటి ముఖ్య ప్రాజెక్టులను మూడవ ప్రణాళికలో స్థాపించ గలదనే తాము విశ్వసిస్తున్నామని ఆయన అన్నారు.



# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గూర్చిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు

*గవర్నరుచే సబ్బుల ఫ్యాక్టరీ సందర్శన :*

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ భీమసేన్ సచార్ తమ ఆదిలాబాదు జిల్లా పర్యటన సందర్భంలో నర్సాపూర్‌లోని సుమతి సబ్బుల ఫ్యాక్టరీని సందర్శించారు. పదహారుగురు సభ్యులతో, రు. 16,000ల వాటా ధనంతో ఈ ఫ్యాక్టరీని ప్రారంభించారు. సుమతి సబ్బు పారిశ్రామిక సహకార సంఘానికి శ్రీ నారాయణ రెడ్డి అధ్యక్షులుగా వున్నారు.

*విహార యాత్ర :*

1961 జనవరి రెండవ పక్షంలో కుంతల జలపాతాల వద్దకు గోండులు, కోలములు, ప్రధాన్‌లు, తోడాలు, బంజారాలు, మథురాలు, నాయకపోడు జాతులకు చెందిన సుమారు 250 మంది విహారయాత్ర ఏర్పాటు చేయబడినది. ఆంధ్రప్రదేశ్ గవర్నరు, ప్రదర్శించిన వైజ్ఞానిక కార్యక్రమాలను తిలకించి ప్రదర్శక బృందాలకు రు. 200/- ల రొక్కం బహూకరించారు. ఈ యాత్రలో అన్ని జాతులవారు కూడా తమ తమ మతైక కట్టుబాట్లను విస్మరించి అందరూ కలిసిమెలిసి వుండి, కలిసే భోజనం చేసి, అంతా ఒక్కుమ్మడిగా నాట్యం ప్రదర్శించారు. ఇది నిజంగా గమనార్హమైన విషయం.

*రోడ్డు నిర్మాణం :*

క్షేమనివారణ కార్యక్రమాలక్రింద ఇటీవల రు. 20,000 ల (అంచనా) వ్యయంతో మామిడినుంచి కుంతల జలపాతాలవరకు రోడ్డు నిర్మించబడినది.

*కేసలాపూర్ జాతర :*

1961 జనవరినెల రెండవపక్షంలో కేసలాపూర్‌లో జరిగిన కొండజాతులవారి జాతర సందర్భంలో అభివృద్ధిపథకాలు నిర్వహించే ప్రభుత్వ శాఖలన్నీకూడా పాల్గొన్నాయి.

*ఎడ్లబండ్ల పోటీ :*

కేసలాపూర్ జాతర సందర్భంలో రెండెడ్లబండ్ల పరుగు పోటీ జరిగింది. పోటీలో గెలుపొందిన రెండెడ్లకు బహుమతులు ఇచ్చారు.

## అనంతపురం

*హరిజన దినోత్సవం :*

గోరంట్ల పంచాయతీ సమితిలోని గ్రామాలలో 1960 డిశెంబరు 30 వ తేదీన హరిజన దినోత్సవం జరిగింది.

## చిత్తూరు

*వైజ్ఞానికయాత్ర :*

చౌడేపల్లి పంచాయతీ సమితికి చెందిన కొందరు యువ కర్షకులు ఇటీవల ఆంధ్రప్రదేశ్‌లోనూ, బొంబాయి రాష్ట్రంలోని ఔరంగాబాదు జిల్లాలోను వైజ్ఞానికయాత్ర చేశారు.

## కడప

*పాఠశాల సైన్సు భవనానికి శంకుస్థాపన :*

రాష్ట్ర విద్యాశాఖా మంత్రి పుల్లంపేట ఉన్నత పాఠశాల సైన్సు భవనానికి 1961 జనవరి నెలలో శంకుస్థాపన చేశారు.

## తూర్పు గోదావరి

*రాష్ట్ర పశు ప్రదర్శనం :*

రాష్ట్ర పశుపోషణ శాఖ ఆధ్వర్యాన, ఆంధ్రప్రదేశ్ పశు ప్రదర్శనం, 1961 ఫిబ్రవరి 19 వ తేదీ నుంచి 21 వ తేదీ వరకు



శ్రీకాకుళం జిల్లా తృతీయ సంగీత నాటక గోష్ఠిలో పెద్ద కొండపల్లిలోని పరిషత్తు ఉన్నత పాఠశాలకు చెందిన విద్యార్థి మాస్టర్ కృష్ణ ఉత్తమ గాయకుడుగా ఎన్నిక అయ్యాడు.

కాకినాడలో జరిగింది. అనేకమంది పశు పెంపకందార్లు ఈ ప్రదర్శనంలో తమ పశువులను ప్రదర్శించారు.

## గుంటూరు

*మండల సంగీత, నాటక పోటీలు :*

గుంటూరులో జనవరి 17, 18 వ తేదీలలో జరిగిన మండల సంగీత, నాటక పోటీలలో "నవజీవనం" "రజనీకాంతం" అనే నాటికలకు ప్రథమ, ద్వితీయ బహుమతులు లభించాయి. మొదటి నాటికను చిత్తూరుజిల్లా పరిషత్తు బహుళార్థ సాధక పాఠశాల విద్యార్థులూ, రెండవ నాటికను అనంతపురం జిల్లా పెనుగొండ పాఠశాల విద్యార్థులు ప్రదర్శించారు.

*మోర్జంపాడులో మేలా :*

పిడుగురాళ్ల పంచాయతీ సమితి ఆధ్వర్యాన 1961 జనవరిలో పల్నాడుతాలూకా మోర్జంపాడులో మేలా జరిగింది. ఈ సంద ర్భంలో ఏర్పాటుచేసిన వివిధ స్టాళ్లను సుమారు 5,000 మంది ప్రజలు సందర్శించారు.

## హైదరాబాదు

*సంగీత, నాటక గోష్ఠి :*

హైదరాబాదులో 1961 జనవరి 11,12, 13 వ తేదీలలో జరిగిన హైదరాబాదు మండల సంగీత, నాటక గోష్ఠిలో అల్వాలలోని జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల విద్యార్థులు ప్రదర్శించిన "పొత్తుల వ్యవసాయం" అనే నాటకానికి ప్రథమ బహుమతి లభించింది. హైదరాబాదు జిల్లా పక్షాన దీన్ని ప్రదర్శించారు. ఉత్తమ గాయకుడుగా కర్నూలు జిల్లా నుంచి వచ్చిన పోటీదారు ఎన్నిక అయ్యాడు.

## కరీం నగరం

*రిపబ్లిక్ దినోత్సవ ఆటల పోటీలు :*

హుస్నాబాదు పంచాయతీ సమితిలో జరిగిన రిపబ్లిక్ దినోత్సవ ఆటల పోటీలలో పొత్తారం యువజన సంస్థకు కబడ్డీలోనూ, హుస్నాబాదు యువజన సంస్థకు వాలీబాల్‌లోనూ ట్రాఫీలు లభించాయి.

*వదాన్యుల చిత్రపటా విష్కరణ :*

ప్రజాహిత సంస్థలకు భూరి విరాళాలిచ్చిన హుస్నాబాదు సమితి అధ్యక్షుడు శ్రీ వి. లక్ష్మారెడ్డి, శ్రీ జి. వీరారెడ్డి గారల చిత్రపటాలను హుస్నాబాదులో రిపబ్లిక్ దినోత్సవంనాడు ఆవిష్కరించారు. శ్రీ లక్ష్మారెడ్డి ఆసుపత్రి నిర్మాణానికి రు.5,110 లనూ, శ్రీ వీరారెడ్డి ప్రసూతిశాల నిర్మాణానికి రు. 4000 లను విరాళంగా ఇచ్చారు.

*శిక్షణ శిబిరం :*

హుస్నాబాదు పంచాయతీ సమితి లోని నవాపేట్ గ్రామంలో 1961 జనవరి 29 నుంచి 31 వ తేదీవరకు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. అక్కడికి చుట్టుప్రక్కలవున్న గ్రామాలకు చెందిన సుమారు 650 మంది గ్రామ సహాయకులు ఈ శిబిరంలో పాల్గొన్నారు.

## ఖమ్మం

*యువజన క్లబ్బు :*

యెనుకూరు గ్రామంలో 1961 జనవరి 29 వ తేదీన యువజన క్లబ్బును స్థాపించారు. గ్రామ పంచాయతీ అధ్యక్షుడు శ్రీ కొల్లిపర

వెంకటసుబ్బయ్య ఈ క్లబ్బుకు ఒక ఎకరం భూమిని విరాళంగా ఇచ్చారు.

*యువజనోత్సవాలు :*

పాలేరు పంచాయతీసమితి బ్లాకులో 1961 జనవరి 22 నుంచి 26 వ తేదీవరకు యువజనోత్సవాలు జరిగాయి.

## కృష్ణా

*సహకారసంఘ భవనాలు :*

దివితాలూకాలోని కొత్తపాలెం సహకారసంఘ భవనాలను ప్రణాళికాశాఖామంత్రి 1961 జనవరి 29 వ తేదీన ప్రారంభించారు.

*భూమి తనఖా బ్యాంకు ప్రారంభోత్సవం :*

రాష్ట్ర ప్రణాళికా, సమాచార శాఖలమంత్రి 1961 జనవరి 29 వ తేదీన తిరువూరులో భూమి తనఖాబ్యాంకుకు ప్రారంభోత్సవం చేశారు.

*వయోజన విద్యాకేంద్రం :*

కంభంపాడు యువజన క్లబ్బువారు జనవరి 30 వ తేదీన ఒక వయోజన విద్యాకేంద్రాన్ని తెరిచారు.

*పాఠశాలభవనం ప్రారంభం :*

కైకలూరు పంచాయితీ సమితిలోని ఆలపాడు గ్రామంలో రిపబ్లిక్ దినోత్సవంనాడు నూతన పాఠశాల భవనాన్ని ప్రారంభించారు.

## కర్నూలు

*జిల్లా క్రీడోత్సవాలు :*

కర్నూలులో 1961 జనవరి 18 వ తేదీన జరిగిన జిల్లా క్రీడోత్సవాల ముగింపు కార్యక్రమానికి రాష్ట్ర ముఖ్యమంత్రి అధ్యక్షత వహించారు. వివిధ పోటీలలో ప్రథమ, ద్వితీయులుగా గెలుపొందినవారికి రెండువందలకుపైగా వెండికప్పులు, యాభైకి పైగా ఇతర బహుమతులను పంచిపెట్టారు. కర్నూలుజిల్లా గేమ్స్ కౌన్సిలుకు చెందిన హాకీ, వాలీబాల్ జట్టులకు ఆ యా క్రీడలలో ప్రథమ బహుమతులు లభించినవి.

"దీపారాధన" చేసే పోటీలో ముఖ్యమంత్రి ప్రథములుగా వచ్చారు. ఆయన ఒకే ఒక అగ్గిపుల్లతో తొమ్మిది దీపాలు వెలిగించారు. ఈ పోటీలో జిల్లాకలెక్టరు తదితర జిల్లా అధికార్లు పాల్గొన్నారు. పార్లమెంటు సభ్యులు, శాసనసభ్యులు, జిల్లా పరిషత్తు సభ్యులకొరకు ఏర్పాటుచేసిన "నడకపోటీ"లో ఆలూరు శాసనసభ్యుడు శ్రీ హెచ్. హనుమంతరెడ్డి ప్రథములుగానూ, కర్నూలు శాసనసభ్యులు శ్రీ మహబూబ్ అలీఖాన్ ద్వితీయులుగాను వచ్చారు.

## మహబూబ్‌నగరం

*రిపబ్లిక్ దినోత్సవ పోటీలు :*

తాండూరు సమితిబ్లాకు ఆధ్వర్యాన 1961 జనవరి 26 వ తేదీన వక్తృత్వపోటీ, వ్యాసరచనపోటీ, సంగీతపోటీలు జరిగాయి.

*మహిళామండలి :*

ఆత్మకూరు సమితిబ్లాకు అధ్యక్షురాలు శ్రీమతి జి. కృష్ణ



కర్నూలు జిల్లా ద్రోణాచలం పంచాయతీసమితి అధ్యక్షుడు శ్రీ కె. వెంకటశెట్టి. ఈయన తనకు లభించే గౌరవ వేతనాన్ని భత్యాలను ప్రజోపయోగకరమైన పథకాలకు వినియోగించడానికి నిశ్చయించుకున్నారు.

వేణమ్మ ఇటీవల మహిళా మండలిని స్థాపించారు. ముఖ్యమంత్రి ఈ జనవరి నెలలో ఆ ప్రాంతానికి పర్యటనకు వెళ్లినప్పుడు ఆమె సేవాసక్తిని ప్రశంసించారు.

*నూనెగానుగ సంఘం :*

దేవరకదరలో 1961 జనవరి నెలలో నూనెగానుగ సంఘం స్థాపించబడింది.

*వికాస మేలా :*

సింగోటం జాతర సందర్భంలో కొల్లాపూర్ సమితిబ్లాకు 1960 జనవరిలో వికాసమేలా ఏర్పాటుచేసింది. అయిదురోజుల పాటు జరిగిన ఈ మేలాను 30,000 మందికి పైగా ప్రజలు సందర్శించారు.

*మన్ననూరు బ్లాకు :*

మన్ననూరు పూర్వ విస్తరణకేంద్రాన్ని, రాష్ట్ర వ్యవసాయ శాఖ మంత్రి 1961 జనవరి మొదటివారంలో ప్రారంభించారు.

*మనోపాడులో చక్కెర ఫ్యాక్టరీ :*

సహకార రంగంలో మనోపాడులో చక్కెర ఫ్యాక్టరీ నొక దానిని నెలకొల్పడానికి జిల్లాపరిషత్తు ఫిబ్రవరినెల రెండవ వారంలో నిర్ణయం గైకొన్నది. దీని స్థాపనకు రు. 25 లక్షలు ఖర్చు కావచ్చని అంచనా.

*చిన్నమొత్తాల పొదుపు :*

జిల్లాలో చిన్నమొత్తాల పొదుపు పథకానికి ఎక్కువ మొత్తం వసూలు కావడానికి వీలుగా జిల్లాలోని సమితి అధ్యక్షులు అందరూ ఒక్కొక్కరు నెలకు రు. 25 లను పెట్టుబడి పెట్ట డానికి ఫిబ్రవరినెల మొదటి వారంలో తీర్మానించుకున్నారు.

*దోకూరుకు విద్యుచ్ఛక్తి సరఫరా :*

ఆత్మకూరు తాలూకాలోని దోకూరు గ్రామంలో 1961 జనవరి నెలలో ముఖ్యమంత్రి విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం చేశారు.

## మెదక్

*లోక కార్యా క్షేత్రాలపై గోష్ఠి :*

భారత్ సేవక్‌సమాజ్, లోక కార్యక్షేత్రాలపై నిర్వహించిన జాతీయగోష్ఠి ఫిబ్రవరి 3 వతేదీన సంగారెడ్డిలో ప్రారంభమైంది. నాలుగురోజులపాటు జరిగిన ఈ గోష్ఠిలో దేశంలోని వివిధ ప్రాంతాలనుంచి సుమారు 200 మంది ప్రతినిధులు, ఆహూతులు పాల్గొన్నారు.

## నల్గొండ

*సాముదాయక బహుమతి :*

గడిచిన మూడు సంవత్సరాల సగటు ఉత్పత్తికంటే నూటికి 15 వంతుల ఉత్పత్తిని అధికంగా సాధించినందుకు నల్గొండజిల్లాకు 1958-59 వ స. పు రబ్బీ ఉద్యమ సందర్భంలో రు. 10,000/- ల సాముదాయిక బహుమతి లభించింది.

*ఎరువుల పంపిణీ :*

1960 సెప్టెంబరుతో అంతమైన మూడు నెలలలో మేలిరకం విత్తనాల పంపిణీ పథకం ఆచరణలో జిల్లాలోకెల్లా మిర్యాలగూడెం పంచాయతీ సమితి ప్రథమస్థానం పొందింది.

ఈ కాలంలో ఈ సమితి సుమారు 3248 మణుగుల మేలిరకం విత్తనాలను పంపిణీ చేసింది. ఎరువుల పంపిణీలో దేవరకొండ బ్లాకు అగ్రస్థానం పొందింది. ఇది దాదాపు 7720 మణుగుల ఎరువులను పంపిణీ చేసింది.

*సమాచారశాఖ ప్రదర్శనశాలకు ప్రథమ బహుమతి :*

1961 జనవరి మొదటి వారంలో జరిగిన నల్గొండ జిల్లా ప్రదర్శనంలో సమాచార పౌరసంబంధములశాఖ ఏర్పాటు చేసిన ప్రదర్శనశాలకు ప్రథమ బహుమతి లభించింది.

*బేసిక్ విద్యా వారోత్సవం :*

సూర్యాపేటలో జనవరి 20 నుంచి 26 వ తేదీ వరకు బేసిక్ విద్యా వారోత్సవం జరిగింది.

*అమెరికా అర్థిక శాస్త్రవేత్త రాక :*

భారతప్రభుత్వ ఆహ్వానంపై, ప్రణాళికలు, ప్రాజెక్టుల నిర్వహణ వ్యవహారాలను పరిశీలించడానికి మనదేశంలో పర్యటిస్తున్న ప్రసిద్ధ అమెరికా ఆర్థిక శాస్త్రవేత్త ప్రొఫెసర్ ఆర్థర్ ఎఫ్. బర్న్స్, జనవరి నెల మొదటివారంలో నాగార్జునసాగర్‌ను, పెద్దఊర పంచాయతీ సమితి (నల్గొండజిల్లా) ని సందర్శించారు. పంచాయతీ రాజ్య నిర్వహణ వ్యవహారాలనుగూర్చి ఆయన తెలుసుకొనడానికి వీలుగా జిల్లా పరిషత్తు సాధారణ సమావేశం ఏర్పాటు చేయబడింది.

*నూత్నసమితి ప్రారంభం :*

రాష్ట్ర ప్రణాళికా, సమాచారశాఖల మంత్రి 1961 ఫిబ్రవరి

మొదటి వారంలో ఆలేరు పంచాయతీ సమితిని ప్రారంభించారు.

*నీటిపారుదలకు బావులు :*

ఈ జిల్లాలో 1960–61 వ సంవత్సరంలో నీటి పారుదలకు ఉపయోగపడడానికి 1175 బావులను నిర్మిస్తారు.

*పారిశ్రామిక శిక్షణ కేంద్రాలు :*

చర్లపల్లి, పోచంపల్లి గ్రామాలలో నిమ్నజాతులవారి నిమిత్తమై, పారిశ్రామిక శిక్షణ, ఉత్పత్తి కేంద్రాలు రెండు నడుపబడినవి. తోలు వస్తువులను తయారుచేయడంలోను, నేత పనిలోను నిమ్న జాతులకు చెందిన అభ్యర్థులకు వీటిలో శిక్షణ ఇస్తున్నారు.

## నెల్లూరు

*పూర్వ విస్తరణ కేంద్రం :*

చిన్నక్రాక పూర్వ విస్తరణ కేంద్రం, 1961 ఫిబ్రవరి 1 వ తేదీన ప్రారంభించబడింది. ఈ జిల్లాలో ఇది ఇరవయ్యో సమాజాభివృద్ధి బ్లాకు.

*శిక్షణ శిబిరం :*

నాయుడుపేటలో బ్లాకు పంచాయతీ సమితి ఆధ్వర్యాన 1961 జనవరిలో ఒక శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. 50 మంది స్త్రీలు దీనిలో శిక్షణ పొందారు.

## నిజామాబాదు

*బీదలకు అన్నదానం :*

రిపబ్లిక్ దినోత్సవంనాడు శ్రీయుతులు నార్ల హనుమంతు, బి. గంగారెడ్డి గారలు బీదలకు అన్నదానం, వస్త్రదానం చేశారు.

## శ్రీకాకుళం

*గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం :*

భద్రగిరి బ్లాకులోని వంగర గ్రామంలో 1960 డిశెంబరు 24 నుంచి 26 వ తేదీ వరకు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. సుమారు 50 మంది కర్షకులు దీనిలో శిక్షణ పొందారు.

*ప్రధానోపాధ్యాయులకు సత్కారం :*

కొర్నిలోని సమితి బేసిక్ హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ డి. పార్వతీశ్వరరావుగారు సమితి ప్రాంతంలోకెల్లా ఉత్తమ ప్రధానోపాధ్యాయుడుగా ఎన్నుకొన బడ్డాడు. రిపబ్లిక్ దినోత్సవంనాడు జరిగిన ఒక సభలో ఆయనకు రు. 100/– ల మొత్తం బహూకరించబడింది. పాఠశాల ఆవరణలో చక్కని తోట పెంచుతున్నందుకు శ్రీకూర్మంలోని సమితి బేసిక్ ఎలిమెంటరీ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ వి. జనార్దనరావుకు రు. 50/– ల మొత్తం బహూకరింప బడినది.

## విశాఖపట్నం

*గజపతినగరం పంచాయతీ సమితి :*

1961 జనవరి 31 వ తేదీన ప్రణాళికా శాఖ మంత్రి గజపతి నగరం పంచాయతీ సమితికి ప్రారంభోత్సవం చేశారు. ఇది ఈ జిల్లాలో పదిహేడవ సమితి.

*సబ్బవరంలో మేలా :*

అనకాపల్లి తాలూకాలోని సబ్బవరం రెండవదశ బ్లాకు మేలా ఉత్సవాలు 1961 జనవరి 27, 28 వ తేదీలలో జరిగాయి. ఈ కార్యక్రమాలకు జరిగిన సుమారు రు. 2000 ల వ్యయాన్ని పూర్తిగా పంచాయతీ సమితి అధ్యక్షుడు, సభ్యులు ఇంకా కొందరు ప్రముఖ రైతులు భరించారు.

*విశ్వవిద్యాలయాల ప్రణాళికా ఫోరం :*

విశ్వవిద్యాలయాల ప్రణాళికా ఫోరంను రాష్ట్ర ప్రణాళికా, సమాచారశాఖల మంత్రి విశాఖపట్నంలో 1961 జనవరి మొదటి వారంలో ప్రారంభించారు. రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలకు చెందిన ప్రతినిధులు చర్చలలో పాల్గొన్నారు.

## వరంగలు

*వైజ్ఞానిక యాత్ర :*

పరకాల పంచాయతీ సమితి స్థానిక మహిళా మండలికి చెందిన 45 మంది సభ్యురాండ్రతో వైజ్ఞానిక యాత్ర ఏర్పాటు చేసింది. వీరు జనవరి 30వ తేదీన హైద్రాబాదుకు వచ్చి ఇక్కడ మూడు రోజులపాటు వుండి వివిధ చారిత్రక స్థలాలను, సంస్థలను సందర్శించారు.

*నేత పనివారల కాలనీ :*

నాలుగు లక్షల పదమూడు వేల రూపాయల వ్యయంతో

జనగామలో నిర్మింపబడిన నేతపనివారల కాలనీని 1961 జనవరి 29 వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభించారు.

## పశ్చిమగోదావరి

*వ్యవసాయ "వర్క్‌షాప్" :*

సాంద్రతర వ్యవసాయ పథకంక్రింద తాడేపల్లిగూడెంలో వ్యవసాయ "వర్క్‌షాప్" ఒకటి నెలకొల్పబడుతుంది. దీనికి ఫోర్డు ఫౌండేషను రు. 5 లక్షలు మంజూరు చేసింది.

*స్వర్ణ పతకం బహూకరణ :*

ఇటీవల సంభవించిన ఒక పడవప్రమాదంలో చిక్కుకున్న నలుగురు వ్యక్తులను సురక్షితంగా కాపాడినందుకు తూటిగుంట గ్రామకరణమైన శ్రీ నండూరి సత్యనారాయణమూర్తికి జిల్లా కలెక్టరు రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో ఒక స్వర్ణపతకాన్ని, ఒక సనదును బహూకరించారు.

*జిల్లా పశు ప్రదర్శనం, మేలా :*

నిడదవోలులో బ్లాకు పంచాయతీ సమితి ఆధ్వర్యాన 1961 జనవరి 5 నుంచి 7 వ తేదీ వరకు భారీఎత్తున మేలా జరిగింది. జనవరి 6, 7 తేదీలలో జిల్లా పశుప్రదర్శనంకూడా జరిగింది.

*జిల్లా స్థాయి సమ్మేళనం :*

సమాజాభివృద్ధి విషయాలపై పశ్చిమగోదావరి జిల్లా అయిదవ జిల్లా స్థాయి సమ్మేళనం 1961 జనవరి 28, 29 వ తేదీలలో ఏలూరులో జరిగింది.

---

# పొదుపు ఉద్యమం

పశ్చిమ గోదావరి జిల్లాలో 1961 జనవరిలో జాతీయ పొదుపు ఉద్యమ సహాయార్థం తీవ్రప్రయత్నం జరిగింది. సుమారు రెండులక్షల రూపాయలవరకు ప్రజలనుండి పెట్టుబడి సేకరింపబడింది. జాతీయ పొదుపు పత్రాలు, బహుమతి పత్రాలు కొన్నవారికి అప్పుడే పంచిపెట్టబడినవి.



# సంగ్రహ ప్రకటనలు

## ఎక్సైజు మద్యపాన నిషేధశాఖ

మద్యపాన నిషేధాన్ని అమలుపరచే పనిని పోలీసుల నుంచి తొలగించి, "ఎక్సైజ్ మద్యపాన నిషేధ శాఖ" అని పిలువబడే కొత్తశాఖకు అప్పగించాలని ప్రభుత్వం ఆదేశించింది. ప్రస్తుత ఎక్సైజుశాఖ యీ కొత్తశాఖలో కలిసిపోతుంది. ఇది 1961 ఫిబ్రవరి 1 నుంచి పనిచేయ నారంభిస్తుంది.

ఎక్సైజు కమిషనరు హోదాను ఇక నుంచి ఎక్సైజు, మద్యపాన నిషేధపు కమిషనర్‌గా మార్చుతారు. ఈ కమిషనరు రెవిన్యూబోర్డు సభ్యుడుగాను, కొత్తశాఖకు అధిపతిగాను వ్యవహరిస్తారు. తెలంగాణ ప్రాంతంలోని ఎక్సైజుశాఖ యంత్రాంగంలో ఏవిధమైన మార్పు వుండదు. ఆంధ్రప్రాంతంలో మాత్రం పరిపాలనా నిర్వహణ విషయంలో, ఎక్సైజు మద్యపాన నిషేధ కమిషనరుకు చేదోడుగా డిప్యూటీ కమిషనరు ఒకరు వుంటారు. డిప్యూటీ కమిషనరు మద్యపాన నిషేధాన్ని అమలు పరచటంతోపాటు, ఏజన్సీ ప్రాంతాలతో సహా 11 ఆంధ్ర జిల్లాలలో అవశేషంగావున్న ఎక్సైజు పనిని నిర్వర్తిస్తూ వుంటారు. ఆంధ్రప్రాంతంలోని డిస్టిలరీలుకూడ యీయన అజమాయిషీ క్రిందనే వుంటాయి. ఈ డిప్యూటీ కమిషనరు ముఖ్య కార్యాలయ స్థానం గుంటూరు.

ఒక్కొక్క జిల్లాలో (ఆంధ్రప్రాంతం) వుండే సిబ్బంది : ఒక జిల్లా మద్యపాన నిషేధాధికారి, ముగ్గురు సహాయక మద్యపాన నిషేధాధికార్లు, స్టేషనుకు ఒకడు చొప్పున సబ్-ఇనస్పెక్టర్లు, కాపలా దళం. జిల్లా మద్యపాన నిషేధాధికారి జిల్లాలోని ఎక్సైజు, మద్యపాన నిషేధానికి సంబంధించిన పనిపై అజమాయిషీ వహిస్తారు. జిల్లాలోని ముగ్గురు సహాయక మద్యపాన నిషేధాధికార్లలో ఇరువురు మద్యపాన నిషేధపు స్టేషన్ల పైనిన్నీ, మూడో అధికారి జిల్లా కాపలాదళాలపైన అజమాయిషీ చేస్తారు. సహాయక అధికార్ల ముఖ్యకార్యాలయ స్థానాలను కమిషనరు నిర్ణయిస్తారు. తాలూకాకు రెండు నిషేధపు స్టేషన్లు వుంటై. ఒక్కొక్క స్టేషన్‌లో ఒక సబ్-ఇన్‌స్పెక్టర్, ఇద్దరు పెట్టీ ఆఫీసర్లు, ఏడుగురు నిషేధపు గార్డులు వుంటారు. జిల్లా కార్యాలయంలో 1 సబ్ ఇనస్పెక్టర్, 2 పెట్టీ ఆఫీసర్లు, 18 గార్డులు వుంటారు. వీరుగాక ప్రతి జిల్లా ముఖ్య కార్యస్థానంలో 1 సబ్ ఇనస్పెక్టరు, 1 పెట్టీ ఆఫీసర్, 10 గార్డులు వుంటారు.

ఏజన్సీ ప్రాంతంలో ఒక డిప్యూటీ అధికారి, ఒక సహాయాధికారి, 7 గురు సబ్-ఇనస్పెక్టర్లు, 34 గార్డులు పనిచేస్తూ వుంటారు. డిస్టిలరీల బ్రాంచిలో ఒక డిప్యూటీ అధికారి, 4గురు సహాయాధికార్లు, 8 మంది సబ్ ఇనస్పెక్టర్లు, 23 గార్డులు వుంటారు.

ప్రారంభ దశలలో పోలీసుశాఖకు, కొత్తశాఖకూ మధ్య లయజాన్ ఆఫీసరుగానూ, జిల్లాలలో, తాలూకాలలో కొత్త యంత్రాంగాన్ని స్థాపించటంలో కమిషనరుకు తోడ్పడటానికిన్నీ ఒక సంవత్సరంపాటు లేక అవసరం తీరేంతవరకు-ఏది ముందయితే అంత వరకూ-ఒక రిటైర్డు డిప్యూటీ పోలీసు ఇనస్పెక్టర్-జనరల్‌ని స్పెషల్ ఆఫీసరుగా ప్రభుత్వం నియమించింది. ఈయన హైదరాబాదులో రెవిన్యూబోర్డు (ఎక్సైజు) కార్యాలయంలో, కమిషనరు క్రింద పనిచేస్తూ వుంటారు.

* * *

## గరిష్ట వయః పరిమితి తగ్గింపు

ప్రభుత్వోద్యోగాలలో నియమకానికై అభ్యర్థుల విద్యార్హతలు, వయః పరిమితుల విధింపుకు సంబంధించి తగుసూచనలు చేసే నిమిత్తం భారత ప్రభుత్వం ఆమధ్య డా. ఆర్కాట్ లక్ష్మణ స్వామి ముదల్యార్ అధ్యక్షతన పబ్లిక్ సర్వీసెస్ (రిక్రూట్మెంట్ అర్హతలు) కమిటీ అనే పేరుతో ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘం చేసిన సిఫార్సులను కేంద్ర ప్రభుత్వం పరిశీలించింది. ఈ విషయంలో వివిధ రాష్ట్ర ప్రభుత్వాలతో, కేంద్రప్రభుత్వ

మంత్రిత్వ శాఖలతో, యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషనుతో కూడా సంప్రదించింది.

భారత ప్రభుత్వం ఈ సంఘం సిఫార్సులపై చేసిన నిర్ణయాలను రాష్ట్ర ప్రభుత్వాలకు తెలుపుతూ వాటి విషయంలో స్థానిక పరిస్థితుల ననుసరించి తగు చర్యలు తీసుకోవలసిందిగా కోరింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్రం చేసిన నిర్ణయాలను పబ్లిక్ సర్వీసు కమీషనుతో కలిసి పరిశీలించిన మీదట ఒకటవ వర్గం (బి. ఎ. ఆనర్స్ స్థాయి), రెండవ వర్గము (బి. ఎ. స్థాయి) లకు చెందిన ఉద్యోగాల నియామకాల విషయంలో ప్రస్తుతం అమల్లో నున్న అర్హతల పరిమితిని మార్చ నవసరంలేదని నిశ్చయించింది. అయితే మూడవ వర్గము (పి. యు. సి. స్థాయి) నకు చెందిన ఉద్యోగాలలో అభ్యర్థుల నియమకానికి గరిష్ఠవయః పరిమితిని 25 సంవత్సరాల నుంచి 23 సంవత్సరాలకు తగ్గించడానికీ అలాగే నాలుగవ వర్గను (ఎస్. ఎస్. ఎల్. సి.) నకు చెందిన ఉద్యోగాలకు 25 సంవత్సరాల నుంచి 21 సంవత్సరాలకు తగ్గించడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

ఈ నిర్ణయాలు 1964 జూలై 1వ తేదీనుంచి అమలుపరచబడతాయి. అయితే ఈపరిమితులు, నిమ్నజాతులు, నిమ్నతెగలు వెనుకబడిన తరగతులు ఆదిమజాతుల వారైన అభ్యర్థులకు వర్తించవు.

*　　*　　*

## భూయజ్ఞ నిబంధనలు

"1951 శ్రీ ఆచార్య వినోబాభావే సర్వోదయ భూయజ్ఞ హైదాబాదు భూమిశిస్తు నిబంధనలు" 9-2-1961 తేదీమొదలుకొని మరోసంవత్సరంపాటు తెలంగాణా ప్రాంతానికి విస్తరింపజేస్తూ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. ఆంధ్రప్రదేశ్ అంతటికీ కలిపి ఒకే శాసనాన్ని రూపొందించి అమలుపరచేదానికి మరికొంత గడువు తీసుకుంటుంది గనుక యీ తాత్కాలిక పొడిగింపు చర్య తీసుకోబడింది.

*క్షామపరిస్థితి ఏర్పడిన ప్రాంతాలకు సహాయం*

1370 వ ఫసలీలో అనావృష్టివల్ల పంట దిగుబడి బాగా తగ్గిపోయిన ప్రదేశాలలో దిగువ పేర్కొన్న విధంగా సహాయక చర్యలు గైకొనడానికి ప్రభుత్వం ఉత్తర్వులు చేసింది.

1. విశాఖపట్నం జిల్లాలో అనావృష్టివల్ల పూర్తిగా దెబ్బతిన్న ప్రదేశాలలో దిగువ తెలిపిన పద్ధతిలో 1370 వ ఫసలీకి మాగాణి శిస్తురెమిషను ఇవ్వబడుతుంది.

(అ) పంట దిగుబడి నాలుగు అణాలు, అంతకు తక్కువగా వున్న ప్రదేశాలలో మొత్తం శిస్తు రెమిషను ఇస్తారు.

(ఆ) పంట దిగుబడి నాలుగు అణాలకంటే ఎక్కువ ఆరు అణాలకంటె తక్కువగా వున్న ప్రాంతాలలో సగం శిస్తు రెమిషను ఇస్తారు.

ఈ రెమిషను అన్ని మాగాణీ పంటలకూ, చెరకు తోటలకూ, అరటి తోటలకూ, మెట్ట భూములలో పండించే ఇతర పైర్లకు వర్తిస్తుంది. చిన్నచిన్న ఇనాములతో సహా రైత్వారీ భూములకు కూడా ఇది వర్తిస్తుంది.

2. కడప జిల్లా, రాయచోటి తాలూకాలోని మెట్ట భూములపై 1370 వ ఫసలీకి దిగువ విధంగా శిస్తురెమిషను ఇవ్వబడుతుంది.

(అ) పంట దిగుబడి నాలుగు అణాలు అంతకంటే తక్కువగా గల ప్రదేశాలలో పూర్తి రెమిషను.

(ఆ) పంట దిగుబడి నాలుగు అణాలకంటే ఎక్కువ, ఆరు అణాల కంటే తక్కువగా వున్న ప్రదేశాలలో సగం రెమిషను.

3. 1370 వ ఫసలీ బాపతు భూమి శిస్తులు, ఋణాల శిస్తులు, ఇంకా ఇతర బకాయీల వసూళ్లు, విశాఖపట్నం జిల్లాలోని క్షామపీడిత ప్రాంతాలలో 1961 నవంబరు మాసాంతం వరకూ, రాయచోటి తాలూకాలోని కరువు ప్రాంతాలలో 1961 డిసెంబరు నెలాఖరు వరకు వాయిదా వేయబడతాయి.

4. దిగువ పేర్కొన్న ప్రదేశాలలో, 1370 వ ఫసలీ ఖరీఫ్ కిస్తులకు సంబంధించిన భూమిశిస్తు 1371 వ ఫసలీ ఖరీఫ్ కిస్తు భూమి శిస్తులతో పాటు కలిపి వసూలు చేయబడతాయి.

1. హైదాబాదు జిల్లాలోని తూర్పు హైదాబాదు, పశ్చిమ హైదాబాదు, మేడ్చల్, ఇబ్రహీం పట్నం, తాండూరు తాలూకాలు.

2. వరంగల్ జిల్లాలోని వరంగల్, జనగామ తాలూకాలు.

3. ఖమ్మం జిల్లాలోని మధిర, ఎల్లందు తాలూకాలు. ఖమ్మం

తాలూకాలోని సుబ్లేడు, పల్లంపాడు, పాలేరు నెం. 1 సర్కిళ్లు.

4. నల్గొండ జిల్లా అంతటా.

5. నల్గొండ జిల్లాలో 1370 వ ఫసలీకి వసూలు కావల్సి వున్న తక్కావి అప్పుల కిస్తులు 1371 వ ఫసలీ వరకు వాయిదా వేయబడతాయి.

6. హైదరాబాదు వరంగలు జిల్లాలలో, 1370వ ఫసలీబాబతు ఖరీఫ్ కిస్తు వసూళ్లు వాయిదా వేయబడిన ప్రదేశాలలో వేరు సెనగ, ప్రత్తి పంటలు కాక, 1957 వ సం. పు ఆంధ్రప్రదేశ్ వాణిజ్య పంటల (పన్నుల) చట్టంక్రింద ఇతర వాణిజ్య పంటలపై 1370 వ ఫసలీ బాబతు ప్రత్యేక శిస్తు వసూళ్లను 1371 వ ఫసలీ వరకు వాయిదా వేస్తారు. ఈ చట్టంక్రింద, వేరుసెనగ, ప్రత్తిపంటలపై, ప్రత్యేక శిస్తు వసూళ్ళను 1370 వ ఫసలీ లగాయతు మూడు ఫసలీ సంవత్సరాల వరకు వాయిదావేస్తూ ఇదివరకే ఉత్తర్వులు చేయబడినాయి.

* * *

## కె. సి. కాలువ మూసివేత

కొన్ని ప్రత్యేక మరమ్మతులు. అభివృద్ధిపనులు చేపట్టవలసివున్నందువల్ల కె. సి. కాలువ నుంకేసులలోని పెద్ద తూము వద్ద నుంచి, కడప జిల్లాలో దాని చివర వరకు, 1961 ఏప్రిల్ 16వ తేదీ లగాయతు జూన్ 15వ తేదీవరకు మూసి వేయబడుతుంది. దిగువ పేర్కొన్న కాలువలు వాటికి ఎదురుగా తెలిపిన కాలంలో మూసివుంచబడతాయి :

| | | | | |
|---|---|---|---|---|
| 1. కామినేనిపల్లి కాలువ (మై. 116-4-594 ఎల్.వద్ద) | 16–1–61 | నుంచి | 15–6–61 | వరకు |
| 2. రెవనూర్ కాలువ (మై. 117-4-198 ఆర్. వద్ద) | ,, | ,, | ,, | |
| 3. చాకిరాజు వేముల కాలువ (125-2- ఒ. ఆర్. వద్ద) | ,, | ,, | ,, | |
| 4. దొర్నిపాడు కాలువ (మై 125-6-462 ఆర్. వద్ద) | ,, | ,, | ,, | |
| 5. సుద్దపల్లి కాలువ (మై. 136-6-462 ఆర్. వద్ద) | ,, | ,, | ,, | |
| 6. గొట్లూరు కాలువ (మై. 141-5- ఒ. ఎల్. వద్ద) | ,, | ,, | ,, | |
| 7. పరమటూరు కాలువ (తుడిచెర్ల సిస్టమ్) | ,, | ,, | ,, | |
| 8. ఎర్నిపాడు కాలువ (మై. 100-3- ఒ. ఆర్. వద్ద) | 15-1-61 | ,, | ,, | |
| 9 బొల్లవరం కాలువ (మై. 103-1- ఒ. ఆర్. వద్ద) | ,, | ,, | ,, | |
| 10. సాంబవరం కాలువ (మై. 111-4-132 ఆర్. వద్ద) | 16-4-61 | ,, | 15-7-61 | |
| 11. కమలవల్లి కాలువ (మై. 114-2-132 ఆర్. వద్ద) | 16-1-61 | ,, | 15-6-61 | |
| 12. జిల్లెళ్ళ కాలువ (మై. 115-6-462 ఆర్. వద్ద) | ,, | ,, | ,, | |
| 13. నందింపల్లి కాలువ (మై. 124-6-462 ఎల్. వద్ద) | ,, | ,, | ,, | |
| 14. లింగందిన్నె కాలువ (మై. 133-3-528 ఆర్. వద్ద) | ,, | ,, | ,, | |
| 15. సిర్వేలు కాలువ (మై. 117-4-198 ఎల్. వద్ద) | ,, | ,, | ,, | |
| 16. చింతకుంట ఐ. బి. కాలువ (మై. 131-6-264 ఆర్. వద్ద) | ,, | ,, | ,, | |
| 17. అర్జునపురం కాలువ (మై. 125-6-462 ఎల్. వద్ద) | ,, | ,, | ,, | |

* * *

## తూటిగుంట లాంచి ప్రమాదం - బాధితులకు ప్రభుత్వ గ్రాంటులు

పశ్చిమ గోదావరి జిల్లా తూటిగుంట సమీపంలో 1960 జూలై 30వ తేదీన జరిగిన మోటారు లాంచి ప్రమాదంలో మరణించిన వ్యక్తుల ఆశ్రితులకు అర్హులైనవారికి సహాయంగా గ్రాంటులు మంజూరు చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

ప్రమాదంలో చనిపోయిన పదకొండుగురు వ్యక్తుల ఆశ్రితులకు, ప్రమాదంలో చిక్కుకొని బ్రతికి బయటబడ్డ మరోవ్యక్తికి దిగువ పేర్కొన్న విధంగా గ్రాంటులు ఇవ్వడానికి ప్రభుత్వం రు. 2,600ల మొత్తం మంజూరు చేసింది.

| జిల్లా | మరణించిన వ్యక్తి పేరు | ఆశ్రితులకు చెల్లింపబడే మొత్తం |
|---|---|---|
| తూర్పుగోదావరి | శ్రీ ఇసపెంటి రంగారావు, కలికిమూర్తి కుమార్డు, కొత్తపల్లి | రూ. 250 |
| ,, | శ్రీ ససుపల్లి అప్పారావు, పైడయ్య కుమార్డు | రూ. 100 |
| ,, | శ్రీ కొర్తల వీరఅప్పారావు, కన్నయ్య కుమార్డు, రాజమండ్రి | రూ. 200 |
| ,, | శ్రీ షేక్ నబీసాహెబ్, దేవీపట్నం | రూ. 300 |
| ,, | శ్రీ నాగుల జనార్దనం, అప్పన్న కుమార్డు, ధవళేశ్వరం | రూ. 300 |
| ,, | శ్రీ గోరముచ్చు లక్ష్మీకాంతమ్మ, వీరయ్య భార్య, మల్లవరం | రూ. 100 |
| ,, | శ్రీ చీకట్ల సూర్యారావు, వీరన్న కుమార్డు | రూ. 300 |
| ఖమ్మం జిల్లా | శ్రీ కుక్కునూరి సత్యనారాయణ, కుక్కునూరు | రూ. 350 |
| ,, | శ్రీ అన్నెబోయిన లక్ష్మయ్య, భద్రాచలం | రూ. 250 |
| ,, | శ్రీ కొత్తూరి బుచ్చయ్య, నెల్లిపాక | రూ. 250 |
| ,, | శ్రీ గుడె అప్పారావు, నాగేశ్వరరావు కుమార్డు, చీరాల | రూ. 100 |
| | ప్రమాదం తప్పిన వ్యక్తి | |
| తూ. గోదావరి జిల్లా | శ్రీ పోతుల సుబ్బారావు, శీలాలంక | రూ. 100 |
| | మొత్తం | రూ. 2,600 |

ప్రమాదానికి గురై నీటిలో మునిగి పోతున్న నలుగురు వ్యక్తులను కాపాడటంలో ధైర్య సాహసాలు ప్రదర్శించి నందుకు పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన దిగువ అయిదుగురు వ్యక్తులకు ఒక్కొక్కరికి రు. 50 ల చొప్పున రొక్కం గ్రాంటు చెల్లింపబడుతుంది. శ్రీ కల్లా లింగారెడ్డి, శ్రీ చింతలాడ సోమిరెడ్డి, శ్రీ చింతలాడ కన్నంరెడ్డి, శ్రీ బెరుగు అప్పారావు, శ్రీ కడపల వెంకటేశ్వర్లు.

## మెట్రిక్ తూకాల వాడకం

ఆంధ్రప్రదేశ్ తూకాలు, కొలమానాలశాఖ కంట్రోలరు క్రింద ప్రకటనను విడుదల చేశారు.

1960 అక్టోబరు 1 నుంచి మెట్రిక్ తూకాల వాడకం నిర్బంధం చేయబడినట్లు ప్రజలకు, వ్యాపారస్థులకు తెలిసిన విషయమే. రూపు రాళ్లు అమ్మకందార్లవద్ద తగినన్ని లభ్యమవుతున్నాయి. చిల్లర దుకాణాలవారు, పెద్దదుకాణాదార్లు మెట్రిక్ తూకాలు కొనికూడా, పాతశేరు, పౌను తూకాలనే వాడుతున్నారు. హైదరాబాదు జిల్లాలో ఇక నుంచి ఎవరైనా శేరు, పౌను మొదలయిన పాత తూకాలను వాడుతున్నట్లు కనుగొనబడితే, వారిపై తూకాలు కొలమానాల చట్టం క్రింద తగినశిక్షగా చర్యలు తీసుకోవటం పాత తూకాలరాళ్లు కూడా లాగేసుకొనటం జరుగుతుంది. వ్యాపారస్థులవద్ద వున్న పాత శేరు, పౌను తూకాలను కిలోగ్రాముకు 26 న, పైసల చొప్పున స్థానిక ఉత్పత్తిదార్లు కొనటానికి నిర్ణయించారని కూడ యీ సందర్భంలో వ్యాపారస్థుల సమాచారార్థం తెలియజేయట మయింది.



# విశేషాలు

## ఆర్గురు ఆంధ్రులకు ఫెలోషిప్పులు

జాతీయ పరిశోధన ఫెల్లోషిప్పులకు కేంద్రప్రభుత్వం ఎన్నిక చేసిన వారిలో ఆరుగురు ఆంధ్రులు వున్నారు. వారి పేర్లు ఇవి : శ్రీ ఎం. మధుసూదనరావు, శ్రీ కరోటి మోహన్, డా. బి. లక్ష్మినారాయణ, డా. హెచ్. సేతురామారావు, డా. ఆర్. రాఘవ రావు, శ్రీ కె. వి. రమణ. వీరిలో మొదటి ఇద్దరు బెంగుళూరు లోని భారత శాస్త్ర విజ్ఞాన సంస్థకూ, మిగిలినవారు ఆంధ్ర విశ్వ విద్యాలయానికి చెందినవారు.

శ్రీ కె. వెంకటరమణకు, ఆయన డాక్టరేటు డిగ్రీ పొందిన తరువాత ఫెల్లోషిప్పు ఇస్తారు.

## రిపబ్లిక్ దినోత్సవ అవార్డులు

ఈ సంవత్సరం రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా 41 మందికి బిరుదులు ఇవ్వబడినవి. ప్రభుత్వోద్యోగులతో సహా అయా రంగాలలో ప్రశంసార్హమైన కృషి సల్పిన వారికి ఈ బిరుదులు ఇస్తారు. ఈ సంవత్సరం "పద్మభూషణ్" బిరుదు పొందిన వారిలో ఆంధ్రప్రదేశ్ స్పెషల్ ఛీఫ్ ఇంజనీరు శ్రీ లక్ష్మినారాయణ వెంకట కృష్ణ అయ్యర్ కూడా వున్నారు.

సుప్రసిద్ధ ఇంజనీరు శ్రీ అయ్యర్ 18 సంవత్సరాల అనుభవం గడించిన దిట్ట. ఆయన 1927 వ సంవత్సరంలో మద్రాసులో అసిస్టెంటు ఇంజనీరుగా ఉద్యోగంలో ప్రవేశించి తన ప్రతిభా సామర్థ్యంతో 27 సంవత్సరాలలో ప్రధాన ఇంజనీరు కాగలిగాడు. 1924 వ సంవత్సరంలో మెట్టూర్ ఆనకట్ట నిర్మాణం జరిగినపుడు ఆయన మన దేశంలో తయారైన సిమెంటును దానికి ఉపయోగించారు. 1956 వ సంవత్సరం నుంచి ఆయన ఆంధ్రప్రదేశ్‌లో నీటి పారుదల విభాగానికి స్పెషల్ ఛీఫ్ ఇంజనీరుగా పనిచేస్తున్నారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని కేంద్ర ఇంగ్లీషు భాషా సంస్థ డైరెక్టరు అయిన శ్రీ వినాయక్ కృష్ణగోకక్‌కూ, ప్రస్తుతం వాల్తేరులో వుంటున్న డాక్టర్ (కుమారి) హిల్డామేరీ లాజరస్‌కు "పద్మశ్రీ" బిరుదు ఇచ్చారు. శ్రీ వి. కె. గోకక్ సుప్రసిద్ధ ఆంగ్ల భాషా పండితుడు. ఆయన అనేక కళాశాలలో అధ్యాపకుడుగా పనిచేసి గణతి కెక్కాడు. డాక్టర్ (కుమారి) హిల్డామేరీ లాజరస్ ఎడింబరో నుంచి ఎఫ్.ఆర్. సి.ఎస్., లండన్ నుంచి ఎమ్. ఆర్. సి. ఎస్. యల్. ఆర్. సి. పి. పట్టాలు పొందారు. అబ్‌స్టాట్రిక్స్, గైనకాలజీ సంస్థ గౌరవ డైరెక్టరుగా ఇప్పుడు ఆమె పని చేస్తున్నారు.

## స్వర్గీయ డా॥ వి. ఎస్. కృష్ణ

విశ్వవిద్యాలయ గ్రాంటుల సంఘం అధ్యక్షుడు డా. వి.ఎస్.కృష్ణ, ఫిబ్రవరి 16 వ తేదీన కొత్తఢిల్లీలో స్వర్గస్థులైనారు. మరణ సమయానికి ఆయన వయస్సు 58 సంవత్సరాలు. డాక్టర్ కృష్ణ విశ్వవిద్యాలయ గ్రాంటుల సంఘం అధ్యక్షుడుగా డాక్టర్ సి. డి. దేశ్‌ముఖ్ స్థానే, 1961 జనవరి 14 వ తేదీన నియమింపబడినారు. సుమారు 12 సంవత్సరాలపాటు ఆయన ఆంధ్ర విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులుగా పని చేశారు.

ఆయన 1902 అక్టోబరు 8 వ తేదీన జన్మించారు. గుంటూరులో కొంతకాలం చదువుకున్న తరువాత మెట్రిక్యులేషను పరీక్షకు లండన్ వెళ్లారు. ఆక్స్‌ఫర్డ్‌లోని "మోడరన్ గ్రేట్స్" స్కూలు నుంచి పట్టా పుచ్చుకున్నారు. ఆర్థిక, రాజకీయ, తత్వశాస్త్రాలను ఆయన అభ్యసించారు. 1932 వ సంవత్సరంలో ఆర్థిక శాస్త్రంలో అధ్యాపకుడుగా ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రవేశించారు. తరువాత ఉన్నత విద్యాభ్యాసానికి, పరిశోధనకు వియన్నా వెళ్లారు. 1947 వ సంవత్సరంలో ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలల ప్రిన్సిపాలుగానూ అటుతరువాత 1949 వ సంవత్సరంలో విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడుగాను నియమింపబడినారు. ఈనాడు ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇంత ఉన్నతిలోనికి రావడానికి ప్రధాన కారకులు డా॥ కృష్ణ. ఆయన తన అసమాన ప్రతిభా సామర్థ్యాలతో ఈ విశ్వవిద్యాలయాన్ని తీర్చి దిద్దారు.



# పంటల పోటీలు

1957-58 వ సంవత్సరంలో జరిగిన పంట దిగుబడి పోటీలలో, సగటున ఒక ఎకరానికి రాష్ట్రమంతటిలోకి అత్యధిక ఉత్పత్తిని సాధించి ప్రథములుగా ఎన్నికైన వారికి బహుమతులనూ, 1958-59వ సంవత్సరం రబీ ఋతువులో గత మూడు సంవత్సరాల సగటు ఉత్పత్తికంటే నూటికి 15 వంతుల ఉత్పత్తి అధికంగా సాధించిన జిల్లాలకు సాముదాయిక అవార్డులను 1961 ఫిబ్రవరి 2 వ తేదీన హైదరాబాదులోని అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనంలో జరిగిన ఒక సభలో రాష్ట్రవ్యవసాయ శాఖామంత్రి బహూకరించారు.

త్రమ భూఖండాలలో ఆహారోత్పత్తిని అత్యధికంగా సాధించాలనే అభినివేశాన్ని రైతాంగంలో దేశవ్యాప్తంగా కలిగించాలనే ఉద్దేశంతో భారత ప్రభుత్వం పంటల పోటీ పథకాన్ని ప్రారంభించి, ఇటువంటి పోటీలను విరివిగా నిర్వహించవలసిందిగా రాష్ట్రప్రభుత్వాలనుకూడా కోరింది. దీనిని పురస్కరించుకొని మన రాష్ట్రంలో 1952-53 వ సంవత్సరంలో ప్రథమంగా వరిపంట పోటీలు జరపబడినవి. ప్రారంభంలో ఈ పోటీలు వరి, జొన్న పంటల వరకే పరిమితంచేయబడినా ఇప్పుడు చెరకు, వేరుసెనగ, పొగాకు మొదలైన ఇతర పంటలలోకూడా జరుపబడుతున్నాయి.

వ్యవసాయశాఖవారు ఎప్పటికప్పుడు సూచించే ఆధునిక వ్యవసాయ పద్ధతులను రైతులచేత అవలంబింపజేయటం ద్వారా పంట ఉత్పత్తి స్థాయిని పెంపొందించడానికి తలపెట్టబడినది. 1957-58 వ సంవత్సరంలో వరి, జొన్న, చెరకు, వేరుసెనగ, పొగాకు పంటల పోటీలు జరుపబడినవి. ఈ పోటీలవల్ల రైతులలో ఆధునిక వ్యవసాయ విధానాలను, అనుసరించాలన్న ఆసక్తిని కలిగించడానికేగాకుండా వ్యవసాయ ఉత్పత్తి రంగంలో జరిగిన ప్రయోగాల ఫలితాలను ప్రత్యక్షంగా అమలుపరచడానికికూడా వీలుకలిగింది. ఒక గ్రామంలో ఒక రైతు ఆధునిక వ్యవసాయ పద్ధతులను లనుసరించి ఉత్తమ ఫలితాలు సాధించినప్పుడు సహజంగా ఆ గ్రామంలో ఇతర రైతులు కూడా వీటిని తమపై తాము అవలంబిస్తారు. ఏటేటా ఈ పోటీలపట్ల రైతులలో ఉత్సాహం పెంపొందుతున్నది. వీటిని దృష్టిలో పెట్టుకొని రైతులు తమ క్షేత్రాలలో అత్యధిక ఉత్పత్తిని సాధించడానికి శాయశక్తులా కృషి చేస్తున్నారు.

1959-58 వ సంవత్సరంలో 34441 మంది వరిపంట పోటీలలో, 3575 మంది జొన్నపంట పోటీలలో, 4012 మంది చెరకుపంట పోటీలలో 5445 మంది పాల్గొన్నవారు 681 మంది.

ప్రతి పంట పోటీలోను ఒకరు చొప్పున మొత్తం అయిదుగురిని ఉత్తమ రైతులుగా ఎన్నికచేశారు.

స్వయం కృషిద్వారా పంట ఉత్పత్తిని అత్యుత్తమ స్థాయికి పెంచిన ఈ రైతులను సముచిత రీతిన సత్కారం జరపడం భావ్యం. ఈ అయిదుగురికీ రు. 500-ల నగదు బహుమతులను, రు. 120 లు విలువచేసే స్వర్ణపతకాలను బహూకరించారు. వరి పంట పోటీలో, శ్రీకాకుళం జిల్లా, నర్సన్నపేట తాలూకాలోని పెద్దుల్ల వలస గ్రామానికి చెందిన శ్రీ కరిమి సుబ్బయ్యనాయుడుకు బహుమతి లభించింది. ఈయన ఎకరానికి 10380 పౌనుల ధాన్యం పండించారు. ఎకరానికి 4380 పౌనుల జొన్నలు పండించిన కర్నూలుజిల్లా, నందికొట్కూరుతాలూకా పగిడాలగ్రామ కాపురస్థుడు శ్రీ మియాసాహెబ్‌కు ఆ పంట పోటీలో బహుమతి వచ్చింది. ఎకరానికి 116 టన్నుల చెరకు పండించిన శ్రీ అలపాటి వీరన్న ఆ పంటపోటీలో బహుమతి పొందాడు. ఈయన పశ్చిమగోదావరిజిల్లా, తణుకు తాలూకాలోని మొర్త గ్రామ కాపురస్థుడు. వేరుసెనగ పంటపోటీలలో శ్రీ ఎస్. స్వామిరెడ్డికి బహుమతి లభించింది. కర్నూలు జిల్లా నన్నూరు గ్రామ వాస్తవ్యుడైన ఈ రైతు ఎకరానికి 3520 పౌనుల కాయ పండించాడు. పొగాకుపంట పోటీలలో విజయవాడ తాలూకా కానూరుకు చెందిన శ్రీ వి. అచ్చేశ్వరరావుకు బహుమతి వచ్చింది. ఈయన ఎకరానికి 14,000 పౌనుల ఆకు పండించాడు.

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ పంటలలో 1957-58 వ సంవత్సరానికై ఒక ఎకరానికి లెక్కకట్టిన సగటు ఉత్పత్తులూ, ఆయా పంటల అఖిలభారతస్థాయి సగటు ఉత్పత్తులు దిగువ పట్టికలో ఎదురెదురుగా ఇవ్వబడినాయి.

| పంట | ఆంధ్రప్రదేశ్ | ఇండియా |
|---|---|---|
| వరి | 1581 పౌ. | 1052 పౌ. |
| జొన్న | 440 పౌ. | 438 పౌ. |
| చెరుకు | 3.36 టన్నుల (బెల్లం) | 1.35 టన్నుల (బెల్లం) |
| వేరుసెనగ | 781 పౌనుల కాయ | 668 పౌనుల కాయ |
| పొగాకు | 639 పౌనుల ఆకు | 610 పౌనుల ఆకు |

ఈ పట్టికనుబట్టి, ప్రధానమైన పంటలలో ఆంధ్రప్రదేశ్ సగటు ఉత్పత్తి, మించిపోయినట్టు విదితమవుతుంది. పంటల పోటీలను తరచుగా జరిపి వాటిలో రైతులు విరివిగా పాల్గొనేటట్టు చేయడంవల్లా, నవీన వ్యవసాయ పద్ధతులను అవలంబించడంలో, రైతులు శ్రద్ధాసక్తులు కనబరచడంవల్ల ఆహారోత్పత్తిలో గమనార్హమైన అభివృద్ధి కలగడం తథ్యం.

అవార్డులు

1958-59 వ సంవత్సరం రబీ ఋతువులో, గత ఐదు సంవత్సరాల సగటు ఉత్పత్తికంటే నూటికి 15 వంతుల ఉత్పత్తిని అధికంగా సాధించినందుకు రాష్ట్రంలోని ఇరవై జిల్లాలలో తొమ్మిది జిల్లాలకు ఒక్కొక్క దానికి రు. 10,000 ల చొప్పున సాముదాయిక అవార్డులు బహూకరింపబడినవి. ఈ అవార్డులు పొందిన జిల్లాల పేర్లివి: విశాఖపట్నం, కృష్ణా, ఆదలాబాదు, నిజామాబాదు, కరీంనగరం, వరంగల్, హైదరాబాదు, నల్గొండ, మహబూబ్‌నగరం. నూటికి 61 వంతుల ఉత్పత్తిని అధికంగా సాధించినందుకు కృష్ణా జిల్లాకు అవార్డుతోపాటు రు. 500 ల విలువచేసే రోలింగ్ ట్రోఫీకూడా బహూకరింప బడినది.



జనగణన 1961 :- ఆంధ్ర ప్రదేశ్ ప్రథమ పౌరుడు అయిన రాష్ట్ర గవర్నరు వద్దనుంచి 1961 జనవరి 10 వ తే. . రాజభవన్‌లో వివరాలు సేకరించడంతో రాష్ట్రంలో 1961 జనగణన ప్రారంభమైంది

# ఉత్తరదేశ పారిశ్రామిక విజ్ఞాన యాత్ర

ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వ్యవసాయరాష్ట్రం అయినందువల్ల, పారిశ్రామికంగా ఎక్కువ అభివృద్ధిజెందలేదు. అందుకు కారణం- ప్రజలు తరతరాలనుంచి కరతలామలకంగా వస్తున్న వ్యవసాయం నుంచి తమకు అపరిచితమయిన పారిశ్రామిక రంగాలవు మళ్ళడానికి విముఖంగా వుండటమే. ఐతే, నేడున్న పరిస్థితులదృష్ట్యా, ప్రజల జీవనప్రమాణం పెంచాలంటే, పరిశ్రమల స్థాపనలో ఏ రాష్ట్రమూ వెనుకబడి లాభంలేదు. అందుకే కొంతకాలంనుంచి రాష్ట్రప్రభుత్వం, ప్రజలు, పరిశ్రమలను ముఖ్యంగా చిన్నపెట్టుబడులకు సాధ్యమయ్యే లఘుపరిశ్రమలను నెలకొల్పడానికి సుముఖులయ్యేట్లు అనేక చర్యలు తీసుకుంటున్నది. ఎంతో శ్రమపడి సంపాదించిన అమూల్యమయిన ధనాన్ని పరిశ్రమలలో పెట్టడానికి ఒప్పించేముందు ఇవి లాభదాయకమయినవని అతనికి నమ్మిక కల్గించాలి. అలా నమ్మిక కల్గించేందుకై, లఘుపరిశ్రమల స్థాపనకు అవసరమయ్యే సదుపాయాలను సమకూర్చటంతోపాటు, పరిశ్రమలు ప్రారంభించాలని అభిలషించేవారికి దేశంలో పారిశ్రామికంగా విరివిగా అభివృద్ధి అయిన ప్రాంతాలను చూపడానికి విజ్ఞాన యాత్రలు యేర్పాటుజేయాలని ప్రభుత్వం నిశ్చయించింది.

ఈ విజ్ఞాన యాత్రలు వివిధరకాల పరిశ్రమలు గురించిన సమాచారాన్ని ప్రత్యక్షంగా తెలుసుకోడానికి తోడ్పడతాయి. తానే వెళ్లి స్వయంగా ఫ్యాక్టరీ చూసినందువల్ల, ఫ్యాక్టరీ భవనం ప్రమాణం మొదలుకుని యంత్రాంగం ఏమేమి కావలసిందీ, ముడి పదార్థాలు వేటిని వాడేదీ వస్తువులు తయారుచేసే పద్ధతీ, వాటిని మార్కెటుకు ఏ విధంగా పంపేదీ మొదలయిన సమాచారమంతా తెలుసుకో గలుగుతాడు. ఇలాంటి పర్యటన యాత్రికుని కండ్లు తెరిపించి, అతన్ని కార్యశూరునిగా తయారు చేస్తుంది.

శాసనమండలి, జిల్లా పరిషత్తు, పంచాయతీ సమితుల సభ్యులు, పారిశ్రామిక దారులు, వాణిజ్య పరిశ్రమలశాఖ సాంకేతికాధికారులు కలిసిన 50 మందిగల జట్టు ఒకటి ఉత్తరదేశ పారిశ్రామిక విజ్ఞాన యాత్రకై జనవరి 21 న హైదరాబాదునుండి బయలుదేరి వెళ్ళింది. ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, పంజాబు ఇంకా కొన్ని ఇతర రాష్ట్రాలలో మొత్తం 100 పారిశ్రామిక కేంద్రాలు పర్యటించి ఈ బృందం ఫిబ్రవరి 9 న తిరిగివచ్చింది.

ఆగ్రాలో మోడరన్ టిన్ ప్రింటర్స్, తోలుతో తయారుచేసే పాదరక్షల కేంద్రాలు, రబ్బరు కేంద్రాలు, రీ-రోలింగు మిల్లు, మాలియబుల్ కాస్ట్ఐరన్ ఫౌండ్రీ (Malleable Cast-iron foundry) లను, ఇతర పారిశ్రామిక కేంద్రాలను సందర్శించారు.

ఫరీదాబాదులో రాష్ట్ర లఘు పరిశ్రమలు, ఎక్సైజు శాఖామంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, ఫరీదాబాదు జిల్లా పారిశ్రామికాధికారులు వెంటరాగా యాత్ర సభ్యులతో కలిసి ఇండియన్ హార్డ్‌వేర్ ఇండస్ట్రీస్, భారత కార్బన్ అండ్ రిబ్బన్ మాన్యుఫాక్చరింగ్, పారమౌంట్ రబ్బరు ఇండస్ట్రీస్, రతన్‌చంద్ హారిదాస్ ప్లాస్టిక్ ఇండస్ట్రీస్, ఎలక్ట్రానిక్స్ (ప్రైవేట్) లిమిటెడ్, ఆటో-పిన్స్ లిమిటెడ్ మొదలయిన పారిశ్రామిక కేంద్రాలను దర్శించారు. ఆయా పరిశ్రమల యజమానులు ఉత్సాహంతో జట్టుకు వారి ఫ్యాక్టరీలను చూపుతూ పూర్తి వివరాలనుకూడా తెలియజేశారు. పదేండ్లకాలంలో ఫరీదాబాదు పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధిజెందినందుకు లఘుపరిశ్రమల మంత్రి ఆశ్చర్యానందభరితు లయ్యారు.

ఢిల్లీలో, మంత్రి నాయకత్వాన యీ జట్టు అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడు, శ్రీ నీలం సంజీవరెడ్డిని, కేంద్ర పరిశ్రమలమంత్రి శ్రీ మనూభాయ్ షాను, కేంద్ర వాణిజ్య పరిశ్రమలమంత్రి శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రిని కలుసుకున్నారు. వారు దేశ పారిశ్రామికాభివృద్ధికి ఇలాంటి విజ్ఞాన యాత్రలు మంచి లక్ష్యాలని కొనియాడుతూ, యాత్ర జయప్రదంగా సాగాలని హృదయపూర్వకమైన తమ ఆకాంక్షలను తెలియజేశారు. ఈ జట్టు ఢిల్లీలోని ఓక్లా పారిశ్రామికవాడను, రబ్బరు ఇన్సులేటెడ్ వస్తువులు, ఎలక్ట్రికల్ వైర్లు, యంత్ర పరికరాలు, ప్లాస్టిక్ సామాను, ఆటో-పిన్స్, యాక్సెసరీలు, హరికేన్ లాంతర్లు, వాటర్ కూలర్లు, రిఫ్రిజిరేటర్లు మొదలైనవి ఉత్పత్తిజేసే కేంద్రాలను చూశారు.

ఇక పంజాబులో అమృతసర్, బటాల, జలంధర్, లూధియానా, అంబాలాలో ప్రధానమైన పారిశ్రామిక కేంద్రాలను సందర్శించారు. యంత్రపరికరాలు, క్రీడా సాధనాలు, శస్త్రచికిత్సా సాధనాలు, ఎలక్ట్రికల్, ఎలక్ట్రానిక్, సైంటిఫిక్ పరికరాలు, థర్మామీటర్లు మొదలైనవి తయారుచేసే ఫ్యాక్టరీలను క్షుణ్ణంగా పరిశీలించారు.

ఈ పర్యటనను ఫలప్రదంగా ముగించుకుని పారిశ్రామిక విజ్ఞాన యాత్రాబృందం ఫిబ్రవరి 9 న తిరిగి హైదరాబాదు చేరుకున్నది. తరువాత మంత్రితో జరిపిన విందులో, తమ అనుభవాలను యాత్రవలన పొందిన లాభాలను వివరించి, లఘుపరిశ్రమలు స్థాపించే విషయాన్ని తీవ్రంగా ఆలోచిస్తామని అభయమిచ్చారు.

# ముఖ్యవార్తలు

**21—1—1961**

బ్రిటిష్‌రాణి ఎలిజబెత్ నేడు ఢిల్లీ చేరుకున్నారు. ఆమె మన దేశంలో 21 రోజులపాటు పర్యటిస్తారు.

**22—1—1961**

ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు పథకం మొదటి దశ కార్యక్రమంక్రింద నిర్మించవలచిన మళ్లింపు ఆనకట్టకు రాష్ట్ర (పబ్లిక్‌వర్క్సు) శాఖామంత్రి ఈ వేళ శంకుస్థాపన చేశారు.

తక్కువ ఆదాయంగల వారలకు చౌకగా రేడియో సెట్టులను సరఫరాచేయడానికి ఒక ప్రైవేటుసంస్థ తలపెట్టిన పథకానికి హైద్రాబాదులో ఈ రోజు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం గావించారు.

**23—1—1961**

1370 వ ఫసలీ సంవత్సరంలో అనావృష్టి పరిస్థితులవల్ల రాష్ట్రంలో పంటలు చెడిపోయిన ప్రదేశాలలో రైతులకు సహాయక చర్యలక్రింద ప్రభుత్వం నేడు పూర్తి శిస్తు రెమిషన్లు, సగం రెమిషన్లు ప్రకటించింది.

**24—1—1961**

పశ్చిమగోదావరి జిల్లాలోని తూటిగుంట గ్రామ సమీపంలో 1960 జూలై 30వ తేదీన సంభవించిన మోటారు-లాంచి ప్రమాదంలో మరణించిన పదకొండుమంది వ్యక్తుల ఆశ్రితులకూ ప్రమాదంనుంచి బయటబడ్డ మరో వ్యక్తికి ప్రభుత్వం ఎక్స్‌గ్రేషియా గ్రాంటులు మంజూరు చేసింది.

**25—1—1961**

రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్, 11వ రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా దేశప్రజలకు ఇచ్చిన సందేశంలో "మన కర్తవ్యం నిజంగా బృహత్తరమైనది. అయినా మన జాతీయ సంకల్ప బలాన్నికూడా అంతే బృహత్తరమైనదిగా మనం తల్చుకుంటే ఈ బ్రహ్మాండమైన కార్యాన్ని సులభంగా సాధించగలుగుతామ"ని అన్నాడు.

**26—1—1961**

రాష్ట్రప్రభుత్వం ప్రకటించిన 'అల్లూరి సీతారామరాజు చరిత్ర' అనే గ్రంథాన్ని నేడు రాష్ట్ర ముఖ్యమంత్రి నగరంలో ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడిన సభలో ఆవిష్కరించారు.

**27—1—1961**

అఖిలభారతవైద్యశాస్త్రసంస్థకళాశాలకు కొత్తఢిల్లీలో నూత్నంగా నిర్మింపబడిన భవనాలకు ఎలిజబెత్‌రాణి ప్రారంభోత్సవంచేశారు. వైద్యశాస్త్రంలో పోస్టుగ్రాడ్యుయేటు శిక్షణ గరిపే సంస్థ మొత్తం ఆసియాలోకెల్లా ఇదొక్కటే దేశంలోని వైద్యకళాశాలల అధ్యాపకులకు ఈ సంస్థలో శిక్షణ ఇస్తారు.

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి సంస్థకు, రాష్ట్ర ప్రణాళికా, సమాచారశాఖల మంత్రి ఈ వేళ లాంఛనప్రాయంగా ప్రారంభోత్సవం చేశారు.

**28—1—1961**

జిల్లా వైద్యాధికార్లు, ఆరోగ్యాధికార్ల ప్రథమ మహాసభను నేడు హైద్రాబాదులో రాష్ట్ర ఆరోగ్య, వైద్యశాఖల మంత్రి ప్రారంభించారు. రు. 4 లక్షల వ్యయంతో జనగామలో నిర్మించిన నేతపనివారల కాలనీకి నేడు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

**29—1—1961**

చతుర్థ అఖిలభారత కుటుంబ నియంత్రణ మహాసభను యూనియన్ ఆహారశాఖా మంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ నేడు హైద్రాబాదులో ప్రారంభించారు.

**30—1—1961**

జాతిపిత పూజ్యబాపూజీ నిర్యాణ దిన సందర్భంగా ఈ రోజు దేశమంతటా, భారతదేశ స్వాతంత్ర్య సమరంలో అసువులు బాసిన యోధులు సంస్మరణార్థం మౌనప్రార్థనలు జరపబడినాయి. మహాత్మాగాంధీకి శ్రద్ధాంజలి ఘటించబడినది.

**31—1—1961**

బీహారు ముఖ్యమంత్రి శ్రీ కృష్ణసిన్హా నేడు పాట్నాలో అస్తమయం చెందారు.

**1—2—1961**

విశాల హైద్రాబాదు నగరంలోనూ, రాష్ట్రంలోని ఇతర

ప్రదేశాలలోను ప్రభుత్వం ఇంకా ఎక్కువ పారిశ్రామిక ఎస్టేట్లను నెలకొల్పదలచిందని లఘు పరిశ్రమలశాఖా మంత్రి అన్నారు.

**2—2—1961**

కృష్ణా, గోదావరి నదీజలాల పంపిణీ విషయంలో, యూనియన్ నీటిపసరులు, విద్యుచ్ఛక్తిశాఖల మంత్రి బెంగళూరులో మైసూరు మంత్రులతో చర్చలు జరిపారు.

**3—2—1961**

మెదక్ జిల్లా సంగారెడ్డిలో లోకకార్య క్షేత్రాల జాతీయ గోష్ఠి నేడు ఆరంభమైంది. ఈ గోష్ఠి నాలుగురోజులు జరిగింది.

ఏలూరు తాలూకాలోని గుండుగొలనులోనూ, తాడేపల్లిగూడెం తాలూకాలోని పెదనింద్రకొలనులోను ప్రభుత్వం రెండు సహకార వ్యవసాయ క్షేత్రాలను స్థాపించదలచినట్టు నేడు ప్రకటించబడినది.

**4—2—1961**

ఆరున్నర టన్నుల బరువుగల స్పుత్నిక్‌ను నేడు రష్యా అంతరిక్షంలోకి ప్రయోగించింది.

**5—2—1961**

ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ అఖిల భారత హరిజన గిరిజన శాసన సభ్యుల మహాసభను నేడు హైద్రాబాదులో ప్రారంభించారు.

**6—2—1961**

రక్షణ, ఉత్పత్తి కేంద్రానికి ముఖ్యమంత్రి హైద్రాబాదులో శంకుస్థాపన చేశారు.

**7—2—1961**

కృష్ణా జిల్లాలో రెండు చిన్నతరహా నీటివసరుల ప్రాజెక్టులకు రాష్ట్ర పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి శంకుస్థాపన చేశారు.

సిక్కిం మహారాజా నేడు బొంబాయి నుంచి 3 రోజుల పర్యటనపై నగరానికి విచ్చేశారు. ఆయన నగరంలోని వివిధ స్థలాలనూ, నాగార్జున సాగర్ ప్రాజెక్టును సందర్శించారు.

**8—2—1961**

ప్రపంచ ఆరోగ్య సంస్థ పధ్నాలుగవ సమావేశం నేడు క్రొత్త ఢిల్లీలో ఆరంభమైంది.

**9—2—1961**

ప్రతి సంవత్సరం, జాతీయ ప్రాముఖ్యత వున్న అయిదు రోజులలో తెలంగాణా అంతటా ప్రభుత్వం మద్యపాన నిషేధాన్ని అమలు జరపదలిచినట్లు ఈ వేళ ఆధికారికంగా ప్రకటించబడింది.

**10—2—1961**

దేశమంతటా సుమారు 10 లక్షల మంది సేకరణోద్యోగులు నేటినుంచి జనాభా లెక్కల వివరాల సేకరణ ప్రారంభించారు.

**11—2—1961**

శ్రీకాకుళంకు అయిదుమైళ్ల దూరంలోనున్న నీరడివద్ద నేడు ముఖ్యమంత్రి వంశధార ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు.

**12—2—1961**

బస్తర్ మహారాజాగా శ్రీ పవీన్‌చంద్రభంజ్‌దేవ్‌కు వున్న పరిగణను రద్దుపరుస్తూ, ఆయన స్థానంలో ఆయన సోదరున్ని 'మహారాజా'గా పరిగణిస్తూ ఈవేళ రాష్ట్రపతి ఉత్తర్వులు చేశారు.

**13—2—1961**

కాంగో మాజీ ప్రధాని శ్రీ పాట్రిస్ లుముంబా, ఆయన అనుయాయులు ఇద్దరు ఫిబ్రవరి 12 వ తేదీన హత్యచేయబడినట్టు నేడు కటాంగా ప్రభుత్వాధికారి ఒకరు తెలియజేశారు.

**14—2—1961**

భారత, చైనా దేశాల సరిహద్దుల విషయంలో చైనా తనంత తాను చేసే నిర్ణయాలయొక్క లేదా జరిపే చర్చలయొక్క ఫలితాలను భారత దేశం అంగీకరించజాలదని రాష్ట్రపతి ఈవేళ ఉభయ పార్లమెంటుల సంయుక్త సమావేశంలో ప్రసంగిస్తూ ఉద్ఘాటించారు.

తెలంగాణా అభివృద్ధిపై ఈరోజు రాష్ట్ర ప్రభుత్వం శ్వేతపత్రం విడుదల చేసింది.

**15—2—1961**

ఈవేళ పార్లమెంటులో రైల్వే బడ్జెటు ప్రతిపాదినలు సమర్పించ బడినవి. ఈ బడ్జెటు అంచనాలలో ప్రయాణీకుల ఛార్జీలు, సరకుల రవాణా రేట్ల హెచ్చింపుకు సంబంధించిన ప్రతిపాదనలేవీ చేయబడలేదు.

**16—2—1961**

విశ్వవిద్యాలయ గ్రాంటుల సంఘం అధ్యక్షుడు డాక్టర్ వి. యస్. కృష్ణ ఈవేళ క్రొత్త ఢిల్లీలో నిర్యాణం చెందారు.

**17—2—1961**

ఆఫ్రికాదేశాల సమస్యలపై నేడు జరిగిన గోష్ఠిని ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ ప్రారంభించారు.

**18—2—1961**

నాగారాష్ట్ర తాత్కాలిక పరిపాలన మండలి కోహిమాలో నేడు ప్రారంభించబడింది. ఈ మండలిలో 42 మంది సభ్యులుగా వున్నారు.

**19—2—1961**

దక్షిణదేశంలో పర్యటించడానికై ఎలిజబెత్ రాణి ఈ రోజు మద్రాసు చేరుకున్నారు.

**20—2—1961**

1961—62 వ సంవత్సరానికి రాష్ట్ర బడ్జెటు అంచనాలను నేడు ఆర్థిక శాఖామంత్రి ఉభయ శాసనసభల సంయుక్త సమావేశంలో ప్రతిపాదించారు.



# రచయితలు

1. శ్రీ నాయని సుబ్బారావు (ఆకాశవాణి హైదరాబాదు)
2. శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి (రామచంద్రపురం తూ. గోదావరి జిల్లా)
3. శ్రీ మునిమాణిక్యం నరసింహారావు (ఆకాశవాణి, హైద్రాబాదు)
4. డా. దివాకర్ల వేంకటావధాని (ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు)
5. శ్రీ శనగన నరసింహస్వామి (గుణదల, విజయవాడ)
6. శ్రీ కొడవటిగంటి కుటుంబరావు "చందమామ" మద్రాసు-26
7. శ్రీ దిగుమర్తి సీతారామస్వామి (శ్రీరామపురం, భీమవరం, పశ్చిమగోదావరి జిల్లా)
8. శ్రీ కుంటిమద్ది శేషశర్మ (ధర్మవరం, అనంతపురం జిల్లా)
9. శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు (గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి, రాజమండ్రి)
10. శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి (మద్రాసు)
11. శ్రీ దాశరథి (ఆకాశవాణి, హైదరాబాదు)
12. శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య (సికింద్రాబాదు)
13. శ్రీ మిరియాల రామకృష్ణ (కూనవరం, భద్రాచలం తాలూకా)
14. శ్రీ నండూరి రామకృష్ణమాచార్య (అనంతపురం)
15. శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి (విజయవాడ)
16. శ్రీ కొంపల్లి మల్లికార్జునరావు (నక్రేకల్)
17. శ్రీ వీరిశెట్టి సుబ్బారావు (పుల్లేటికుర్రు, కొత్తపేట తాలూకా)
18. శ్రీ యస్. టి. పి. రామకృష్ణమాచార్యులు (పి. ఆర్. గవర్నమెంటు కాలేజి, కాకినాడ.)
19. శ్రీ హెచ్. ఆర్. వడ్డెంపూడి ("గుంటూరు న్యూస్" సంపాదకులు, అరండల్‌పేట, గుంటూరు - 2.)
20. శ్రీ ఎమ్. ఎ. సుభాన్ (వి. యల్. డబ్ల్యు., గంజిబండ, అనంతపురం జిల్లా.)
21. శ్రీ బత్తుల వెంకట రామిరెడ్డి (బేతాపల్లె, గుత్తి తాలూకా, అనంతపురం జిల్లా.)
22. శ్రీ కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు (గోషామహల్, హైదరాబాదు.)

## చిత్రకారులు

1. యం. శంకరరావు (అనకాపల్లి.)
2. వి. రామకృష్ణగంగరాజు (అర్లీపురం, వాల్తేరు.)

# అల్లూరి సీతారామరాజు చరిత్ర

ఆంధ్రవీరుని అద్భుత జీవితము

అన్ని వివరాలతో

సచిత్రంగా వర్ణింపబడినది

(రచయిత: యర్రమిల్లి నరసింహారావు)

★

ఆర్టుపేపరుమీద మనోజ్ఞంగా ముద్రింపబడిన

**ప్రభుత్వ ప్రచురణము**

వెల: రూ. 2-75 న. పై.

ప్రతులకు: సమాచార పౌరసంబంధముల శాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,

హైదరాబాదు - 1

Statement about ownership and other particulars about newspaper (ANDHRA PRADESH) to be published in the first issue every year after the last day of February.

# FORM IV

( See Rule 8 )

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Hyderabad. |
| 2 | Periodicity of the Publication | Monthly. |
| 3. | Printer's Name | Yuva Press. |
| | Nationality | Indian, |
| | Address | Public Garden Road, Hyderabad. |
| 4. | Publisher's Name | Director of Information and Public Relations. |
| | Nationality | Indian. |
| | Address | Mukarramjahi Road, Hyderabad-1. |
| 5. | Editor's Name | Narendra Luther, I. A. S. |
| | Nationality | Indian. |
| | Address | Director of Information and Public Relations, Government of Andhra Pradesh, Mukarramjahi Road, Hyderabad-1. |
| 6. | Names and Addresses of individuals who own the newspaper and partners or share - holders holding more than one per cent of the total capital. | |

I, Sri Narendra Luther, Director of Information and Public Relations of Andhra Pradesh hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) **Narendra Luther,**
*Signature of Publisher.*

* The Director, Government Printing Press, Hyderabad is the official Printer but he may name any other Printer when the Government Press cannot undertake printing of this Journal.